# ప్రజా నటుడు 'కర్నాటి'



సంకలనం:

డి.ఎం.కె. గాంధి,
పిడికిటి రామకోటేశ్వరరావు

గౌతమి ప్రచురణలు
విజయవాడ

ప్రజానట్యుడు 'కర్నాటి'
ప్రతులు : 2000
ఆగస్టు: 1990

వెల : రూ. 30/-



ప్రతులకు:
సాహితీ నవజీవన్ బుక్ లింక్స్
మ్యూజియం రోడ్డు, విజయవాడ-2

అరుణా పబ్లిషింగ్ హౌస్
ఏలూరు రోడ్డు, విజయవాడ-2

ముద్రణ:
శ్రీకృష్ణా ప్రింటర్స్
విజయవాడ-10.

ముఖపత్ర ముద్రణ:
నాగార్జున ఎంటర్ప్రైజెస్
విజయవాడ

చిత్రాలంకరణ :
బాలి, టిషి

# శ్రీ నన్నపనేని నాగేశ్వరరావుగారి పరిచయం



జననం : 8-8-1949 దుగ్గిరాల గ్రామంలో

తల్లితండ్రులు : బాపనయ్య, సీతారావమ్మ
వీరికి 5గురు సోదరులు, ఇద్దరు సోదరీమణులు.

విద్యాభ్యాసం : దుగ్గిరాలలో.

వ్యాపారం : రాయల్ గ్యాస్ కంపెనీ, మంగళగిరి.

విదేశీ పర్యటన : 1975లో ఇస్కాన్ ఆధ్వర్యంలో ఇరాన్. సోవియట్ యూనియన్, తూర్పు జర్మనీ, పశ్చిమ జర్మనీ, పోలెండు, చెకోస్లవేకియా, స్విట్జర్లాండ్, పారిస్, రోమ్, కువాయిట్ లలో, 1938లో గ్యాస్ డీలర్ అసోసియేషన్ ప్రతినిధిగా అమెరికా,జపాన్,మలేషియా,బ్యాంకాక్ మరియు సింగపూర్ ల్లలో పర్యటించారు,

వివాహం : 1976లో నిమ్మకూరు వాస్తవ్యులు అడుసుమిల్లి రంగారావు గారి కుమార్తె లక్ష్మితో.
వీరికి ఒక కుమార్తె.

ఇతర వ్యాపకాలు: 1974 నుంచి 1979 వరకు సినిమా వ్యాపారం. 1980 లో ఆంధ్రప్రదేశ్ న్యూస్‌పేపర్సు అండ్ మాగజైన్స్ఏజంట్సు అసోసియేషన్ ప్రధానకార్యదర్శి.

1982లో రాయల్ ఎంటర్‌ప్రైజెస్ పేరుతో మంగళగిరి, విజయవాడ, విశాఖపట్టణాలలో టెలివిజన్ వ్యాపారం కొత్త రకం యాంటినా కనుక్కొని మద్రాస్- సిలోన్ టెలివిజన్ ప్రసారాలు చూపించారు.

1990 జనవరి నుండి విజయవాడ ప్రజలు చుట్టుప్రక్కలు ఎక్స్ఛేంజిలకు ఫోన్ చేస్తే ఎస్.టి.డి గా చేయబోతే వీరు మంగళగిరి మండల టెలిఫోన్ వాడకం దారుల సంక్షేమ సంఘం ప్రధానకార్యదర్శిగా అది అమలు జరగకుండా నిరోధించుటకు కృషి చేశారు.

1982 నుంచి మంగళగిరి మండల ప్రయాణీకుల సంఘం ప్రధాన కార్యదర్శిగా వుంటున్నారు.గుంటూరు,తెనాలి రైల్వే లైను విద్యుద్దీకరణ, మంగళగిరి- విజయవాడ సిటీబస్సులు వీరి కృషి ఫలితాలు. విజయవాడ గుంటూరు రైల్వేస్టేషన్‌ల అభివృద్ధికి కృషిచేశారు. 1986 నుండి 1991 వరకు గుంటూరు రైల్వేస్టేషన్ కన్సల్టేషన్ కమిటీ మెంబరు.

1985లో సాహితీ కళాసమితి స్థాపించి నాటకాలు ప్రదర్శింపచేస్తూ కళాకారులను ప్రోత్సహిస్తున్నారు.లయిన్స్ క్లబ్ వంటి సేవాసంస్థలలో డిస్ట్రిక్ట్ ఛైర్మన్ కార్యదర్శి. అధ్యక్షపదవులు నిర్వహించి ప్రజాహిత కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు.

# కృతి గ్రహీత

'కాలం అద్దం లాంటిది'

అది మన ప్రతిబింబం!

సాహసవంతుడు యిచ్ఛా ప్రయత్నబలంతో కాలం సవాలును స్వీకరించి ముందుకు సాగిపోతాడు.

"సాహసి కానివాడు జీవన సమరానికి పనికిరాడు
హిమసుందర శృంగమైన ఎవరెస్టును ఒక్కటెన్సింగే
ఎక్కగలడు" ఇది ఒక కవి వాక్కు

తమచట్టూ గిరిగీచుకొని ఆ పరిధిలో మనుగడ సాగించేవారు కొందరైతే, జీవితానికి ఒక పరమార్ధాన్ని కల్పించుకొని లక్ష్యసాధన కోసం నిరంతరం శ్రమించేవారు కొద్దిమంది.అందులోనూ పరోపకార బుద్ధితో జీవనయాత్ర సాగించే వారు బహుకొద్ది మంది!

అందుకే వేమన "పురుషులందు పుణ్యపురుషులు వేరయా" అన్నాడు.

ఈ కృతిని స్వీకరిస్తున్న శ్రీ నాగేశ్వరరావుగారు సౌజన్యమూర్తి!

ఈయన హేతువాది, ఏ విషయాన్నయినా శాస్త్రీయ దృక్పథంతో పరిశీలిస్తారు.

నవ్యతను స్వాగతిస్తారు.

పుట్టిన ప్రతిజీవి బతుకుతుంది. బతకడం కాదు ముఖ్యం, జీవించాలి అంటాడు ఆస్కార్‌వైల్డ్. ఈ ఆదర్శాన్ని తన మనోఫలకంలో చెరగని ముద్రగా రూపుదిద్దుకున్నారు శ్రీ నాగేశ్వరరావుగారు. పదిమందీ బాగుపడాలనే ఆకాంక్ష, తపన ఈయనలో సదా చోటుచేసుకొని ఉంటుంది. నిరాడంబరుడు, నిజాయితీ పరుడు. "మాట్లాడేవారికి ఏమీ తెలియదు, తెలిసినవారు మాట్లాడరు" అంటాడు "లౌషు" శ్రీ నాగేశ్వరరావుగారు మితభాషి; ఉన్నత ఆశయాలు కలవారు.

తన కష్టసుఖాల్ని ఇతరులకి తెలియజేయడానికి పడే తాపత్రయంలో పదో వంతు పరుల కష్టాలు అర్థం చేసుకోడానికి ప్రయత్నిస్తే అతనిలో దైవాంశ ఉందన్నమాటే అంటాడు డేవిడ్ మెకాలే. ఈ సూక్తిని అక్షరాలా పాటించే వ్యక్తి నాగేశ్వరరావుగారు. ఈయన సర్వజన బాంధవుడు. ఎవరికి ఏ అవసరం వచ్చినా ఆదుకొనే స్వభావం వీరిది.

రైతుబిడ్డగా జన్మించారు. వ్యాపారవేత్తగా రాణిస్తున్నారు.
లలితకళలను ఆదరించారు. కృతి స్వీకర్తగా వినుతికెక్కారు.
చిన్ననాటి నుంచి నాటక కళ అంటే మక్కువ ఎక్కువ.
ఎందరో కళాకారులను సన్మానించారు.

తాను స్వయంగా ముఖానికి రంగు వేసుకొని నాటకాలు ప్రదర్శించి కళారంగానికి సేవచేశారు. విదేశాలలో విస్తృత పర్యటన జరిపి విశేష పరిజ్ఞానాన్ని సంపాదించారు. వినియోగదారులను చైతన్యవంతం చేయడంలో వీరి పాత్ర శ్లాఘనీయమైంది. ఈయన స్థాపించిన "సాహితీ కళాసమితి" వీరి కళాతృష్ణకు ప్రతీకగా నిలిచింది. డాక్టరు డి.వై సంపత్కుమార్, శ్రీ నటరాజ రామకృష్ణ, ప్రజానటుడు శ్రీ కర్నాటి వంటి ప్రముఖ కళాకారులను, సత్కరించి సన్మానించి కళాంజలులర్పించారు. ఆయన కళాసేవకు సామాజిక సేవకు అద్దంపట్టే ఇలాంటి కార్యక్రమాలు ఇంకా ఎన్నో ఆయన జీవితంలో ముడివేసుకుపోయాయి.

1987లో గ్యాస్ వాడకందార్ల సేవార్థం విజయవాడ మ్యూజియంరోడ్డులో రాయల్ ఎంటర్ ప్రయిజెస్‌ను స్థాపించి అందులో వచ్చే ఆదాయాన్ని పూర్తిగా ప్రజాసేవకే వినియోగించడం, ఆయన వితరణశీలతకు మచ్చుతునక. ఎంతో మంది పేద విద్యార్థులకు చదువు చెప్పించారు. తల్లితండ్రుల పేరిట మంగళగిరి డాన్‌బాస్కో స్కూల్‌లో విద్యార్థులకు అవార్డులు ఇవ్వడం గమనిస్తే విద్య పట్ల వీరికిగల మక్కువ చెప్పక చెబుతుంది.

ఇతరులలోని ఔన్నత్యాన్ని గుర్తించి వారికి విలువ ఇచ్చి గౌరవించే వ్యక్తి తాను విలువను, గౌరవాన్ని పొందగలుగుతాడు. స్వతహాగా కళాకారుడైన శ్రీ నాగేశ్వరరావు కళాకారుల ఔన్నత్యాన్ని గౌరవించడంలో ఆశ్చర్యంలేదు.

సమతాబుద్ధిని అలవరుచుకోనంత వరకు మనిషికి సుఖంలేదు, ఆనందం లేదు. ఈ సత్యాన్ని గ్రహించి సంఘసేవలో తన జీవితాన్ని సార్థకం చేసుకుంటున్న శ్రీ నాగేశ్వరరావు ధన్యజీవి.

మంచి పుస్తకాలు చదవడం, మంచివారితో మాట్లాడడం మంచినీ చెలిమిని పెంచుకోవడం జీవితాన్ని సన్మార్గంపైపు నడిపించడానికి తోడ్పడే సోపానాలు. స్నేహశీలి శ్రీ నాగేశ్వరరావు ఈ పుస్తకం అంకితం పొందడానికి అన్ని విధాల అర్హులు. స్వీకర్త నాగేశ్వరరావుగారూ! మీరు కళాపోషకులు, సరసహృదయులు. ఈ పుస్తకంలోని కథానాయకుడు శ్రీ కర్నాటి నాటక కళను ఉగ్గుపాలతో రంగరించుకొని, అనునిత్యం కళామతల్లి సేవలో తలపండించుకున్న కళాతపస్వి, కళను జనజీవనానికి సన్నిహితంగా తీసుకువెళ్ళిన ప్రజానటుడు. ప్రగాఢంగా పెనవేసుకుపోయిన మైత్రి మీది. స్నేహానికి అర్థాన్ని,పరమార్థాన్ని సూచించిన చెలిమి మీది! ఈ కొత్త బాంధవ్యం మీ ఇరువురి మైత్రిని మరింత దృఢతరం చేస్తుందని విశ్వసిస్తున్నాము.

—సంకలనకర్తలు

పుట

# ముందుమాట

ఇది 'కర్నాటి' జీవిత దర్పణం....

నాటకరంగం మొదలు జనపదులు వేసే

చిందువరకు అనేక కళారూపాల్లో

లబ్ధప్రతిష్ఠుడైన కళాప్రపూర్ణుని

ప్రజ్ఞా ధురీణతకు ఇది కళాంజలి ..

కళలను ప్రజలకు సన్నిహితం చేయటానికి నిరంతరం పాటు

పడుతున్న ప్రజానటుడు, జానపద కళాద్రష్టకు

ఇది అక్షరాంజలి....

'కళ కళకోసం కాద'ని, జన జీవితాన్ని రూపు దిద్దగలిగే

'ఉత్తమ సాధనమ'ని నమ్మి. ఆ లక్ష్యం దిశగా అహరహం

శ్రమిస్తున్న కళాజీవికి అక్షరపుష్పాంజలి...

అన్నిటికి మించి గొప్పవక్త మానవతావాదికిది

అక్షర నివాళి...

ఈ ఆదర్శ కళాకారుని జీవిత విశేషాలు

'గ్రంథస్తం' చేయాలన్న కళాభిమానుల, మిత్రుల

సంకల్పానికి ఈ సంకలనం రూపకల్పన...

మా ఈ ప్రయత్నానికి సహకరించిన

వారెందరో మహానుభావులు-అందరికీ వందనాలు.

ప్రత్యేకించి ఈ సంకలనం వెలుగులోకి రావడానికి

కొండంత అండగావుండి వెన్నుతట్టి ప్రోత్సహించిన

శ్రీ నన్నపనేని నాగేశ్వరరావు గారు, వారి శ్రీమతి లక్ష్మిగార్లకు

మా కృతజ్ఞతాభి వందనాలు...,

—సంకలన కర్తలు



ప్రజానటుడు శర్మాజీ

# కళా విరాట్
# 'కర్నాటి'

కొమ్ములు తిరిగిన మనిషి
అయినా అలా ఉండరు
కొండంత ప్రజ్ఞగల మనిషి
అయినా అలా ఉండరు
కోటిమంది మిత్రులున్న మనిషి
అలా కోటికి పడగెత్తిన మనిషి
మల్లె రేకులు అద్దుకున్న
మంచి గంధం చెట్టులా
దారి తప్పి దిగి వచ్చిన
ధవళమేఘ శకలంలా
ధూళి మహానగర వీధుల్లో
దేవ దూతలా సాక్షాత్కరించే
ఓ అరుదైన రూపం ఆయన
ముకుళిత హస్తం మందస్మితం
చెలిమి కట్టిన
సౌజన్యం సౌహార్ద సౌరభం
సంగమించిన
ఓ సమీర వీచిక ఆయన
గడ్డిమొక్క కనిపించినా
ఆకసాన తలదాగిన

మహావృక్షం ఎదురైనా
శిరసొంచే సంస్కారగిరి ఆయన
ఏదీ... మరొక్కసారి అని అడగాలేగాని
అప్పటికప్పుడు అక్కడికక్కడ
ఎన్నెన్ని అభినయ వీచికలు
ఎన్నెన్ని గుబాళింపులు
ఎన్నెన్ని చిత్ర విచిత్ర పద విన్యాసాలు
ఈ క్షణంలో జానపదుడు
మరుక్షణాన కథా సారథి
అన్నీ ఒక్కచోట రాసిపోసిన
కళా మణిమాల కళా విరాట్
కర్నాటి అభినయ లక్ష్మీనరసయ్య
ఐదు దశాబ్దాల క్రితం
పది పన్నెండేళ్ళ ప్రాయంలో
తొలిసారి తొలిచిందు వేసింది మొదలు
తొలిగొంతు విచ్చింది మొదలు
తొలిపొంగు పొంగింది మొదలు
నేటివరకు విడుపులేదు
అలుపులేదు ... ఆగలేదు...

—చక్రపాణి

# కళావధాని కర్నాటి

—పిడికిటి రామకోటేశ్వరరావు
(బి.యస్‌సి; బి.ఎ. సాహిత్య విశారద)

శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్యగారు ప్రప్రథమంగా నాకు కష్టమర్‌గా పరిచయ మయ్యారు. తరువాత సాహిత్య గ్రంథాలను గూర్చి చర్చిస్తూ సన్నిహితుల మయ్యాము. మరి కొద్ది కాలానికి ఆంధ్రనాటక కళాసమితి నిర్వాహకుడుగా, కళా కారుడుగా ఆంధ్రనాటక కళాసమితిలో నాకు ప్రవేశంకల్పించి కళాభిమానం పెంపొం దించారు. ఆనాటి నుంచీ నేటికి 23 సంవత్సరాలుగా సన్నిహితంగా సాహిత్య కళా విషయాల సల్లాపాలతో సరాగాలతో స్నేహాన్ని నెరపుతున్నాం. ఈ స్నేహ జీవితంలోని కొన్ని మధురిమలను ఈసందర్భంగా నెమరు వేసుకొంటూ సోదర కళాభిమానులకు నివేదించు కొంటున్నాను.

నా పరిచయానికి ముందు గత జీవిత విషయాలను నేను ఎలా క్రోడీకరించాను అనేది ప్రశ్న. ఆ విషయాలను మేము చర్చించుకొంటున్నప్పుడు వచ్చిన ప్రస్తావనల లోనూ, వారిద్వారా స్వయంగానూ, వారి మిత్రుల ద్వారాను, కళాకారుల ద్వారాను వారికి జరిగిన సన్మానాల సారాంశం ద్వారాను, వారిని గూర్చిన వ్యాసాల ద్వారాను నేను విన్నవీ, గ్రహించినవీ పొందుపరచటానికి ప్రయత్నించాను. గతానికి ఎప్పు డైనా, ఎవ్వరికైనా చరిత్రయే ఆధారం. అదే ప్రామాణికం.

శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్యగారు జన్మించింది కృష్ణాజిల్లా తిరువూరు తాలూకా తునికిపాడు గ్రామం. రైతుకుటుంబంలో. ఈయనే పెద్దకొడుకు కావడంతో ఆర్థిక పరిస్థితులవల్ల బాధ్యతల భారంవల్ల చదువుకోవాలనే కుతూహలమున్నా అది సాఫీగా కొనసాగలేదు. తర్వాత మేనమామగారి ఆదరాభిమానాలతో ఖమ్మంజిల్లా దెందుకూరులో నివసిస్తూ భావి జీవితానికి బాటలు వేసుకున్నారు. ఆయనకు చిన్నతనంనుంచీ హాస్యం అంటే యిష్టం. అందుకని ఆకతాయి తనంగాకూడా హాస్యోక్తులు స్ఫురించే టట్లు మాట్లాడటం అలవాటు. అది నేటికీ ఆయన సంభాషణా సరళిలో తొణుకుతూనే వుంటుంది. తిరువూరు తాలూకా తునికిపాడులో ఆచార్య రంగాగారి నాయకత్వంలో రైతాంగ విద్యాలయం నిర్వహించబడింది. ఆ సందర్భంగా అనేకమంది నాయ కులు విచ్చేసి ఉపన్యాసాలు ఇవ్వటం జరిగింది. ఆ సభల్లోనే

"మా కొద్దూ ఈ తెల్ల దొరతనం
మా ప్రాణాలపై పొంచి మానాలుహరియించు ॥మా॥
...దారి డొంకలు లేని వూళ్ళన్నా
మన పల్లెకొంపలు దమ్మిడీకి పనికిరావన్నా॥

మున్నగు దేశభక్తిగీతాలు ఆలాపించి, బోధలు చేసేవారు. ఆ బోధల్లోని చైతన్యంతో కర్నాటివారి మదిలో సామాజిక దృక్పథానికి అంకురార్పణ జరిగింది. తర్వాత గద్దె లింగయ్యగారి "అమ్మ," మద్దూరి అన్నపూర్ణయ్యగారి "కాగడా" చదువు తుంటే అవ్యక్తంగానే అలాంటి సాహిత్యం చదవాలనే కుతూహలం, ఆవేశం. సమాజంపట్ల ఆవేదన పెల్లుబికాయి. క్రాంతి పథంలో జీవితగమ్యానికి దారితీశాయి. దెందుకూరులో నాటక సమాజ ముండేది. తరచుగా వారు నాటక ప్రదర్శన చేస్తుండే వారు. వాటన్నిటికీ హాజరవుతూ సూక్ష్మంగా పరిశీలించి, అవగాహన చేసుకోవడం వల్ల నాటకాలపట్ల ఆసక్తి, ఉత్సాహం పెరిగాయి. ఈ చొరవతోనే కనకతార నాటకంలో ఒక వేషం వేసే అవకాశ మొచ్చింది. కాని తుదిక్షణంలో సభాభయంతో డైలాగు చెప్పలేకపోయేసరికి ఆ అవకాశం చేజారిపోయింది, తర్వాత నటుడు కాలేక పోగా ఆదిలోనే హంసపాదు అనిపించిందేమో కాని యిప్పుడు ఆయన నట జీవితానికి ఆ సంఘటనతో దోషం తొలగినట్లుగానే భావించుకుంటాం. దెందుకూరులో ప్రాథమిక విద్యాభ్యాసం కొంత జరిగాక తర్వాత ఖమ్మంలో ఉర్దూభాషలో బొమ్మిదవ తరగతి, అటు తర్వాత తునికిపాడులో ప్రైవేటుగా మెట్రిక్ చదివారు. మెట్రిక్ చదివే రోజుల్లోనే వారి ఉపాధ్యాయులు మాదిరాజు జనార్దనరావుగారు, అల్లూరి సీతారామరాజు జీవిత చరిత్ర రచయిత పొన్నలూరి రాధాకృష్ణమూర్తిగారు అనేక విషయాలపై చర్చించుకొంటూ వుండేవారు. వారి చర్చలు కర్నాటి జీవితాన్ని కొంత ప్రభావితం చేశాయి.

లక్ష్మీనరసయ్యగారు ఖమ్మంలో చదివే రోజుల్లోనే "ముందడుగు"నాటకంలో ప్రధానమైన నాయక పాత్రధరించే అవకాశం కలిగింది. రంగస్థలం మీద అదే ఆయన "మొదటి అడుగు." పూవు పుట్టగానే పరిమళిస్తుందన్నట్లు ఆయన నటన అభినందించబడింది. డాక్టర్ రాజారావుగారు కూడ ఈ ప్రదర్శన తిలకించి ఆయన ప్రతిభను గుర్తించి ఆశీర్వదించారు. అప్పటినుంచీ తాను ఏ పాత్ర ధరించినా అత్యుత్తమంగా గణనీయంగా అగ్రస్థానంలో వుండాలనే ఆకాంక్ష, పట్టుదల ఆవహించాయి. ఆ దీక్ష ఆయన నటజీవితంలో కీర్తిపతాక ఎగుర వేయడానికి నాంది పలికింది. ఆ రోజుల్లోనే తెలంగాణాలో ఆంధ్రమహాసభ నాయకత్వాన దాని కార్యకర్తలు ప్రజలను చైతన్యం

చేయడానికి, నిజాం నిరంకుశ ప్రభుత్వ వ్యతిరేక పోరాటానికి ప్రజలను సమాయత్తం చేయడానికి జానపదకళారూపాలు ప్రదర్శిస్తూరాత్రిపాఠశాలలు నిర్వహిస్తూవుండేవారు. వారు నిర్వహించేబుర్రకథలు ఎక్కడ చెప్తున్నా కర్నాటి వెళ్ళి వినేవారు. స్పందించే వారు. ఆ ఆసక్తితో ఆంధ్రమహాసభలో ప్రవేశించడానికి అవకాశం కలిగింది. ఈ సభలో సభ్యుడుగా వుంటూ గ్రామగ్రామాలకు వెళ్ళి రాత్రిపాఠశాలలు నడుపుతుండే వారు. రజాకార్ మూవ్‌మెంటులోకూడా గూండాలకు వ్యతిరేకంగా ఆయన మిత్రులొకరు ఉద్ఘాటించినట్లు "కళాసే వీరుడు"గా కూడా కదంతొక్కారు. ఈ ప్రజాహిత జీవితానికి తార్కాణంగా బాల్యమిత్రుడు, ఆనాటి ఆంధ్ర మహాసభ కార్యకర్తల్లో ప్రముఖుడు అయిన డాక్టర్ దాశరథిగారి అభినందన వాక్యాలు యివి– "అభ్యుదయ కళాకారుడు, స్వాతంత్ర్య సమరవీరుడు, సద్గుణసంపన్నుడు, తినీతినక కాలినడకన వేలమైళ్ళు తిరిగి, గ్రామగ్రామాన రాత్రి పాఠశాలలు నడిపి వయోజన విద్యారంగంలో కృషిచేసి విద్యాదానం చేసిన మహావ్యక్తి మా కర్నాటి లక్ష్మీనర్సయ్య...కర్నాటి కళాకారుల్లో మహావీరుల్లో మేటి. కర్నాట సంగీతాన్ని, కర్నాటినీ నా మనసులో దాచాను". ఆ విధంగా కర్నాటి ఉద్యమకారుడై నిజాంప్రభుత్వ శిక్షలకు గురయ్యారు. అదే కాలంలో అభ్యుదయ నాటకరంగానికి ప్రతీకగా నిల్చిన ప్రజానాట్యమండలి వీరిని ఆహ్వానించింది. నాటి నుండి ప్రజానాట్యమండలి ఆశయాలు, ఆదర్శాల మార్గ దర్శకత్వంలో శిక్షణపొంది క్రమశిక్షణతో ప్రజానటుడుగా పేరుగాంచారు. కళ కళ కోసమేగాదు, కళారూపాలు సమాజాభ్యున్నతికోసం, ప్రజాప్రగతికోసం వినియోగ పడాలని నిర్ద్వంద్వంగా విశ్వసించారు. "ముందడుగులో" కథానాయకపాత్ర "ప్రెసిడెంట్ పట్టయ్య"లో పట్టయ్య, "మాభూమి"లో రాముడు, "అంతా పెద్దలే"లో చైనులు, "ఛైర్మన్"లో స్వామీజీ యింకా ఎన్నో నాటకాలలో విభిన్న పాత్రలు ధరించి తమ నటనావైభవంతో ప్రజా హృదయాలలో చెరగని ముద్రలు వేశారు. సామాన్య ప్రజానీకాన్నీ, కళాభిమానులనే కాదు– "అభినయం" గ్రంథకర్త శ్రీశ్రీనివాస చక్రవర్తిగారు కూడా ఉప్పొంగిపోయి "తొలిసారి శ్రీలక్ష్మీనర్సయ్య నటనను చూసినప్పుడు ఆంధ్రనాటకరంగం మీద ఒక అగ్నికణం, ఒక మహానటుడు వెలిశాడని ఉప్పొంగిపోయాను" అన్నారు. అల్లూరి సీతారామరాజు, కష్టజీవి, వీరేశలింగం మొదలైన బుర్రకథలద్వారా ప్రజలను జాగృతం చేశారు. ఆంధ్రదేశంలోని అనేక జానపద కళారూపాలలో పాల్గొనడమేగాదు, ఏ ప్రక్రియ చేపట్టినా అందులో తన నటన అగ్రస్థానం వహించాలన్న లక్ష్యంతోనే కళాకారుడిగా కృషిచేశారు. దీక్షతో సాధించారు,

కవియైనా, కళాకారుడైనా గాయకుడైనా తనధ్యేయానికి అంకితం కావాలి. అలా అయినప్పుడు కృషి ఉన్నతస్థాయి నందుకుంటుంది. అది కొరవడితే ప్రజ పరిహసిస్తారు. కవిలో వికసించిన భావ వికాసం కళాకారునిలో ప్రతిస్పందించాలి. గాయకుని పల్లవిలో పారవశ్యం పరిఢవిల్లి ప్రజానురంజకం కావాలి. రచయిత భావానికి శిల్పాకృతి కల్గించేవాడు, కవిగాని భావోద్దీపనాన్ని కళోద్దీపనద్వారా రసప్లావితం చేసేవాడు, ప్రేక్షకునిపై చెరగని ముద్ర వేసేవాడు కళాకారుడు. కనుక కళాకారుడు ప్రతిభావంతుడైతే శిల్పం కమనీయంగా వుంటుంది. కళకు అంకితంకాని కళాకారుడైతే, అంటే తాను తననుగా మరచి పాత్రలో తగురీతి లీనం కాకపోతే శిల్పం నిర్జీవంగా వుంటుంది. రంగస్థలంమీద కళాకారుడి జీవన్మరణాలు ఈ నటనలోనే. నటుడు రంగస్థలంమీద తన పాత్రలో ప్రదర్శించే శిల్పం నిజజీవితంలో తానుగా అంటే ఆ పాత్రధారి ఎవరో గుర్తించలేనంత అద్భుతంగా ప్రతిభ చూపాలి. ఏకత్వంలో భిన్నత్వం అంటే వైవిధ్యం ప్రదర్శించగలనేర్పు, ఓర్పుగలవాడే ఉత్తమ కళాకారుడు కాగలడు. ప్రజానాట్యమండలిలో డాక్టర్ గరికపాటి రాజారావుగారు, కోడూరు అచ్చయ్యగారు, గురువులుగా కర్నాటిని తీర్చిదిద్దారు. ఉన్నత కళాకారునిగా సమాజానికి అందించారు. ఆయన కళాపరమైన ప్రతిప్రసంగంలోనూ తనగురువులకు కృతజ్ఞత లర్పిస్తూ వుంటారు. సహచరులను కీర్తిస్తూ వుంటారు.

మనం సామాన్యంగా ఎవరైనా ఒకవ్యక్తిని గురించి వారికి పరోక్షంగా చర్చించుకొనేటప్పుడు వారి గుణావగుణాలను, మంచిచెడ్డలను ఏకరువుపెట్టి ఉత్తముడో మధ్యముడో, అధముడో అని నిర్ణయిస్తాము. ఆ వ్యక్తిని పూర్తిగా పొగడడానికి మనస్కరించక పోతే కొన్ని అవగుణాలను మినహాయిస్తే, అతడు గొప్పవాడనో, మంచివాడు అనో నిర్ణయించేస్తాం. మరి కర్నాటి లక్ష్మీనరసయ్యగారు చేసేదేమంటే తాను పరిచయం చేయదలచిన వ్యక్తిని ప్రత్యక్షంగాను, పరోక్షంగానూ విశిష్ట వ్యక్తిగానే మనకు దర్శింపజేస్తారు. ఆ వ్యక్తిపట్ల మనకు గౌరవం, స్నేహభావం కలిగేలా చేస్తారు.

నిజవర్తనమునందనుకూల వృత్తి, కాపురుషులయందు శాఠ్యము, సుబుద్ధులయందనురక్తి దాల్మి సద్గురువులయందు గౌరవము కోవిదులయందు నయంబు అన్నట్లు భర్తృహరి భావంతో పోల్చితే కర్నాటి వారిదీ వరుస అంటే ఆశ్చర్యపడనవసరం లేదనుకుంటాను. రంగస్థలనటుడుగా, జానపదకళాకారుడిగానే కాకుండా యింకా ఆకాశవాణిలో శ్రవ్యనాట కళాకారుడుగా, సినీనటుడుగా, వక్తగా, ప్రయోక్తగా పేరుపొంది ఉన్నతస్థాయి నందుకున్నారు. నేటికీ కళాజీవిగానే

రంజిల్లుతున్నారు. ప్రజానటుడుగా నలభై సంవత్సరాలు నటజీవితాన్ని రంగరించి నేడు రంగస్థల నిర్వాహకుడుగా, దర్శకుడుగా, జానపద కళాకేంద్ర స్థాపకుడుగా, వక్తగా తన నటజీవన పరిణామ దిశగా నడుస్తున్నారు. "ఆనాటి మహాకవి పోతరాజు వలె ఈనాటి మహానటులు మీరు హాలికులైననేమి అని హలం చేపట్టి కర్షకులూ అయినారు. నటనలో ముందడుగు వేసే నటశేఖరులూఅయి నారు. అదే మీ రససిద్ధికి తార్కాణం. నిజాయితీ మీ సొమ్ము." అంటూ ఆయన్ని అభ్యుదయ పథగామిగా జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రిగారు అభివర్ణించారు.

కర్నాటి లక్ష్మీనరసయ్యగారు యిలా కీర్తిమంతులు కావడానికి కారణం ?

కర్నాటి లక్ష్మీనరసయ్యగారు స్ఫురద్రూపి. చూడగానే ఈయనెవరో తెలుసుకోవాలనే ఉబలాటం ఎదుటివారిలో కలిగించే రూపం. మల్లెలాంటి తెల్లటి ఖద్దరు వస్త్రధారణ. మెల్లగా చొరవ చేసుకొని మాట్లాడే నేర్పు. ఇవి ఆయన పరిచయానికి వ్రాసే వాక్యాలేకావు. నిజజీవితంలో ఆయనతో ఎవరికైనా పరిచయానికి ప్రారంభ సన్నివేశం. ఆ తర్వాత పరిచయం పెరిగి సంభాషణ పెరిగినకొద్దీ సునిశిత సంభాషణా సురభిళమూర్తిగా మనసులో మెదుల్తూ వుంటారు. సౌహార్ద్రస్ఫూర్తిగా, సుహాసితుడుగా, స్నేహాంజలి ఘటించి సర్వజన సమ్మోహనా స్రష్టగా స్నేహవలయాన్ని విసిరి. విడవడని స్నేహాన్ని విరామం లేకుండా కొనసాగిస్తారు. ఈ విధంగా ఆయన మైత్రి మరుపురానిదిగానే వుంటుంది. సుమతీ శతకకారుడు చెప్పినట్లుగా "ఎప్పటికెయ్యది ప్రస్తుత మప్పటికా మాటలాడి యన్యుల మనముల్ నొప్పింపక, తానొవ్వక-" తలలో నాలుకగా అందరినీ ఆకట్టుకోవడంలో అనుభవశాలి. ఈ ఆచరణానుభవంతో తొలిగా కొద్దిమంది కళాభిమానులతో కలిసి "ఆంధ్ర నాటక కళాసమితి" పేరుతో ప్రేక్షక సంఘాన్ని ప్రారంభించారు. తన వాక్చాతుర్యంతోను, సంభాషణా సరళితోనూ, స్నేహవాతావరణంతోనూ, కళాత్మక శక్తితోనూ ఎందరో కళాభిమానులను, కళాపోషకులను సంఘటితంచేసి, నిరాఘాటంగా ఆ సంస్థను విజయవాడలో సుమారు రెండు దశాబ్దాలపాటు" నీటుగా, మేటిగా నిర్వహించగలుగుతున్నారంటే ప్రజాకవి వేమన నుడివినట్లు "మాటలాడనేర్చి మనసు రంజిలజేసి పరగ ప్రియముచెప్పి బడలకున్న నొకరిచేతసొమ్ము లూరకవచ్చునా"- సంస్థలు నడుపుట సాధ్యమా! ఈ అక్షరసత్యాలను ఆచరిస్తున్న అనుభవజ్ఞుడు గనుక అది ఆయనకే సాధ్యం అనక తప్పదు. ఈ సంస్థద్వారా ఔత్సాహిక కళాకారులకు చీకటిలో చిరుదీపంలా కళాభినివేశం కల్పించే కళా బాంధవుడు, కళోపదేశకుడూ; కళాకారులకు, కళాపోషకులకు, కళాభిమానులకూ ఆయనొక వారధి.

నాటకరంగ విన్యాసానికి వికాసానికి ఆయనొక సారథి. నమ్మి గురువుగారూ అంటే నయగారం "నీ వెంతలే అనుకుంటే నేనూ అంతేలే" అన్నట్టుగా సునిశితంగా వ్యవహరించే కళాచాతుర్యంగలవారు.

తామసికాడు తాపసి. కళాతాపసి, కళాపిపాసి. గుళ్ళు గోపురాలు అంటే విముఖుడు. రంగస్థలమే ఆయన దేవాలయం. కళారాధనయే ఆయన సల్పే పూజ, ఉత్తమ నటనమే నివేదన. కళాప్రంశసనమే నీరాజనం.

ఆయన చైతన్య భావాలు కలిగి వుండటమేగాదు. ఎదుటి వారికికూడాచైతన్య భావస్ఫూర్తిని కల్గించే చేతనావంతుడు. ఆయన తన విషయ పరిజ్ఞానాన్ని అందించి, పరిచితుల్లో కళాచైతన్య స్ఫూర్తిని కలిగించి, కళాభిమానులుగా, కళాపోషకులుగా సమ్మోహింపజేసే సమ్మోహనాశీలుడు.

ఆయన నిజజీవితంలో కూడా నటిస్తాడు. ఎలాగంటే హాస్యచతురోక్తులు విసరుతూ సందర్భానుసారంగా సమయోచితంగా వ్యంగ్యాత్మక ఉక్తియుక్తులు ప్రయోగిస్తూ మిత్రుల మధ్య సభలు సమావేశాల్లో ఆట విడుపు చేయడంలో మేటి. ఏదైనా సమస్య తలయెత్తినా యితరులను నొప్పించక తానొవ్వక సందర్భాన్ని స్నేహపూర్వక వాతావరణంలోకి మార్చి సుఖాంతంగా ముగింపు చేయడంలో అనన్య సామాన్యుడు.

కర్నాటి లక్ష్మీనరసయ్యగారిని గూర్చి బాగా అవగాహన చేసుకోవాలంటే కావలసినంత సమయం నిర్ణయించుకొని కమనీయమైన విందుభోజనం యేర్పాటు చేసుకొని నాలక్షేపం చేస్తుంటే కళాసాహిత్య సరససల్లాపోక్తులతో హాస్యరసభావ మిళితంగా సాధ్యయనం చేసిన స్రష్టగా అన్ని రంగాల అనుభవాన్ని రంగరించి ఆ పోసన పట్టిన అవధానిగా మనోరంజకం గావిస్తారు.

క్రమశిక్షణతో రంగస్థల నటుడిగా తీర్చిదిద్దబడి నేడు రంగస్థల నిర్వాహకునిగా క్రమశిక్షణ అమలుచేయడంలోగాని సమయాన్ని పాటించడంలోగాని క్రమం తప్పడానికి రాజీపడని నిర్భయుడు. డ్యూటీ విషయంలోనూ, బ్యూటీ విషయంలోనూ నియమాన్ని పాటించడంలోనూ మోమోటమెరుగని మగధీరుడు.

"తామసించి చేయదగపెట్టి కార్యంబు
వేగరింప నదియు విషమె యగును
పచ్చికాయదెచ్చి పడవేయ ఫలమగునె?"

అని అనుభవశాలి వేమన నుడివినట్లుగానే తాను చేపట్టదలచిన కార్యక్రమాన్ని నిశితంగా ఆలోచించి పరిశీలించాకనే అందుకు పూనుకునే జాగరూకుడు.

పొగిడితే పూలహారాలు వేసినంతగాను, విమర్శచేస్తే ముల్లుతో గుచ్చినట్లుగాను ఫీలయినట్లు కనిపించినా పునరాలోచించుకొని "అదికూడా సబబేనేమో" అనే సమాధాన సరళితో సరిపెట్టుకుపోయే సమన్వయశీలి.

ఇటీవల ఒక దశాబ్దంలోగా సమాజంలో కులప్రస్తావనమొక గందరగోళంగా అభ్యుదయానికి అనర్థంగా దాపురించింది మనచుట్టూ వున్న పరిస్థితుల ప్రభావంతో ఆయన కులమేదోనన్న వూహ కల్గినప్పుడు నేను ఆయనది నటకులం అని నిర్ధారించు

కున్నారు. శ్రీ సి. ఎస్. రావుగారు మరో ముందడుగు వేసి "ఆయనది మనసున్న మనుషులకులం" అన్నారు.

సమాజంలో అన్ని వర్గాల వారితోనూ, భిన్నాభిప్రాయం గలవారితోనూ సమతాదృక్పథంతో వ్యవహరిస్తూ భిన్నత్వంలో ఏకత్వం, ఏకత్వంలో భిన్నత్వం ప్రదర్శించగల కళాద్రష్టుని కులం కనిపెట్టడ మెలా? అంతేగాదు కులంతో పనిఏల? ఆయన సాటివారిలో కళాభిమానం రేకెత్తించే "కాన్వాసర్" కాని కులం కాన్వాస్ చేసుకొనే కళాకారుడు కాదనుకున్నాను.

"కులములోన నొకడు గుణవంతుడుండిన
కులము వెలయు వాని గుణముచేత
వెలయు వనములోన మలయజమున్నట్లు"అన్న వేమన నానుడి ప్రకారం ఆయన నటకులానికి, తన వంశానికి, తన గురువులకు వన్నె తెచ్చారు.

ఆయన జానపద కళా సాహిత్యాలను గూర్చి, నాటకాలను నాటకీయతను గూర్చి తనకు అనుభవమైన దానికి మించి తెలుసుకో దగ్గదేమీ లేదనుకోకుండా నేటికీ కళాసంబంధమైన నూతన ప్రక్రియలనుగూర్చి వాటికి సంబంధించిన ప్రాచీన అధునిక సాహిత్యాల తులనాత్మక విషయాలను గూర్చిన పరిజ్ఞానాన్ని పొందటానికి మేధస్సును మెరుగు పెట్టుకోవడానికి అనేక గ్రంథాలు సేకరించి పరిశీలకుడుగా పరిశోధకుడుగా అధ్యయనం చేస్తూ ఆసక్తి కరమైన విషయాలను కళాజగతికి అందజేయడానికి అహర్నిశలూ శ్రమిస్తూ ఆరాటపడే కళానిధి. సభలందు ఉపన్యసించినా, మిత్రులతో సల్లాపాలాడినా ఏ ప్రయోగంచేసి రంగస్థలంమీద రక్తికట్టించినా ఆయన విజయానికి మూల రహస్యాలు నిత్యసాహిత్యాధ్యయనం, నిర్విరామ కృషి. అందుకనే సభాంతరాళమున బుష్కల వాక్చతురత్వము, కార్యబాహోపటు శక్తిత్వము, యశమునందనురక్తి, విద్య యందు వాంఛాపరివృద్ధియున్ అంటూ భర్తృహరి నిర్వచించిన సిద్ధించిన గుణములు గల్గిన కళాశిల్పిగా కీర్తినందుతున్నారు. రసజ్ఞులైన సంజీవదేవ్‌గారు—"ఆలోచనగల మేధ, అనుభూతిగల హృదయం ఆయనగారి సొత్తు. నాకు తెలిసిన కర్నాటివారు మానవతగల కళాకారులు కళాప్రపూర్ణులైన మానవులు" అని ప్రస్తుతించారు.

"డాక్టర్ రాజారావుగారి కళాపరమైన ప్రతికార్యక్రమంలోను శ్రీ లక్ష్మినర్సయ్య చివరి వరకూ కలిసివుండి ప్రజానాటకరంగ ఔన్నత్యానికి గణనీయమైన సేవ చేసి ఆంధ్రదేశంలో అగ్రశ్రేణి రంగస్థల నటుడుగా అభివృద్ధి చెందారు". అని శ్రీ చుక్కపల్లి పిచ్చయ్యగారు అన్నారు.

నగరంలో ప్రముఖులెందరో ఆయనను"కళల కాణాచి"గా భావిస్తారు. రోటరీ క్లబ్ వారు తమ సంస్థలో గౌరవసభ్యునిగా స్వీకరించి ప్రేమాభిమానాలు వెల్లడించారు. కళాభిమానులు వాడవాడల వందకుపైగా విశిష్టమైన సన్మానాలు చేశారు. పెల్లు

బికిన అభిమానంతో 1983 సంవత్సరంలో విజయవాడలో కళాపోషకులు "ప్రజా నటుడు" బిరుదు ప్రదానం చేసి ఘనంగా సన్మానించారు, ప్రజలేకాదు ప్రభుత్వంకూడా 1985 డిశంబరులోనూ మళ్ళీ 1987వ సంవత్సరం ఉగాది పర్వదినాన 1988లో కూడా సత్కరించి ఆయన అద్వితీయ ప్రతిభకు అద్దంపట్టింది,

ఒక్కొక్కరిలో ఒక్కొక్కకళ మూర్తీభవించి వుండవచ్చు. కానీ అనేక కళలు ఒకే వ్యక్తిలో మూర్తీభవించి పరిఢవిల్లడం అరుదు. అలాంటి అరుదైన కళా కారుల ప్రవంతిలో ఒకరు శ్రీ కర్నాటి.

ఆయన జీవితమొక కళ. ఆయన జీవించేది కళలో. ఆయన జీవింపజేసేది కళను. ఈ కళాత్మత జీవన సంవిధానంతోనే ఎన్ని ఆటుపోటులున్నా 45 యేళ్లగా తాను పొందిన మైత్రిని నేటికీ చెదరకుండా నిలబెట్టుకొంటున్నారు. ఈ చాకచక్యం అందరికీ శక్యమా?

మహానుభావుడు భర్తృహరి నుడివినట్లు విద్యఎలా నిగూఢ గుప్తమైన విత్తము రూపము, భోగకరి, యశస్సుఖకరమో, బంధుజనుల్లో, విదేశగమనంలో, రాజపూజ్య ములలో ఎలాపరం దేవతలా ఉపయోగిస్తుందో ఆయన కళ అలా అన్ని హంగులూ. సొబగులూ చేకూరుస్తుంది-అంటే అనృతమూకాదు, అతిశయోక్తీ కాదనుకుంటాను.

కళలు, కబుర్లు, కథలంటూ యింటిపట్టున లేకుండా వూరూ వాడా తిరుగుతూ వుంటే యిల్లాలుగా తనను అలక్ష్యం చేసినట్లు అతివలు అంచనా వేయడం పరిపాటే. లోకసహజం ఏదైనా ఆయనధర్మపత్ని మాత్రం సహధర్మచారిణిగా-ప్రజానటుడుగా జానపదకళాద్రష్టగా ఆయన కళాయశస్వి కావడానికి నెరపిన సహకారమే "పెద్దపుష్"అని భావించడమేగాకుండా ఆ సాధ్వీమణి అంజనీ ప్రసూనాంబ గారిని, అభినందించడం "కర్టెసీ" అనుకుంటాను!

స్నేహశీలిగా, సహచరుడుగా వ్యవహరిస్తూ, అనేక మందిలో కళాజిజ్ఞాస కలిగించి, రగిలించి, రంగస్థల పునర్వికాసానికి, కళాపోషణకు, కళారాధనకు అద్దం పట్టినట్లు విజయవాడలో ఆంధ్రనాటక కళాసమితి, జానపద కళా కేంద్రములద్వారా నిర్విరామంగా నేటికీ కళాసేవ చేస్తున్న శ్రీ కర్నాటి లక్ష్మి నరసయ్యగారు 62 వసం తాలు గడిపినా మరెన్ని సంవత్సరాలు గడుపుకో నున్నా అజరామరుడూ, అనన్య సామాన్యుడూ!

అతులిత కళావధానీ చతుర వచోనిధీ, చిరంజీవీ, సుఖీభవ!

—0—



“ఏకే బావ” చిత్రంలో బుర్రకథ కళాకారుడుగా శ్రీ కర్నాటి

# జానపద కళాప్రపూర్ణుడు
# కర్నాటి లక్ష్మీనరసయ్య

—నందూరి రామమోహనరావు

సంపాదకులు : ఆంధ్రజ్యోతి.

తెలుగునాడు జానపదకళలకు కాణాచి. బుర్రకథ, జముకులకథ, తోలుబొమ్మలు, కోలాటం, చెక్కభజన, పగటివేషాలు—ఇవీ, ఇంకా ఇటువంటివి ఎన్నో జానపద కళారూపాలు తెలుగువారి సొంతం.

ఈ వివిధ జానపద కళారూపాలను స్మరిస్తే ఈనాడు మొదటగా జ్ఞాపకం వచ్చే కొద్దిమంది ఆధునికులలో ఒకరు శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్య. ఈ జానపద కళారూపాలను గురించి సాధికారంగా మాట్లాడగలిగిన కొద్దిమందిలో ఆయన ఒకరు. ఊరికే మాట్లాడడం కాదు. సోదాహరణ ప్రసంగాలకు ఆయన పెట్టింది పేరు. అంతేకాదు. రంగస్థలంపై వాటిని ప్రదర్శించడంలో, ప్రదర్శనలకు ప్రయోక్తగా వ్యవహరించడంలో ఆయనకు ఆయనే సాటి.

కర్నాటి లక్ష్మీనరసయ్యగారి బహుముఖ ప్రజ్ఞాపాటవాలలో జానపద కళా ప్రదర్శనా కౌశలం. పరిజ్ఞానం ఒక భాగం మాత్రమే.

పెద్ద చదువులు చదువుకోలేదు. కాని రైతు కుటుంబంలో జన్మించి, బ్రతుకుబడిలో అంతకంటె పెద్ద చదువులే చదువుకున్నారు. కళల తల్లి ఒడిలో ఎన్నో విద్యలు నేర్చి పెరిగి పెద్దవారయ్యారు. రంగస్థల కళలకే తన జీవితాన్ని అంకితం చేశారు.

లక్ష్మీనరసయ్యగారు పాల్గొన్న నాటకాల జాబితా, ఆయన సహనటుల పేర్లు, ఆయన నటనా ప్రావీణ్యానికి ముగ్ధులై సెభాష్ అని కొనియాడిన పెద్దల పేర్లు చూసినప్పుడు ఆయనపట్ల గౌరవభావం ఇనుమడిస్తుంది. మన మధ్య సాధారణవ్యక్తిగా మసిలే లక్ష్మీనరసయ్యగారిలో ఇంతటి అసాధారణ కళాకారుడు వున్నాడా అని ప్రశంసా భావం కలుగుతుంది.

ఒకనాడు తెలుగునాడును ఉర్రూత లూగించిన నాటకాలు ముందడుగు, మాభూమి, నిద్రాణజనతను జాగృతం చేయడంలో ఆ నాటకాల పాత్ర అమోఘం. వాటిలో లక్ష్మీనరసయ్యగారు పాత్రలు ధరించారు. అలాగే అల్లీముఠా, ఛైర్మన్. ప్రెసిడెంట్ పట్టయ్య—ఇలా ఎన్నో నాటకాలలో ముఖ్యపాత్రలు

ధరించి ప్రేక్షకుల కరతాళధ్వనులు అందుకున్న మనిషి లక్ష్మీనరసయ్యగారు. ఆ నాటకాలవల్ల ఆయనకు ఎంత గౌరవం లభించిందో, ఆయన పాత్రధారణవల్ల ఆయా నాటకాలకు అంత ఘనత లభించింది.

కోడూరు అచ్చయ్యగారి శిష్యుడు లక్ష్మీనరసయ్యగారు. అందుచేత ఇంత నటనా నైపుణ్యం ఎలా అబ్బిందా అని ఆశ్చర్యపడనక్కరలేదు. ఇక ఆయన సహనటులా? మిక్కిలినేని, రామన్నపంతులు, రామచంద్ర కాశ్యప వంటి మహామహులు. బుర్రకథకు కీర్తి గౌరవాలు సంతరించి పెట్టిన నాజర్‌గారి బృందంలో లక్ష్మీనరసయ్యగారు పెక్కు సంవత్సరాలు ప్రముఖసభ్యుడు.

శాంతారామ్‌వంటి అగ్ర దర్శకుడు, పృథ్వీరాజ్‌కపూర్ వంటి అగ్రనటుడు, డి.ఎం.కె.నాయుడు ప్రస్తుత తమిళనాడు ముఖ్యమంత్రి కరుణానిధి వంటి వారెందరో ప్రముఖులు లక్ష్మీనరసయ్యగారి నట వైదుష్యాన్ని చూచి ఓహో అని మెచ్చినవారే.

రంగస్థలంమీద లక్ష్మీ నరసయ్యగారు నటించిన నాటక ప్రదర్శనలు వందల సంఖ్యలో వుంటే, రేడియోలో ఆయన పాల్గొన్న శ్రవ్యనాటకాలు, నాటికలు వేయికి పైనే. అలాగే రేడియోలో ఆయన చెప్పిన బుర్రకథలు, జముకుల కథలు మొదలైనవి కూడా.

తాను చెప్పే కథలలో చక్కని హాస్యాన్ని చొప్పించడం ఆయన ప్రత్యేకత. అలాగే సమకాలిక రాజకీయాలపై చురుక్కుమనిపించే వాడి, వేడివ్యాఖ్యలు కూడా.

ఇరవై అయిదేళ్ళనాడు లక్ష్మీ నరసయ్యగారు కొందరు కళాభిమానులతో కలిసి కళాపోషకుల ఆదరాభిమానాలతో స్థాపించిన ఆంధ్రనాటక కళాసమితి ఈనాటికీ చైతన్యవంతంగా నడుస్తున్నది. ఎన్నో కళాసంస్థలకు అది చేయూత ఇచ్చింది, ఎందరో కళాకారులకు ప్రోత్సాహం ఇచ్చింది. ఎన్నో ప్రదర్శనలను విజయవాడ పౌరులకు అందించింది.

రంగస్థల కళలను, ముఖ్యంగా జానపద కళలను ఆపోశనపట్టిన అగస్త్యుడు కర్నాటి లక్ష్మీ నరసయ్యగారు. కళాప్రపూర్ణ బిరుదానికి, జానపద కళాప్రపూర్ణ బిరుదానికి కూడా ఆయన అర్హులు, అవి వారిని వరిస్తాయని, వారు తన ప్రతిభా వైదుష్యాలతో తెలుగుతల్లిని చిరకాలం సేవించగలరని ఆశిస్తున్నాను.



నెల్లూరులో "ఎవరు ద్రోహి" నాటిక ప్రదర్శన సందర్భంగా పుచ్చలపల్లి సుందరయ్యగారితో కర్నాటి

# కర్మవీరుల్లో మేటి కర్నాటి

కళాప్రపూర్ణ డాక్టర్ దాశరథి డి.లిట్
ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవి.

శ్రావ్యమైన కర్నాటక సంగీతం ఎలాగైతే సతతం చెవుల్లో తిరుగుతుంటుందో మా కర్నాటి లక్ష్మీనరసయ్యగారి పేరు అలా నాకర్ణపుటాల్లో మ్రోగుతుంది.

అతడు నా బాల్య మిత్రుడు. అద్భుతయ కళాకారుడు. స్వాతంత్ర్య సమర వీరుడు, సద్గుణ సంపన్నుడు. సహృదయతకు మారు పేరు. భయం అనేది అతని జీవితంలో లేదు. నిజాం పరిపాలన నాడు రజాకార్లు విజృంభించి ప్రజలను నానా హింసలు పెడుతుంటె నిష్క్రియా వాదులై ఉండిపోయిన నాయకులు మా లక్ష్మీనరసయ్యనుండి చాలా నేర్చుకోవాలి.

అతను ఆంధ్ర మహాసభ కార్యకర్త. బుర్రకథలు చెప్పి వేలాది ప్రజలను ఉద్రూతలూగించేవాడు. కోలాటాలు, చెక్కభజనలు చెంచుపాటలు, పకీర్ల వేషాలు ఒకటేమిట? అతనికి తెలియని జానపద కళారూపం నాటికీ నేటికీ, లేదు.

కళదేనికి!"స్వాంతస్సుఖాయ" అన్నారు కొందరు. నేను ఒప్పుకోను. కళ ప్రజలకూ. కళదేశానికి పనికిరావాలి. అలా ఉపయోగించనప్పుడు ఆ కళదండుగ మా కర్నాటిలక్ష్మీనరసయ్యను గురించి రాస్తుంటే, మధురానుభూతులు నాలో కలుగుతున్నాయి.

## మధిరలో మధురానుభూతులు

మధిర నాడు వరంగల్లు జిల్లాలో బాగా చైతన్యవంతమైననగరం, మధిర అంటే, ఖమ్మం అంటే నిజాం ప్రభుత్వానికి రజా కార్లకు భయం, ద్వేషం.

మధిర సభకు నేనూ, కర్నాటి లక్ష్మీనరసయ్య వెళ్ళాం. నా ఉపన్యాసం, లక్ష్మీనరసయ్య బుర్రకథ. గూండాలు దాడి చేశారు. సభనుచ్ఛిన్నం చేశారు. లక్ష్మీనరసయ్యగారు రేకు సితారతో గూండాలను దంచాడు. ఎన్ని దష్కృత్యాలుండాలి? శ్రీమతి పోతినేని లక్ష్మీదేవిగారు వీరనారి. వడి నిండ రాళ్ళు నింపుకొని

సభలో కూర్చుంది. ఆమె విసిరిన ప్రతిరాయి తుపాకి గుండులా గూండాల బుర్రల్ని గింగర్లెత్తించింది. అటువంటి వీరనారీమణులు ఆంధ్రమహాసభలో వుండేవారు.

మూడుసార్లు పోలీసులు నిర్బంధించి మధిర జైల్లో పెట్టారు.మాకర్నాటిని.

గార్ల జాగీరు వరంగల్లు జిల్లాలో బాగా వెనుకబడ్డ ప్రాంతాలలో లెక్క. ప్రజలదారిద్ర్యానికి, జాగీర్దారు తొత్తుల దౌర్జన్యానికి ఆప్రాంతం పెట్టింది పేరు.

గార్లలో బుర్రకథ చెప్పాడు లక్ష్మినరసయ్య. వేల సంఖ్యలో జనం, కోలాహలం. హడలిపోయారు పోలీసులు రజాకార్లూ.

మా మీద దాడి చేస్తే, ప్రజలు పోలీసుల్ని అక్కడికక్కడ చిత్రవధ చేస్తారు. అదీ పరిస్థితి, కనుక గూండాలు తోకముడిచారు.

వీరకళాకారుడు కర్నాటి లక్ష్మినరసయ్య. అటువంటి మిత్రునితో కలసి ఆంధ్ర మహాసభలో పనిచేసినందుకు గర్విస్తున్నాను.

తినీ, తినక, కాలి నడకన వేలమైళ్ళు తిరిగి, గ్రామ గ్రామాన రాత్రి పాఠశాలలు నడిపి, వయోజన విద్యారంగంలో కృషి చేసిన మహావ్యక్తి మా కర్నాటి లక్ష్మినరసయ్య, అతడు నాటక రంగానికి ఇంకా సేవ చేస్తూనే వున్నాడు.

ఆయన్ను గురించి నేను పెద్ద గ్రంథం వ్రాస్తేనేగాని నాకు తృప్తిలేదు. కర్నాటి కళాకారుల్లో, మహావీరుల్లో మేటి. కర్నాట సంగీతాన్నీ కర్నాటి నీ నామనసులో దాచాను.

---

సిపాయివలె జీవితంలో సుశిక్షితుడైన శ్రీలక్ష్మినరసయ్య నిరాడంబరులు. సాంస్కృతిక కార్యక్రమాలకు తన జీవితాన్ని అంకితంచేసిన మహా వ్యక్తి.

సినీనటులు కె. వి. యస్.శర్మ.

---



"కన్యాశుల్కం" నాటకంలో అగ్నిహోత్రావధానులుగా శ్రీ కర్నాటి
కరటకశాస్త్రిగా శ్రీరంగారెడ్డి

# కన్యాశుల్కంలో
# అగ్నిహోత్రావధానులుగా శ్రీకర్ణాటి

—డాక్టర్ సంజీవదేవ్

భౌతిక జగత్తును గ్రహించటానికి మనిషికి ప్రధానమైన ద్వారాలు రెండు—కన్నూ, చెవీ. ఒకటి చూడటం ద్వారా దృశ్య సత్తాను గ్రహిస్తే మరొకటి వినటం ద్వారా శ్రవ్యసత్తాను గ్రహిస్తుంది.

నాటక ప్రదర్శనలో చెవికి శబ్దం వినిపిస్తున్నా కూడ కంటికి కనిపించేదే ప్రధానం.

అందుకే నాటకాన్ని అన్నారు దృశ్యకావ్యం అని.

అది ప్రధానంగా దృశ్యకావ్యమైనా కూడ అందులో శ్రవ్యం కూడా తగినంత ఉంటుంది. కనుక నాటకం అంటే కేవలం దృశ్యకావ్యం మాత్రమే కాదు, శ్రవ్యకావ్యం కూడ.

కనుక నాటకం మిశ్రకావ్యం.

అందుకే అన్నారు "కావ్యేషు నాటకం రమ్యం" అని.

గురజాడవారి "కన్యాశుల్కము" ఎవరికీ అపరిచితం కాదు.

ప్రతిసమయంలో ప్రతిచోటా నాటికీ నేటికీ అది సామాన్య నటులచేత, అసామాన్య నటులచేత కూడ రంగస్థలంమీద ప్రదర్శించ బడుతూనేవస్తూంది.

"కన్యాశుల్కము" అనే నాటకం ప్రజలకు అపరిచితం కానట్లే కర్ణాటి లక్ష్మీనరసయ్యగారు నిపుణనటుడుగా ప్రజలకు అపరిచితులు కారు.

ఒక ప్రఖ్యాత నాటక ప్రదర్శనలో ఒక విఖ్యాత నటుడు నటిస్తే వ్యక్తమయ్యే ఫలితాలే వ్యక్తమవుతాయి "కన్యాశుల్కము"లో కర్ణాటివారు అగ్నిహోత్రావధానులపాత్రను నటిస్తే.

కొంతకాలం క్రిందట తెనాలిలో ఆచార్య ఆత్రేయకు జరిగిన సమ్మాన సభకు నేను అధ్యక్షత వహించటం జరిగింది. ఆ సభలో లక్ష్మీ నరసయ్య గారు ఆచార్య ఆత్రేయను గురించి ప్రసంగం చేశారు రసఘంతంగా,

సభముగిసిన తరువాత కన్యాశుల్కం నాటక ప్రదర్శన జరగబోతున్నది. ఆ ప్రదర్శనలో కర్నాటివారు నటించనున్నట్లు నాకు తెలియదు.

అప్పటివరకూ నాతోనే కూర్చున్న లక్ష్మీ నరసయ్య గారు కనిపించకుండా పోయారు. ఎటుపోయినారో అని నేను అనుకుంటున్న సమయంలో రంగస్థలం మీద ప్రదర్శన ప్రారంభమైంది.

ప్రారంభమైన కొద్దిసేపటికి ఒక సనాతన బ్రాహ్మణవేషం రంగస్థలం మీద ప్రత్యక్షమైంది. 'అషా' అనే వింత మాటలను పలుకుతూ.

ఆ పాత్ర అగ్నిహోత్రావధానులదని తెలిసింది కాని ఆ పాత్రధారి ఎవరైనదీ వెంటనే తెలియలేదు.

కొంతసేపటికి తెలిసింది,ఆ పాత్రధారి కర్నాటి లక్ష్మీ నరసయ్యగారుఅని.

రంగస్థలం మీద ఆహార్యం, అంటే వేషధారణ చాలా ప్రధానమైంది. ప్రేక్షకునికి ప్రథమంగా గోచరించే ప్రధాన ఆ భాస వేషధారణయే.

ఆహార్యం తరువాతనే ఆంగికం, వాచికం సాత్వికం మొదలైన అభినయాలు ప్రత్యక్షమ యేవి,

అగ్నిహోత్రవధానుఅనబడే లక్ష్మీనరసయ్యగారి నోటివెంట ఈపలుకులు: "అయితే నన్ను ఆక్షేపణ చేస్తావషే? యీమారంటే నీ అన్నఉన్నాడని ఊరుకొనేదిలేదు" వినపడసాగాయి,

వేషానికి తగ్గ మాటలు!

ఉత్తమమైన నటనలో చతుర్విధ అభినయాలు ఏకత్వంగా నడవాలి, అంటే వాచికం ఆంగికంలోను, ఆంగికం సాత్వికంలోను, ఇవన్నీ కలిసి ఆహార్యంలోను ప్రతిబింబించాలి. ప్రతిధ్వనించాలి.

ఈ నాలుగింటిలో సాత్వికాభినయం ఎక్కువ సూక్ష్మమైంది. ఏది సూక్ష్మమైందో అది కఠినమైంది కూడా,

సాత్వికాభినయంసాధారణంగాలాస్యం(నారీనాట్యం)లో వాడబడుతుంది. కాని దీన్ని లక్ష్మీ నరసయ్యగారు పురుషనాట్యంలో కూడాచూపుతారు ప్రతిభతో,

ఈ సాత్వికాభినయాన్నే భరతుడు తన నాట్యశాస్త్రంలో 'సంచారీభావ' అన్నాడు.

అగ్నిహోత్రావధానుల ముఖంలో క్షణక్షణం మారే భావభంగిమలు వ్యక్తమయే సూక్ష్మానుభూతులు,కోపతాపాలు,అనురాగ విరాగాలు, అన్నీకూడా ఆయన మాటలకు దృశ్యప్రతిబింబాలుగా తన ముద్రలో దర్శనమిస్తుంటాయి.

అయితే ఇటువంటి సాత్వికాభినయం రంగస్థలానికి దగ్గర కూర్చున్న ప్రేక్షకులకు తప్ప మిగతావారికి కనిపించే అవకాశం ఉండదు.

పాత్రఔచితికి సక్రమమైన బాహ్యవేషధారణ, తోపతి స్వభావాన్ని వ్యక్తం చేసేదిగా ఉండాలి. ఇంగ్లీషులో కేరక్టర్ అంటే నడతా, స్వభావం, కూడ అవుతాయి. రంగస్థలంమీద పాత్రను కూడ కేరక్టర్ అంటారు. అంటే ఆ పాత్రపోషణలో దాని నడతా స్వభావం కూడా ద్యోతకం కావాలన్నమాట.

కనుకనే పాత్రపోషణను 'చరిత్రచిత్రణ' అనికూడా అంటారు. చరిత్ర అంటే కేరక్టర్ అని కూడ అర్థం.

కాబట్టే అగ్నిహోత్రావధానుల పాత్రలో ఆయన స్వభావాదులు కూడ అభివ్యక్తం కావాలి. లక్ష్మీ నరసయ్య గారి పాత్రపోషణలో అటువంటివన్నీ అభివ్యక్తమవుతాయి.

అగ్నిహోత్రావధానులులో ప్రధానమైన లక్షణాలు, కోపం, నిర్లక్ష్యం, స్వార్థం. వీటిని కర్ణాటివారు తమనటనలో సుందరంగా ప్రదర్శిస్తారు. నడక ద్వారా, చేతులు తిప్పటంద్వారా కళ్ళ కదలిక ద్వారా, విరుపుమాటలద్వారా.

అగ్నిహోత్రులుగారి కుమారుడు ఇంగ్లీషు చదువుతున్నాడు.ఆవిషయాన్ని గురించి ఆయన అందుకు వ్యతిరేకంగా అంటాడు;

"ఒక్క దమ్మిడీ ఇవ్వను. వీళ్ళిద్దరూ కూడి రూపాయలు పంచుకు తినేటట్టు కనబడుతూంది. నేను వేదం యనబై రెండు పన్నాలూ ఒహ దమ్మిడీ పుస్తకాల ఖర్చు లేకుండా చదువుకున్నాను. ఇదంతా టోపీ వ్యవహారంలా కనబడుతుంది."

మాట్లాడేగొంతు లక్ష్మీనరసయ్య గారిదిగా వినిపించదు. అగ్నిహోత్రావధానులుగారి గొంతు మనం ఎప్పుడూ వినలేదు. ఆయన్ను మనమెప్పుడూ చూడలేదు. కాని లక్ష్మీనరసయ్యగారి గొంతు అగ్నిహోత్రులవారి గొంతువలెనే ఉన్నది. ఆయన ఆకృతి అగ్నిహోత్రులవారి ఆకృతివలెనే ఉన్నది. అనే భ్రమకు లోనవుతాం.

మనం అగ్నిహోత్రులుగారి గొంతును లక్ష్మీనరసయ్య గారిలో వింటున్నాం.చూడని అగ్నిహోత్రులగారి ఆకృతిని లక్ష్మీనరసయ్యగారిలో చూస్తున్నాం,ఎరిగిన కర్నాటివారిలో ఎరగని అగ్నిహోత్రావధానులుగారిని దర్శిస్తున్నాం.

అసలు నాటకం చూడటమంటేనే ఒకవ్యక్తిని మరోవ్యక్తిగా దర్శించటం. నటనంటేనే ఒకరు మరొకరుగా తన్ను తాను మోసం చేసుకుంటూ ప్రేక్షకులను మోసం చేయటం.

పూర్వకాలంలో శంకరాచార్యుడన్నాడట. ఈ జగత్తుఅంతా ఒక భ్రమ అని. జగత్తు భ్రమ అని నమ్మజాలం కాని రంగస్థలం మీది నాటక ప్రదర్శనం మాత్రం భ్రమ అనటం నమ్మవచ్చు.అయితే ఇది వాస్తవ భ్రమకాదు. కళాత్మక భ్రమ.

నాటక ప్రదర్శనలో అసలు లేనిదాన్ని ఉన్నట్టు చూపరు కాని ఒక స్థలాన్ని మరోస్థలంగా, ఒక వస్తువును మరో వస్తువుగా, ఒక వ్యక్తిలోని రూపాన్ని మరో వ్యక్తి రూపంగా, ఒకరి మాటని మరొకరి మాటగా, బ్రతికున్న మనిషిని చచ్చిన మనిషిగా చూపటం జరుగుతుంది.

ఈ భ్రమను సృష్టించే నటనను రూపొందించే కౌశలం ఉంటుంది నటీనటుల్లో. ఒకోసారి నటుడు నటి రూపంలో.నటినటుని రూపంలో గోచరించటం కూడ జరిగే భ్రమ సృష్టించబడుతుంది.

ఇటువంటి నాటకీయ భ్రమనంతా సృష్టించటంలో.ప్రేక్షకులను ఆ భ్రమ సాగరంలో ముంచి.మెప్పించటంలో. అది కల్పిత నటన కాదు. వాస్తవఘటన అని తన ఇంద్రజాలిక అవగుంఠనను ప్రేక్షకులపై కప్పటంలో కర్నాటివారు పూర్ణ దక్షులు!

అగ్నిహోత్రావధానులను తను అక్షరాల్లో సృష్టించారు గురజాడ అప్పారావుగారు తిరిగి ఆ అక్షర అగ్నిహోత్రావధానులను సజీవరూపంలో కదిలే మెదిలే ప్రాణిగా నవ్వే, ఏడ్చే జీవిగా సృష్టిస్తారు తానుగా కర్నాటివారు.

నిజంగా అవధానులు పుట్టివుంటే ఆయనకది మొదటి జన్మ,గురజాడవారి ద్వారా లభించినది రెండవజన్మ,ఇప్పుడు కర్ణాటివారి ద్వారాలభించినది మూడవ జన్మ. ఒక కర్నాటివారేకాక ఇంకా ఎందరెందరో ఆపాత్రను అభినయించి ఉంటారు. కనుక అవధానులు గారికి మూడుజన్మలు మాత్రమే గాక ఇంకా ఎన్ని జన్మలో!

కొందరు విమర్శకులు అంటారు"ఒకరి పాత్రను మరొక నటుడు సమర్థవంతంగా నటించి రక్తి కట్టించాలంటే ఆ పాత్రలోని గుణగణాలు ఈ నటునిలో ఉండాలని,అంటే అగ్నిహోత్రుని పాత్రను లక్ష్మీనరసయ్యగారు సమర్ధవంతంగా నటిస్తున్నారంటే అర్థం అగ్నిహోత్రుల వారిలోని చీకటి గుణాలన్నీ లక్ష్మీనరసయ్యగారిలో ఉండితీరాలని!

ఇది సక్రమ దృష్టికాదు. పాత్రలోని గుణాలు నటునిలో ఉండనవసరం లేదు. అటువంటి పద్ధతిఉంటే నటుడు ఆ పాత్రను సవ్యంగా నటించలేడు, తన గుణాలను వ్యక్తం చేయటం నిపుణనటనకాదు ఇతర్ల గుణాలను వ్యక్తం చేయటం తన సహజ ప్రవర్తన అవుతుంది కాని నటనా కౌశలంకాదు.

కర్నాటిలక్ష్మీనరసయ్యగారి జీవితపు మొదటిదశ ఉపాధ్యాయ వృత్తిలో ప్రారంభమైనా, అది క్రమేణ కళాకారుని జీవితంగా పరిణతి చెందింది. నేడు నటజీవితం ఎంత కళతో నిండఉంటున్నదో ఆనాటి ఉపాధ్యాయ జీవితంకూడ అంతగా కళతో నిండి ఉండేదే.

మనిషిలో కళాభాగం తగినంతగా ఉండటం జరిగితే ఆ వ్యక్తి ఏవృత్తిని చేపట్టినా అది కళాత్మకంగానే ఉంటుంది. కర్నాటివారు మంచి వక్తకూడా సభా స్థలం మీద ఆయన ప్రసంగిస్తుంటే రంగస్థలంమీద ఆయన ప్రదర్శన ఇస్తున్నట్లేఉంటుంది!

కళలన్నిటికీ ప్రాణం అభివ్యక్తి (Expression) మిగతా కళాకారుల వ్యక్తిత్వాల్లో అభివ్యక్తి అంతగా గోచరించాలసిన పనిలేదు. వారి కళాకృతుల్లో మాత్రమే ఆ అభివ్యక్తి గోచరిస్తుంది.

కాని నాట్యకారుని విషయంవేరు. నాట్యకారుని వ్యక్తిత్వంలోనే అభివ్యక్తి గోచరించాలి. వ్యక్తియే కళకనుక రంగస్థలం మీద నటుని కళ నటునినుండి వేరై ఉండదు, నటుడే కళాప్రదర్శన నటుడుదీ నటనదీ అవినాభావ సంబంధం నటుడు రంగస్థలం మీద లేంది నటన లేదు.

ఈ సత్యం కర్నాటివారిలో ప్రత్యేకంగా గోచరిస్తుంది,ఆయన వ్యక్తిత్వం పూర్ణ అభివ్యక్తిని కలిగి ఉంటుంది. ఆయన చేయికదలినా, చేతివేళ్ళుకదలినా, వ్రేలిగోళ్ళుకదలినా కళాత్మకంగా ఉంటుంది. ఇక కాళ్ళుకదలినా, కళ్ళుకదలినా, పళ్ళు కవిపించినా, వళ్ళు సుళ్లుతిరిగినా అంతా లయస్పందనతో ప్రకంపిస్తుంటుంది నటనా నైపుణిని ప్రదర్శిస్తుంది!

"కన్యాశుల్కము"లో అగ్నిహోత్రావధానుల పాత్ర అంత పెద్ద పాత్ర కాదు. నాటకంలో మిగతా పాత్రలున్నంత సమయం కూడ ఆ పాత్ర తీసుకోదు. ఎక్కువకాలం రంగస్థలంమీద ఉండటమే పాత్రఔన్నత్యానికి కొలతబద్దకాదు, అది వేరే విషయం.

అయినా అదొక ప్రముఖపాత్ర. నిజానికి అదొక వ్యంగ్య పాత్రయే. కాని ఆయన నోటినుండి 'ఏ హాస్య వాక్యమూ వెలువడదు. అయినప్పటికీ అగ్నిహోత్రుని పాత్ర నోటినుండి ఏమాట వెలువడినా, ప్రేక్షకులు నవ్వితీరాల్సిందే, ప్రేక్షకులు నవ్వాల్సినంత చమత్కారం ఆయన మాటల్లో కనుపించదు. అయినా ఆయన నోరుతెరిస్తేచాలు, ప్రేక్షకులుకూడ నోరుతెరుస్తారు ఫక్కున నవ్వటానికి.

అవధానులకు కోపంవచ్చినా ప్రేక్షకులకు నవ్వువస్తుంది. ఆయన నోటినుండి ఏదైనారావచ్చు కాని ప్రేక్షకుల నోటినుండి నవ్వుతప్ప మరేమీరాదు. దానికి ప్రధానకారణం అగ్నిహోత్రావధానుల పాత్రను సృష్టించినది గురజాడవారైనప్పటికీ, మరోకారణం కర్ణాటి లక్ష్మీనరసయ్యగారి నటనా వైచిత్రియే.

నటుడు తనకోపాన్ని ఉన్నది ఉన్నట్లుగా ప్రదర్శిస్తే ప్రేక్షకుల్లో నవ్వు పుట్టించదు. ఆ విధంగాకాక ఒక వ్యంగ్యభంగిమలో,ఒక వింత ఉచ్చారణలో ఆ కోపాన్ని ప్రదర్శించినపుడు ప్రేక్షకుల్లో జనించేది నవ్వుమాత్రమే.

అగ్నిహోత్రావధానులు గారంటారు కోపంతో

"ప్రతి గాడిదె కొడుకూ అమ్మ 'నమ్మ' నంచూంటాడు. కూరగాయల

షోయ్ అమ్మటానికి? ఆ రూపాయలు పుచ్చుకోకపోతే మొగుడుచచ్చాడుగదా—దానిగతి ఏమయ్యేందును?"

ఈ మాటలు రంగస్థలంమీది లక్ష్మీనరసయ్యగారి నోటివెంట ఆంగికాభినయంతో మిళితమై వినిపించేవరకు ప్రేక్షకులు గొల్లున నవ్వుతారు. లక్ష్మీనరసయ్యగారు నవ్వరు, ఆయన నవ్విస్తారు. అంటే అటువంటి హాస్య వాతావరణాన్ని సృష్టించటం నటుని ప్రతిభ.

నాకు అనిపిస్తుంది, ఒకవేళ అగ్నిహోత్రావధానులు రంగస్థలంమీద మరణించినాకూడా ప్రేక్షకులు నవ్వుతారేకాని దుఃఖించరేమో అని! ఆ పని లక్ష్మీనరసయ్యగారే చేయాలి. మరొక నటుడు చేస్తేకాదు.

జీవితపు వెలుగుల్ని ప్రదర్శించినంత ప్రతిభతోనే మృత్యువు చీకట్లను కూడ ప్రదర్శించగలడు నటుడు, అందులోనూ ప్రత్యేకించి కర్నాటి నటుడు.

అగ్నిహోత్రావధానుల కుటుంబ జీవితం సుఖమయంకాదు, భార్యాభర్తలకు పెద్దగా అనుకూల్యంలేదు. పెద్దబిడ్డ బుచ్చమ్మ. వింతతువయి ఇంటనే ఉంటుంది. పెళ్ళికాని రెండో సుబ్బమ్మకు పెళ్ళిచేయలేదు. ఇటువంటి నివారించ వీలులేని ఆందోళనలతో లోలోపల ఉడికిపోతున్నాడు అగ్నిహోత్రావధానులు. కానీ వాటన్నిటికి లోబడి బాధపడుతున్నట్లు బయటికి కనిపించడు, ఒక విధమైన నిర్లిప్తత అది.

ఆందోళనల మధ్య మునుగుతూ తేల్తూ ఒక నిర్లిప్తతను పోషించుకు రావటం సామాన్య విషయంకాదు. కాని ఆ సామాన్యం కానిదాన్నే చేస్తుంటాడు అవధానులు, ఆ నిర్లిప్తతయే కనిపిస్తుంది రంగస్థలంమీది లక్ష్మీనరసయ్యగారిలో.

అవధానులు పైసా ఖర్చులేకుండా కూతురూ కొడుకూ పెళ్ళిచేయాలని, అది ఏ విధంగా జరుగుతుందనే ప్రశ్నకు ఆయన జవాబు చెపుతాడు.

"డబ్బు ఖర్చులేకుండా వెంకడికి యెలా పెళ్ళిచేస్తానో నువ్వే చూతువుగాని. రామచంద్రపురం అగ్రహారంలో లుబ్ధావధాన్లుగారిని యెరుగుదువా!"

"ఆయన లక్షాధికారి. పద్దెనిమిది వందలకు సుబ్బిని అడగొచ్చారు. ఉభయఖర్చులూ పెడతారుష. పెళ్ళిమా వైభవంగా చేస్తారుష. మనం పిల్లని

తీసికెళ్ళి వాళ్ళింటే పెళ్ళిచేయటం". మనకు తట్టుబడి అట్టే వుండదు, ఆ పద్దెనిమిది వందలూ పెట్టి వెంకడికి పెళ్ళిచేస్తాను."

మెడలోని రుద్రాక్షమాలలు ఊగుతుండగా, చమటకు తడచిపోయిన విభూతిరేఖల్ని తుడుచుకుంటూ, కూతురూ కొడుకూ ఇద్దరికీ వివాహాలు ఉచితంగానే అవుతాయనే నూతనోత్సాహంతో, సదోల్లాసంతో, అగ్నిహోత్రావధానులు అనబడే లక్ష్మీనరసయ్యగారు ప్రదర్శించే నటన ప్రేక్షకుల్లో నూతనానందాన్ని పెద్ద నవ్వును జనింపచేసి కరతాళధ్వనుల ద్వారా వాటిని ప్రత్యక్షపరుస్తాయి. గురజాడవారు జీవించి ప్రేక్షకుల్లో కూర్చొని ఉంటే అనేవారు "కర్నాటీ, నా అగ్నిహోత్రావధానులకంటే మీ అగ్నిహోత్రావధానులే అధిక రమ్యంగా ఉన్నారు" అని.

కొందరు సనాతన పండితులు ఇప్పుడు మనకు కనిపించే సైన్సుకు సంబంధించిన విషయాలన్నీ మన వేదాల్లోనే ఉన్నాయని చెపుతుంటారు. ఆ దేధోరణిలో అగ్నిహోత్రావధానులు అంటాడు గిరీశంతో సంభాషిస్తూ :

"మీకు చాలా తెలుసును. ఈ తెల్లవాళ్ళు చేసే విద్యలన్నీ మన గ్రంథాల్లోంచి ఎత్తుకెళ్ళినవే. ఈ రెయిళ్ళూ గియిళ్ళూయావత్తూ మనవేదంలో వున్నాయష"

ఈ మాటలను మౌలికంగా అవధానులు అన్నది తాను వాటినినమ్మి. కాని ఇక్కడ రంగస్థలంమీద కర్నాటి లక్ష్మీనరసయ్యగారు వాటిని నమ్మక ఆధునిక సైన్సు నెరవేర్చిన వాటితో చాలా వేదాల్లోనే ఉన్నాయనే వాదాన్ని అవహేళన చేసే పద్ధతిలో విద్రూపంగా ఎక్కిరించి ఉచ్చరిస్తారు లక్ష్మీనరసయ్యగారు.

ఆ వాదంలో లక్ష్మీనరసయ్యగారికి నమ్మకం లేదని ఆపలుకులను ఆయన వెక్కిరింపు రీతిలో పలికిన విధానమే తెలుపుతుంది. అందువల్ల ఈ ఘట్టంలో లక్ష్మీనరసయ్యగారి నటనఎక్కువబలీయంగా, ఎక్కువప్రతిభావంతంగా ఉంటుంది.

ఒక పద్ధతిని నాటక ప్రదర్శనాల్లో ప్రవేశపెడితే ఏవిధంగా వుంటుందో అనిపిస్తుంది. కొన్నిపాత్రలను నటించేప్పుడు నాటకరచనలో మౌలికంగాలేని కొన్ని మాటలను కొత్తవాటిని.నటీనటులు సందర్భోచితంగా పలికితే బాగుంటుందనిపిస్తుంది.సంగీతంలో సమయోచితంగా స్వకపోలకల్పిత 'సంగతుల'ను వేసినట్లు. రచయిత రచించిన నాటకపు ఫ్రేంనుంచి అరుదుగా అపుడపుడు స్వేచ్ఛ పొందితే బాగుంటుంది.

అగ్నిహోత్రావధాని నోటినుండి ఎన్నో విడ్డూరపు మాటలు వినిపిస్తాయి.

"నాప్రాణంపోతే నోటుృవాయను. అప్పుపత్రం రాయనని మాతండ్రి చచ్చిపోయేటప్పుడు నాచేత ప్రమాణం చేయించాడు."

చిత్రమైనవ్యక్తి అగ్నిహోత్రావధానులు. అటువంటి చిత్రమైన వ్యక్తి పాత్రను నటించాలంటే విచిత్రమైననటుడు అవసరం. అందుకు సరిపడిన నటుడే కర్నాటివారు. నటనా కౌశలంలో ఏమాత్రం లోపం ఉన్న నటుడైనా కూడ అగ్నిహోత్రావధానుల పాత్రను ప్రతిభావంతంగా నటించలేడు.

కుశల నటుని నటనాచాతుర్యానికి మానదండం అగ్నిహోత్రావధాని పాత్రను దక్షతతో నిర్వహించటం. ఆ విధంగా నిర్వహించారు లక్ష్మీనరసయ్య గారు. కనుక లక్ష్మీనరసయ్యగారు కుశలనటుడు, నటకౌశలుడు.

ఉత్తమవిషయం, ఉన్నతవిషయం స్మృతిఫలకం మీద ఎంతకాలమో మాయకుండా నిలచిపోతాయి. కర్నాటి లక్ష్మీనరసయ్యగారి అగ్నిహోత్రావధానుల పాత్ర నిర్వహణ కూడ అంతే. అగ్నిహోత్రావధాన్ల ప్రతిభకాదు. లక్ష్మీనరసయ్య గారి ప్రతిభ. తెలుగునాటి ఉత్తమనటుల్లో కర్నాటి లక్ష్మీనరసయ్యగారు ఒకరు. ఆయన కళాదర్శనం రసానుభూతి, సామాజికశ్రేయం కూడ. * *

---

స్ఫురద్రూపం, స్ఫుటద్వాచ్యం, సువ్యవస్థిత అభినయం వీటికి మెరుగు పెట్టినట్లు వినయ సంస్కార సౌశీల్యముతో కూడిన వ్యక్తిత్వం కలబోసి నిలబెడితే కనిపించే మూర్తి కళారంగంలో కర్నాటి కీర్తి. నటుడిగా, వక్తగా, ప్రయోక్తగా....కళల్లో ప్రజల మనిషి. ఈ 'కళాతపస్వి' తెలుగు కళా ప్రపంచంలో ప్రజలపతాకను సుప్రతిష్టంచేయడానికి పరిశ్రమించగలరని అందరి మనఃకామనలు.

—విశాలాంధ్ర

# మూర్తిమంతమూ, స్ఫూర్తిమంతమూ నైన కళాకారుడు "కర్నాటి"

శ్రీ సి. రాఘవాచారి

సంపాదకులు : విశాలాంధ్ర

మానవ సమాజంలో సాంస్కృతిక మహాప్రస్థానం బహుళవైచిత్రి వైవిధ్యంతో కూడుకున్నది. నాగరిక సమాజాలు ఏర్పడటానికి పూర్వంనుండీ కళలు, సాహిత్యం, మానవనైజంలో పురోగమిస్తూనే వున్నాయి. జానపదుల జావశీలను ఈసడించుకోడం ఆధునిక దృష్టివైపరీత్యం అనుకున్నా ఆమహోద్వేగసంభరిత సాంప్రదాయాగ్ని ఆపోశన పట్టినవారు తిరస్కరించడాన్ని అంగీకరించారు. అలాంటి విలక్షణశీలురైనకళాశ్రేష్ఠుల్లో కర్నాటి మరొకరు.

కళలవైవిధ్యం జోడించి చేపట్టిన ప్రతి కళలోనూ వైదగ్ధ్యం ఆయన స్వామ్యం, స్వంతం. జానపదుల కళారూపాలనుండి ఈనాటి రేడియో నాటికల శ్రవ్యదృశ్యకావ్యాల ప్రయోగంలో అన్వయంలో అభివ్యక్తిలో ఆయన నైపుణ్యం బహుధా అభినందనల నందుకొంది. ప్రజానాట్యమండలి తొలిదశాబ్ది కళాకారుడుగా ప్రారంభమై ఉద్దండుల సాంగత్యంలో, అప్రతిభుల సాహచర్యంలో అభ్యాసం, అభినయాదికృషికి మంచి పునాదులేపడ్డాయి.

ముందడుగు, మాభూమి, చైర్మన్ నాటకాలద్వారా సుపరిచితమైనది నాటకజీవితం. బుర్రకథలో అతి క్లిష్టమైన రాజకీయవంతగా అష్టావధానాలను అప్రస్తుత ప్రశంసలా అలవోకగా నిర్వహించి సదస్యుల్ని ఆకట్టుకొనే కనికట్టు విద్యఏదో ఈమనిషికి బాగా అబ్బినట్లుతోస్తోంది. కేవలం నటుడిగా మాత్రమేగాక ప్రయోక్తగా, రంగస్థలంపైనేగాక, తెరకెదురుగా, కనబడే సూత్రధారిత్వం కర్నాటివారి విశిష్ట లక్షణం.రాజారావుగారి నుండి ఈనాటివరకు వర్ధిష్ణులైన కళాకారుల్ని సంస్కారభాజనమైన సంఘంలో సూచనలతో సమాదరించే సౌశీల్యం. సౌజన్యం ఆయన సొత్తు.

వివిధ భంగిమల్లో, రంగాల్లో ప్రజలమధ్య ఉద్భవించి వారికై వర్థిల్లిన కళలన్నీ వారిసేవలో అన్వయించి తాను అందుకై అర్పణ,అంకితమైన ధన్యజీవి ఈ కర్నాటి. "జయంచితే సుకృతినోరససిద్ధాః" అన్న భర్తృహరి సుభాషితానికి లక్ష్యం ఆవ్యక్తి. స్ఫూర్తి.

# రూపు మార్చి మాట మార్చి
# ఆటలాడు అమోఘంగ...

శ్రీ రమణ

"ఆంధ్రప్రభ" సౌజన్యంతో

ఇది దాదాపుగా వంద సంవత్సరాలనాటికథ. పూర్వం డబ్లిన్ నగరంలో ఓల్ టీక్ వుడ్ అనే కళాకారుడు వుండేవాడట. ఆయన మన కర్ణాటి లక్ష్మీనరసయ్య లాంటివాడు కావచ్చు. ఆనాటి లబ్ధప్రతిష్టులైన ఐరిష్ కళాకారులలో టీక్ వుడ్ పేరు విశేషంగా వినిపించడానికి కారణం—మళ్ళీ మన లక్ష్మీనరసయ్యగారి గురించే చెప్పాలి.

ఫెళఫెళలాడే చలవ ఖద్దరు నిండు చేతుల చొక్కా, ఖద్దరు పంచె, నల్లఫ్రేము కళ్ళజోడు- తెల్ల మల్లెకైనా మరక వుంటుందేమోగాని నిత్యం తెల్లని దుస్తులతో కనిపించే లక్ష్మీనరసయ్యగారు ఈ తరానికి చెందిన కళాకారుడు కాకపోయినా నేటికీ ఆధునిక తెలుగు రంగస్థలానికి వంద్యుడు, ఆద్యుడు అంటే అతిశయోక్తికాదు. ఆరుపదుల ఏళ్ళుదాటిన మన కర్ణాటిలో ఇంకా కళాకారుడు నిత్యయవ్వనంతోనే కనిపిస్తాడు. అన్నింటికి మించి తెలుగుతనం పోతపోసినట్టు కనిపించే ఆయన 'తెలుగు వాడంటే వేషభాషలు ఇలాగే వుండాలి' అనిపిస్తాడు.

వంద సంవత్సరాల క్రితం ఆంగ్లికన్ చర్చికీ, ఐరిష్ చర్చికీ పచ్చగడ్డి వేస్తే భగ్గుమనిపించే రోజుల్లో ఐర్లెండ్‌లోనే ఐరిష్ చర్చిని అపహాస్యం చేస్తూ వందలు వేల సంఖ్యలో ఏకపాత్రాభినయాలు చేసి నెగ్గుకొనివచ్చి సెభాష్ అనిపించుకొన్నకళాకారుడు టీక్ వుడ్ నిండా 92 సంవత్సరాలు బ్రతికిన యశఃకాయుడు 1836 డిసెంబరు 23వ తేదీ రాత్రి ఏదో చర్చిలో ప్రదర్శన ఇస్తూ 'ఇరిష్ పాదిరీ'ని అనుకరిస్తూ ఎడనెడా జోక్స్ వేస్తూ కుప్పలాగా కూలిపోయాడు. అది అందరూ నటన అనుకొన్నారు, అదే తుది శ్వాస.

టీక్ వుడ్ గొప్పతనం వేషం కట్టడం కాదు. దానిపై అతడు చేసిన పరిశోధనలు 'ఒకడు అలాగే వుంటాడు. మరో విధంగా వుండలేడు, మరో విధంగా వుండడమే నటన. నేను ఐరిష్ పాదిరీలాగా వుంటే నటన. ఆంగ్లికన్ పాదిరీలాగా వుంటే సహజం. ఐరిష్ పాదిరీలా నటిస్తే బాగుంటుంది....'అంటూ

ఐరిష్ చర్చికి తాటాకులు కట్టాడు. అలాంటి టీక్ వుడ్ ఒకసారి 'కళ' ఎక్కడ వుంటుందని అడిగితే మన కర్ణాటి లక్ష్మీనరసయ్యగారిలాగా పడుతున్న కష్టాల్ని మరచిపోవడానికి ప్రయత్నించే జానపదులలో వుంటుందని అన్నారు. ఆ ఐరిష్ జానపద కళాకారుడు.

కళలు ప్రజాపరం కావాలని అంటారు శ్రీ కర్ణాటి లక్ష్మీనరసయ్య. అందుకు ఆ రోజుల్లో ఆయన చేసిన కృషి, ఈ నాటి ఆరాటం అందరికీ తెలిసినదే. స్వయం ప్రతిభతో రంగస్థలానికి దీప్తులు ప్రసాదించడమేకాదు, శిథిలరూపంలో వున్న ప్రజా కళలను పునరుద్ధరించే బాధ్యత కూడా స్వీకరించాలని ఆయన అంటారు. తన 45 సంవత్సరాల అనుభవాన్ని పురస్కరించుకుని పూర్వ జానపద కళాస్వరూపాల ఆవిష్కరణకు కృషి చేస్తున్నారాయన.

ప్రజా కళలంటే ఒకనాటి బహురూపాలు గుర్తుకు వస్తాయి. నేటి తరానికి వాటి గురించి చెబితేనే తెలియాలికాని, ఒకనాటి జీవితం ఎంత కళాత్మకంగా వుండేదో లక్ష్మీనరసయ్యగారు సోదాహరణంగా అలాంటి ప్రతిభావంతుల గురించి చెపబుతూవుంటే వినడమేగాని చూసే అదృష్టం లేదు కదా అనిపిస్తుంది.

ఎందరో అజ్ఞాత కళాకారులు కళ తమ జీవన విధానంగా జీవించారు. తాము కళాకారులమన్న సంగతి తెలియకుండానే! చరిత్ర చీకటి కోణాలలో కలసిపోవడానికి కారణం కాల ప్రవాహంలో మనం మన వేషాల్ని, భాషను మార్చుకొన్నాం. బహుశా అంతరాంతరాలలో ఈ పరభాషా దాసోహానికి, పరవేషం అనుగమనానికి రోసి కావచ్చును. బహూనరీని ఆనందిస్తాం. అందుకే నేడు ఎంతటి విద్యావంతుడైనా పిట్టలదొర, సాధువు, బుడబుక్కల, ఫకీరు, చెంచు, బైరాగి, పాములవాడు వేషం వేస్తే చూసి ఆనందిస్తాం. నిజానికి ఆ వేషాలలో మనుషులు కనిపించడం లేదు కదా।

చారిత్రకంగా పరిశీలిస్తే యథావాక్కుల అన్నమయ్య వ్రాసిన సర్వేశ్వర శతకంలోను, పాల్కురికి సోమనాథుడు వ్రాసిన పండితారాధ్య చరిత్రలోను కనిపిస్తాయి. ఈ బహురూపాలు ధరించేవారు పెద్దగా చదువుకోక పోయినా సమకాలీన, సామాజిక దుర్నీతిని కడిగి పోసేవారు. వినోదం, విజ్ఞానం రంగరించి సామాజిక సందేశం ఇవ్వడంలో వారు కీలకమైన పాత్ర నిర్వహించారు.

ఈ సందర్భంలో అప్రస్తుతమే అయినా అసందర్భంకాదు– ఇండియాలో జరిగిన అమెరికన్ ఉత్సవాల గురించి ప్రస్తావించడం. హాల్ హాల్ బ్రూక్ అనే కళాకారుడు "మార్క్ ట్వైన్ టు నైట్" అనే ప్రదర్శన ఇచ్చాడు. జగద్విఖ్యాతమైన ఈ ప్రదర్శనలో అన్ని వేషాలు ఆయనే వేసేవారు, అందులో ఆయన అందరినీ, కరుణరసం చొప్పించపచేసి ఏడిపించేవాడు. అంతలోనే నవ్వించేవాడు. ఆధునికతను అపహాస్యం చేసేవాడు.

ఇక తెలుగు సంస్కృతి గురించి ప్రస్తావించవలసి వచ్చినపుడు పిట్టలదొర ప్రధానమైన కళారూపం. దానిని ఆధునికంగా శిల్పీకరించినవారు శ్రీ కర్నాటి. పదునైన సంభాషణల ద్వారా శ్రోతలను ఉక్కిరిబిక్కిరి చేస్తారు. ఆమధ్య విజయవాడ లయన్స్‌క్లబ్ ఆధ్వర్యంలో ఆయన పిట్టలదొర వేషం వేశారు. ఆ వేషంలో ఆయన 62 సంవత్సరాల వయస్సు ఎలా వొదిగిపోయిందో ఎంత నిశితంగా పరీక్షించినా అర్థంకాదు. ఖాకీ పాంటు చిరిగిన ఖాకీ షర్టు, పాతకోటు, తలపై టోపీ, చేతిలో కట్టె తుపాకీ, మెడలో రుమాలుతో ప్రత్యక్షమయ్యేసరికి భ్రమకు, వాస్తవానికి మధ్య ప్రేక్షకులు పల్టీ కొట్టారు.

పరిశీలనా దీక్ష ప్రయోగ కౌశలం నిండా వున్న శ్రీ కర్నాటి వృద్ధాప్యం లోకి అడుగుపెట్టినా ఎక్కడా ముసలితనం కనిపించకపోవడానికి కారణం– ఆయనను చూస్తే అర్థం అవుతుంది. క్రమశిక్షణ.

"మా గురువుగారు అంటూ ఉండేవారు. పాఠం రాకపోయినా పరవా లేదురా అపశబ్దం రానివ్వకు"– అని. ఆ శిక్షణలో పెరిగిన ఆ కళాకారుడు ఇప్పటి కళాకారులందరూ అలాగే తయారు కావాలని ఆశిస్తున్నారు. బహుశా ఆ కోవలో పెరిగినందువల్లనే! ఆయన ఉచ్చారణలో, భాషా సౌందర్యం తొణికిసలాడుతుంది.

పాల్కురికి సోమనాథుడు తన బసవపురాణంలో

"అటుగాక సాంగ

భాషాంగ క్రియాంగ

పటు నాటకంబుల

నటియించువాడు...."

4)

అని అభివర్ణించాడు. అంటే నటుడికి కళ ప్రత్యంగాశ్రితమే కాదు. భాషాశ్రితం కూడా. మరి బహురూపధారణలో పిట్టలదొరలాంటి పాత్రలు ధరించినా ఆ వేషానికి నప్పిన భాష అవసరం లేదా! భాష లేకపోతే, వేషం రాణించదు. అందుకే పండితారాధ్య చరిత్ర పర్వత ప్రకరణలో సోమనాథుడు ఇలా అంటాడు.

"ప్రమథ పురాతన పటు చరిత్రము
క్రమమొంద బహునాటకములు
లాడువాడు- లలితాంగరస
కళాలంకార రేఖలలవడ
బహురూపమాడెడివారు"

ఇలా ఆనాటి వినోదనాటకాలన్నీ క్రమశిక్షణతో సాగినవే!

కర్ణాటివారు నేటికీ ఛాన్సు దొరికితే నాటక శిక్షణలో 'భాషాంగ క్రియాంగాభిరమ్యం'(యథా వాక్కుల అన్నమయ్య)గా తీర్చిదిద్దడానికి పాటుపడే అన్నమయ్య-నేటి కళాకారులకు అయితే పెడదారి పట్టే యువతరాన్ని పెడదారి పట్టించే టి.వి. సినిమాల ప్రపంచంలో రంగస్థల కళాకారులు కూడా 'భాష'తో పనేమిటి, పాఠంతో పనని' భావించే ఈ రోజుల్లో- కర్ణాటివారు ఊరుకోపడంలేదు- 'నాలో చేవ తగ్గలేదు' అని నిరూపిస్తున్నాడు. ఆయన రేపటి లెజెండరీ ఫిగర్.

---

ఎందరికో అభిమాన కళాకారుడిగా ప్రసిద్ధుడు శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్య. తెలుగు నాటకాన్ని, జానపద కళారూపాల్ని జనంలోకి కొనిపోయి పోరాడే చైతన్యానికి పదును పెట్టే సాధనాలుగా వాటిని మలచిన ఘనత శ్రీ కర్నాటిది. "మా భూమి"లో శ్రీ కర్నాటి పాత్రను ఆ తరం ప్రజలు ఈ నాటికీ అభిమానంతో తలచుకొంటారు.

—ఈనాడు

# నటులకే నటుడు కర్నాటి

శ్రీ పి.ఎస్.రావు

శ్రీ కర్నాటి లక్ష్మీ నరసయ్య జానపద కళలలో నిష్ణాతుడేగాక, రంగ స్థలనటుడుగా కాకలు తీరిన కళాకారుడు. ఎలాంటి పాత్రలోనైనా అవలీలగా 'పరకాయ ప్రవేశం' చేసి ఆ పాత్రకు జీవం పోయగల సమర్థుడు. నాలుగు దశాబ్దాల అనుభవంతో నటనకే కొత్త భాష్యం చెప్పగల వైదుష్యం ఆయన సొత్తు.

నలభయ్యేళ్ళ క్రిందటకూడా ఆనాటి సాంఘిక నాటకాల్లో తన నటనతో, పాత్రోన్మీలనతో, ప్రత్యేక వాచికంతో తనదంటూ ఒక బాణీ ఏర్పరచుకున్నాడు,

ఉదాహరణకు, అనిసెట్టి సుబ్బారావు ప్రయోగాత్మక, ప్రబోధాత్మక నాటకాలు "గాలిమేడలు," 'మా వూరు' ఆ రోజుల్లో కొత్త వరవడులు సృష్టించాయి. ఒక ప్రధానపాత్ర 'గాలిమేడలు' కట్టుకుంటూ "ఎడారిలాంటి జీవితాన్ని "స్వప్న పుష్పాలతో అలంకరించుకుని"హాయిగా వుంటే-'మావూరు' లో ప్రలోభాలకు లోనైన ఆదర్శవాది జీవితమెలా దుఃఖభాజన మవుతుందో సూచించబడింది. ఈ రెండు నాటకాల్ని ఆనాడు ఆంధ్ర ఆర్ట్ థియేటర్ బృందం ప్రదర్శించారు.

'గాలిమేడలు'లో స్వాప్నికజగత్తులో విహరించే మాణిక్యాలరావుకు ఆదర్శప్రాయుడైన హెడ్ గుమాస్తా ఆంజనేయులు పాత్రకు లక్ష్మీనరసయ్య రూపకల్పన ప్రశంసనీయం. గంపెడు సంతానంతో దారిద్ర్యంలో తలమునక లైన ఆంజనేయులు స్వాప్నికజీవితంలోనే మాణిక్యాలరావుకు దర్శనమిస్తాడు. తన నీతి సూత్రాలు మాణిక్యాలరావు ప్రలోభం ముందు ఎగిరిపోతాయి. ఆశ ముందుకు లాగితే భయం వెనక్కు లాగుతుంది. తర్వాత ప్రవేశించే సీతా రామయ్య,హోటల్ యజమాని పాత్రలు పిరికి ఆంజనేయులు పాత్రకు రూపాం తరాలే. ఈ త్రిపాత్రభినయం పసందుగా చేసి శభాషనిపించుకున్నాడు కర్నాటి. నీతిగా వుండాలనే ఆరాటం, చేపలా ఎర్రని మింగాలనే ఆరాటం, పరిణామా లెలా వుంటాయో అనేభీతి-యీ త్రివిధ మనో భావాలకు అద్భుతంగా అద్దం పట్టింది లక్ష్మీనరసయ్యే.

ఇక 'మా వూరు'లో ఐతే మహంకాళిపాత్ర మనకు నిత్యజీవితంలో తారసిల్లేకుతంత్రాలకు కాణాచి.అంతాకుటిలంతను స్వార్థం.శంకరంబలహీనతను

అతడి భార్య దురాశనీ తన స్వార్థాని కుపయోగించుకున్న పయోముఖ విషకుంభం మహంకాళి. మనసులో విషం నింపుకుని, మొహంమీద నవ్వు పులుముకుని, కొంపలకు నిప్పంటించగల దుష్టబుద్ధి-ప్రేక్షకులు ఆ పాత్రని ఆనాడు ఎంతో ఏవగించుకున్నారంటే, అది లక్ష్మి నరసయ్య ప్రతిభకే విజయ పతాకం,నాటకం మొత్తంలో కీలకమైన ఆ పాత్రను కర్నాటి అనితరసాధ్యంగా రంగస్థలిపై ఆవిష్కరించాడు,

ఇవే గాదు, ఆనాటినుంచి మరెన్నో వైవిధ్యమున్న పాత్రలకు జీవంపోసిన ప్రజ్ఞాశాలి ఐన ఉత్తమనటుడు కర్నాటి లక్ష్మినరసయ్య ప్రేక్షకుల మనసుల్లో చిరకాలంగా నిలిచిపోగల పాత్రలెన్నింటినో కర్నాటి పోషించారు. అందులో ఎన్నదగినది శివం నాటకం 'నేరము-శిక్ష'లో పరభాగ్యోప జీవిఐన ముదుసలి, సత్రం గుమాస్తా వేషం. తాగుబోతు. నిర్భాగ్యుడు, ఎందుకూ కొరగాని వాడైన ఆ వేషం కళ్ళకుకట్టినట్టుగా, మరెవ్వరూ నిర్వహించలేనంత సహజంగా. సునాయాసంగా, పోషించగలగడమే మేటినటుని ప్రత్యేకత.

నటుడిగానేగాక నాటక ప్రయోక్తగాకూడా లక్ష్మినరసయ్య సిద్ధహస్తుడన డానికి నిదర్శనం, ఆంధ్రప్రజానాట్యమండలినాటకమైన "అంతా పెద్దలే" వివిధ నగరాల్లో వాణిజ్యపరంగా ప్రదర్శించి, మంచి వసూళ్ళు సాధించి, ఆనాడు సాహసంతో కొత్త ప్రయోగం జరిపి,కొత్త వరవడిని సృష్టించారు. ఆ అపూర్వ మైన నాటకంలో చైనులు పాత్రధారణలో విలక్షణత వ్యక్తం చేయడం కర్నాటి కళాకిరీటంలో కలికి తురాయి.

అందుకే నటులకు నటుడు అనే ప్రశంసకు కర్నాటి అన్ని విధాలా యోగ్యుడు, అర్హుడు, ఔత్సాహిక నాటకరంగంలో అనితర సాధ్యమైన విజయాలెన్నో సాధించిన మన కర్నాటి యీనాటి వర్ధమాన నటులకు విశ్వ విద్యాలయం.

* *

# "దర్శక గురువులు"

—ధారా సత్యనారాయణ శర్మ M. A.
Head of the dept of History. K. B. N. College.

"రంగస్థలం మీద నటుడన్నవాడు కాలుకదిపినా, కన్ను మెదిపినా, ప్రతి కదలికకు ఒక అర్థం వుంటుంది. చెప్పే డైలాగు సందర్భోచితంగా, రసస్ఫోరకంగా ఉండాలి. అన్నిటినీ మించి రచయిత భావాన్ని గ్రహించి దాన్ని సృజనాత్మకంగా, విజయవంతంగా అందించగలవాడే నటుడు. అలాంటి నటుణ్ని అతడికాధార భూతమైన నాటకాన్ని సమాహార రూపంగా, హృద్యంగమంగా శిల్పీకరించేవాడు దర్శకుడు–" ఇవి నేను తన్మయత్వంతో విన్నమాటలు. ఒక సభలో ఒక ప్రయోక్త చెప్పిన భావాలు. ఈయనెవరా? ఇంత చక్కగా విడమర్చి చెప్పాడు! అనే ఆసక్తి నాకు కలిగింది. ఆ తర్వాత చాలా కాలానికి బహుశా ఒక సంవత్సరం తర్వాత ఆయనను కలుసుకోవటం తటస్థించింది. ఆయనే కర్నాటి. ఆ కలయిక శాశ్వతమై, మధురాతి మధురమై అలాగే నిల్చిపోయింది. ఆయన దర్శకునిగా నేను నటునిగా అనేక నాటకాలు ప్రదర్శించటంవల్ల శ్రీ కర్నాటివారిలోని ప్రతిభా, సామర్థ్యాలను నేను చక్కగా అవగతం చేసుకోగలిగాను.

*　　　*　　　*

నేను కాలేజీనుండి బయటకు రాగానే సైకిల్ మీద కనిపించాడు ఓ పెద్దమనిషి. తెల్లనిబద్దరు దుస్తులతో ఠీవిగా ఉన్నాడు. వెంటనే గుర్తుపట్టాను. ఆయనే కర్నాటి అని.

"నమస్కారం! నాపేరు కర్నాటి లక్ష్మీనరసయ్య. మీతో మాట్లాడాలి అలా వెళ్దామా" అన్నారు.

"అలాగే పదండి"

"ఛైర్మన్ నాటకం వేస్తున్నాం. అందులో మీరు ఛైర్మన్ వేషం వేస్తే బాగుంటుందని నా అభిప్రాయం, అందుకే మీ దగ్గరకు వచ్చాను."

"నాకు నాటక రంగంతో సంబంధం తగ్గిపోయి దాదాపు 10 సంవత్సరా

లవుతుంది. రంగు వేసుకోవటం అలవాటు తప్పిపోయింది" అన్నాను.

"అలాక్కాదు. ఆ వేషానికి మీరు సరిపోతారు. పైగా రంగస్థలంతో పరిచయం వున్నవాళ్ళకు కొత్త వేషం వెయ్యటం కష్టమేమీ కాదు. మీకు ఇబ్బంది కలగదనే భావిస్తున్నాను" చాలా జాగ్రత్తగా మాట్లాడారు.

నేను ఆలోచనలో పడ్డాను హైస్కూలులో, కళాశాలలో చదివేటప్పుడు విస్తృతంగా నాటకాలాడిన మాట వాస్తవమే. ముఖ్యంగా గుంటూరు హిందూ కాలేజీలో చదివేటప్పుడు "తుఫాన్" "మాస్టర్జీ", "ఆకాశరామన్న" "పునర్జన్మ" మొదలైన నాటకాలు ఆడాను. ఇంటర్ కాలేజీయేట్ పోటీలలో చురుగ్గా పాల్గొనే వాణ్ని. అనేక బహుమతులు కూడా గెల్చుకున్నాను. ఆ తర్వాత యూనివర్శిటీకి వెళ్ళినపుడు పూర్తిగా చదువులో పడిపోయాను. రంగస్థలానికి దూరమయ్యాను. మళ్ళీ ఇప్పుడు నాటకం వెయ్యాలంటే ఏదోగా అనిపించింది. నా నిశ్శబ్దం శ్రీ కర్నాటి వారికి రుచించలేదు.

"ఏమిటి! ఆలోచనలో పడ్డారు. ఇదుగో చైర్మన్ నాటకం. దీన్ని బాగా చదవండి. త్వరలోనే రిహార్సల్స్ ప్రారంభిద్దాం. మీరు మీ పాత్రను Study చెయ్యండి." అంటూ పుస్తకం అందచేసారు. యాంత్రికంగా నాటకం పుస్తకం చేతుల్లోకి తీసుకుని ఏదో చెప్పబోతున్న నాతో "ఇంకా ఏమీ ఆలోచించవద్దు. మీరు ఆ వేషం వేస్తున్నారు" అని వెళ్ళిపోయారు.

నేను దాదాపు ఆ విషయమే మర్చిపోయాను. కాలేజీ హడావిడిలో పడిపోయాను.

* * *

వారంరోజుల తర్వాత రిహార్సల్స్‌కు రమ్మని కబురువచ్చింది. పుస్తకం తీసుకొని రిహార్సల్స్‌కి వెళ్ళాను, అక్కడ అందరూ కొత్తవారే- శ్రీ పోతిన సింహాచలం-పాపాలపకీరయ్య. కే. శే. సుత్తి వీరభద్రరావు-దగాకోరు దాసయ్య. మరియన్ బాబు-కట్టెలడితి కనకయ్య శ్రీ పిళ్ళా నారాయణరావు- ముసలయ్య పాత్రలను ధరిస్తున్నారు. స్వామీజీ వేషాన్ని శ్రీ కర్నాటివారు ధరించగా, చైర్మన్ రామచంద్రరావు పాత్ర నాకు నిర్దేశింపబడింది.

రిహార్సల్ రూముకు వెళ్ళగానే సిట్టింగ్ రిహార్సల్ చేద్దామని శ్రీ కర్నాటి

వారు సూచించారు. వారే దానికి దర్శకులుకూడా. కొత్త వారి మధ్య అదోరక గా వుంది. నటనతో పరిచయం ఉండటంవల్ల ఆ భావం కనబడకుండా జాగ్రత్త పడ్డాను.

దర్శకుని స్థానంలో ఉన్న కర్నాటివారు నాటక సారాంశాన్ని పాత్రల స్వభావాన్ని ముందుగా విశ్లేషణాత్మకంగా వివరించారు. ఆయన కంఠస్వరం లోని గాంభీర్యత నన్ను ముగ్ధుణ్ని చేసింది. వివరణ విశ్లేషణాత్మకంగానే గాక అతిసులువుగా అర్థమయింది.

"Fringe of the ice berg" లాగా ఆయనలోని ప్రతిభావాపి నిలోని కొన్ని నీటి చుక్కలను మాత్రమే స్పృశించగల్గాను. ఇక సిట్టింగ్ రిహార్సల్స్ ప్రారంభించాం. నా పాత్రకు సంబంధించిన అంశాలను జాగ్రత్తగా ఆసక్తిగా పరిశీలించసాగాను. ఆయన సంభాషణలను ఉచ్చరించేతీరు, శబ్దాన్ని తనఅంకెకు తెచ్చుకొని మలిచే పద్ధతి నాకు బాగా నచ్చింది. అన్నింటినీ మించి డైలాగ్ అనే దానికి ప్రాణప్రదమైన మాడ్యులేషన్ అంటే ఆరోహణా అవరోహణలు అత్యద్భుతంగా వున్నాయి. నాకున్న రంగస్థల అనుభవంతో వాటిని బేరీజు వేసుకోవటం ప్రారంభించాను. ఆయన సంభాషణలను పలికే రీతిలో అవాస్తవికత కానీ Over emphasis కానీ, లేదా అనవసరమైన మెలోడ్రామా కానీ కని పించటంలేదు. అన్నింటికంటె డైలాగ్‌ను పండించటంలో లేదా దాని పరిణితిని పర్యవసాయిగా పొదగటంలో ప్రదర్శించే నేర్పు నాకు బాగా నచ్చింది. ఇక ఉండబట్టలేక అదేమాట పైకి అనేశాను. దానికాయన చిరునవ్వుతో సమాధానం చెప్పారు. "ప్రకృతిలో ప్రతి అంగుళంలో మనకు లయ కనిపిస్తుంది. అలానే ప్రతి శబ్దంలోనూ ఒక సొగసువుంది. ప్రతిమాటకు అర్థంతోబాటు భావస్ఫోరక మైన సౌందర్యం ఇమిడి వుంది. దానిని అర్థంచేసుకున్నవాడే మహానటుడు. అలాంటి దానిని ప్రోత్సహించటమే దర్శకుని యొక్క కర్తవ్యం."

ఇక స్టాండింగ్ రిహార్సల్స్‌కుదిగాం. అంతకుముందు సంభాషణలనుబాగా చదివి వుండటంవల్ల డైలాగులు బాగానే ఉన్నాయి గానీ మూమెంట్‌తో ఆంగికాభినయంతో అవి Sychronize కావటంలేదు. కోఆర్డినేషన్ లోపించి బాలన్స్ తప్పిపోతున్నది. నేను పడుతున్న అవస్థను ఆయన గమనించాడు.

"చూడండి మాష్టారూ! నాటకానికి డైలాగ్ ఎంత ముఖ్యమో! మూవ్‌మెంట్ కూడా అంతే ముఖ్యం! అయితే ఈ విషయంలో వివాదం వుందనుకోండి! కొంతమంది ప్రఖ్యాత దర్శకులు నటుణ్ని మూవ్‌మెంట్ పేరుతో సర్కస్‌చేయిస్తారు. ఆ కదలికలు కొన్ని సంక్లిష్టంగా వుంటాయ్. అందువల్ల సహజత్వం దెబ్బ తింటుంది. సన్నివేశం యొక్క పరమార్థం విచ్ఛిన్నమౌతుంది. అలాంటి శైలి కాదునాది. పరిమితమైన కదలికలోనే అందంవుంది ఆ కదలిక ప్రేక్షకునికి అర్థస్ఫూర్తిని, ఆనందాన్ని కల్గించాలి. నటుడు పాత్రతో తాదాత్మ్యం చెందడానికి కదలిక ఉద్దీపనం కావాలి తప్ప అవరోధం కాకూడదు. అన్నిటికీ మించిమనం చెప్పేడైలాగు యొక్క టైమింగ్ చాలాముఖ్యం. ఇవాళ్టికిక ముగిద్దాం, రేపు కలుసుకుందాం. ఖచ్చితంగా టైమ్‌ను పాటిద్దాం. అలా చెప్పటం దర్శకునిగా నా బాధ్యత. దీనిని నటులందరూ గమనించవలసిన అవసరం ఎంతో వుంది." ఆ వాక్యాలలోని అర్థాన్ని. మందలింపును కూడా గ్రహించాను.

ఒక సన్నివేశాన్ని చేస్తున్నాం, అది మొదటిరంగంలోనిది. ముసలయ్య అనే నౌకరు ఛైర్మన్‌కు విశ్వాస పాత్రుడు, రామచంద్రరావు చైర్మన్‌గా ఎన్నికయిన రోజున ఊరేగింపుగా ఇంటికొస్తాడు చైర్మన్. ముసలయ్య చైర్మన్‌కు దిష్టి తీస్తాడు. ఆ సమయంలో ముసలయ్యను చైర్మన్ తన చేతుల్లోనికి తీసుకొని ఆర్ద్రంగా హృదయానికి హత్తుకుంటాడు. ఇదీ సన్నివేశం "ఈ సన్నివేశంలో వున్న కరుణరసపూరితమైన అంశాన్ని ప్రేక్షకులకందించాలి నటన వున్నత శిఖరాన్ని అధిరోహించాలి. ప్రతివారూ ఆనందబాష్పాలు రాల్చాలి. అలా చేయగల్గినప్పుడే రచయిత భావాన్ని మనం ప్రేక్షకుల కందించ కల్గుతాం" అన్నారు శ్రీ కర్నాటి. నాకెందుకో అలా అన్పించలేదు. ఇది సామాన్యమైన సన్నివేశమేకదా! దర్శకులు ఎందుకు ఇంత ఆరాటపడుతున్నారో అర్థం కాలేదు. అలా ఆలోచిస్తూనే నా భావాన్ని చాలా మృదువుగా పైకి చెప్పాను. దానికి కర్నాటి లక్ష్మీనరసయ్యగారు చిరునవ్వు నవ్వారు.

"చూడండి! మాస్టారూ! ఇది ప్రారంభ సన్నివేశం, పాత్రల తాలూకు భావాలయొక్క ప్రవేశిక కూడా స్పష్టంగా కన్పిస్తుంది. అందుచేత పాత్రల తాలూకు ఛాయలు ప్రేక్షకులకు స్పష్టంగా అవగతం కావాలి. ఈ సన్నివేశాన్ని రచయిత నిష్కారణంగా సృష్టించలేదు. ఏదో ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టి

కాని దీన్ని సృష్టించాడు. దాని లోతుల్లోకివెగి అంతరార్థాన్ని బహిర్గతం చెయ్యాలి. అందుకు తగిన రసపోషణ చెయ్యక తప్పదు. దీన్ని సజావుగా నిర్వహిస్తే ప్రేక్షకులలో ప్రతిస్పందన తప్పకుండా కల్గుతుంది. ప్రదర్శనే నిదర్శన." అన్నారు. నా కెందుకో ఆయన సమాధానం తృప్తి కల్గించలేదు. నా సంశయాత్మక డోలాయమాన స్థితిని ఆయన గ్రహించారు.

"ఈ సన్నివేశాన్ని మనం జాగ్రత్తగా చేద్దాం. రంగస్థలవ్యాకరణంలో నా సూత్రాలు తప్పో రైటో తెల్సుకుందాం" అన్నారు.

నాకుకూడా అదే అన్పించింది. దాన్ని చాలాసార్లు చేశాం. చేసేకొద్ది సన్నివేశం పదునెక్కింది. అది సన్నివేశబలమో! నటుల సామర్థ్యమో నాకు అర్థంకాలేదు. అదే విషయాన్ని ఆయనతో ప్రస్తావించినపుడు, "రెండూ ఉన్నాయ్. కాని సన్నివేశానిదే ప్రథమ తాంబూలం." అన్నారు. మళ్ళీ నాలో ఘర్షణ, అయితే ప్రదర్శన రోజున శ్రీ కర్నాటి వారు తమ వాదనా బలాన్నే ఋజువుచేసుకున్నారు.ఆ సన్నివేశానికి ముగ్ధులై ప్రేక్షకులు పెద్దపెట్టున కరతాళ ధ్వనులు చేశారు. 'కరుణా ఎకోరసః' అన్న వాక్యానికి అది సజీవ భాష్యంగా మిగిలిపోయింది.

కర్నాటివారు దర్శకులేగాక ఛైర్మన్ నాటకంలో స్వామిజీ పాత్రను అత్యద్భుతంగా పోషించారు. ఈ నాటకంలో ఎందరు ఎన్ని పాత్రలు మారినా ఆ పాత్రను పోషించటంలో ఆయనకాయనే సాటి. ఆ పాత్రను ఆయన చాలా చక్కగా ఆవిష్కరించారు. సామాన్య ప్రేక్షకులకు స్వామీజీ కుత్సితుడు, కుటిలుడు పయోముఖ విషకుంభంలా సాక్షాత్కరించేవాడు. సామాజిక ఆనుపానులను, వర్గ స్వభావాన్ని పరిశీలన చేయగల్గినవారికి స్వామిజీపాత్ర ఒక వర్గానికి ప్రతినిధిగ కనిపించేటట్లు చేయకల్గిన సామర్థ్యం కర్నాటివారిది. శిధిలమవుతున్న ఒకానొక సంప్రదాయ శిల్పసముదాయంలో స్వామిజీ ఒక ఛిద్రశకలం, మంచో చెడో అతడి వెనుక ఒక గమ్యం, ఆదర్శం ఉన్నాయ్. దానికోసం అతడేమార్గాన్నయినా అనుసరిస్తాడు. ఆపాత్రను సరిగ్గా బేరీజు వేసుకొని వారు నటించేవారు. దాని తాలుకు భావం ప్రేక్షకుల హృదయాలలో ముద్రవేసుకొనిపోయేది. మొరటుతనం, గాంభీర్యం, కౌటిల్యత, హాస్యం,

అన్నింటినీమిళితం చేసి ఆ పాత్రను ఒక నవరసడోలికగా, ప్రతిభా శిల్పంగా మలచాడు. ఆపాత్రవేస్తూ ఆయన సామాన్య ప్రేక్షకులనుండి తిట్లనే దీవెనలుగా స్వీకరించారు. అసలు విషయమేమిటంటే ఆయన అంత బరువైన పాత్రను పోషిస్తూ దర్శకత్వం నిర్వహించేవారు.

ఛైర్మన్ నాటకంలో ఒక విశిష్ట శిల్పం రూపు కట్టుకొని వున్నది. సన్నివేశాల తీరు,రంగాల ఆవిష్కరణ, పాత్రల కదలిక, పాత్రల స్వభావాల యొక్క క్రమబద్ధీకరణలో ఒక నిండైన పద్ధతి, లేక ఒక పాటరన్ గోచరిస్తుంది. దాని ఆయువు పట్టును సరిగ్గా అర్థం చేసుకుంటేగాని నాటకం యొక్కగమనంలోని సౌలభ్యత అర్థం కాదు. రచయిత శ్రీగోపాలరావు పరిణితి చెందిన భావుకుడు. నాటక శిల్పంలో అందెవేసిన చెయ్యి అలాంటి నాటకంలో వున్న విశిష్టతను తన దర్శకత్వం ద్వారా ద్విగుణీకృతం చేసిన మహామేధావి కర్నాటి అనటంలో సందేహం లేదు. మేమెక్కడ ఆ నాటకాన్ని ప్రదర్శించినా అది ప్రేక్షకులను ఆకట్టుకోవడమేగాక వారి హృదయాలలో చెరగని ముద్ర వేసింది. తన దర్శకత్వంద్వారా ఆ నాటకానికి ఆయన అమరత్వాన్ని చేకూర్చాడు. దర్శకుడు నిష్కామయోగి. నాటకం విజయవంతమైనప్పుడు నటులకు లభించే ప్రశంస దర్శకునికి లభించదు. దర్శకుడెంత కష్టపడినా మిగతావారికొచ్చిన గుర్తింపురాదు. అయినా ఋషితుల్యమైన కర్తవ్యాన్ని నిష్ఠతో ఆచరించే దర్శకుడు మాత్రమే నాటకాన్ని ఆమూలాగ్రంగా పరిశీలనచేసి దాని ఫలితాన్ని ప్రజల కందించగలడు. ఆ కోవకు చెందినవాడే శ్రీ కర్నాటి.

'ఛైర్మన్' పాత్ర ఆవిష్కరణ గూర్చి నాకు కొన్ని సమస్యలుత్పన్నమైనాయ్. అవి నా వైయుక్తికమైనవికాదు, నాటకానికి సంబంధించినవే, పెద్ద పులులమధ్య లేడిలాగా వుంటుంది ఆ పాత్ర. స్వామీజీ ఒకవైపు, హాస్యరసాన్ని చిందించే పరమ మూర్ఖులైన కౌన్సిలర్లు ఒకవైపు విజృంభిస్తూవుంటే పరమసాత్వికుడు, ఆదర్శవాది యైన ఛైర్మన్ పాత్ర పేలవమైపోతుంది అన్న అభిప్రాయంనాది. పాత్ర చిత్రీకరణ సహజమైనా బలహీనంగా వుందేమోనన్న సంశయం కలిగింది. దాన్ని ధరించే నటుడు పడే బాధ వర్ణనాతీతం. ఆ భావాన్నే ప్రారంభంలో నేను వ్యక్తం చేసాను, "నటుని ప్రతిభవల్ల మాత్రమే ఆపాత్ర పరిణితి చెందుతుందే తప్ప, పాత్రలో బలంలేదు." అన్నాను శ్రీకర్నాటిగారితో దానికాయన ఒకక్షణం ఆలోచించి—

"శర్మగారూ! అది సరైన అవగాహనకాదు. రామచంద్రరావు పాత్ర ఉత్కృష్టమైన చిత్రీకరణ. దానిముందు ఏ పాత్రా నిలబడలేదు. ఆదర్శానికి ప్రతీకయైన అతని పాత్ర మిగతాపాత్రలకంటే విభిన్నమైంది. మిగతాపాత్రల ఆకర్షణ, సూత్రప్రాయమేతప్ప వాస్తవంకాదు. నాటకం ముగిసేసరికి ప్రేక్షకుల మనోభావంతో నిల్చిపోయే పాత్ర ఛైర్మన్‌దే. ఆ పాత్రను ఎంత సాత్వికంగా ఆవిష్కరిస్తే దానికంత బలం చేకూరుతుంది." క్రమంగా కర్నాటి వారు చెప్పింది వాస్తవమే అయింది. ఆ పాత్ర స్పష్టీకరింపబడి ఉజ్వలంగా ప్రకాశించటం మొదలైంది, దానికనుగుణమైన శిక్షణ, దర్శకత్వాన్ని చాలా చక్కగా శ్రీకర్నాటివారు అందించారు.

దర్శకునిగా శ్రీ కర్నాటి ప్రతిభకు ఈ నాటకంలో ఇంకా కొన్ని సందర్భాలను ప్రస్తావించవలసిన అవసరం ఎంతైనా వుంది- ఛైర్మన్ నాటకంలో వైవిధ్యం కల్గిన, ఘర్షణాత్మకమైన సన్నివేశాలెన్నో, వున్నాయ్. అందులో మూడు సన్నివేశాలు చాలా ముఖ్యమైనవి,వాటిని శ్రీ కర్నాటివారు ఎంతో చక్కగా తయారుచేశారు. సన్నివేశాలను పండించటంలో గొప్ప ప్రతిభను ప్రదర్శించారు. ఆ సన్నివేశాలను రిహార్సల్స్ చేసేటప్పుడు వాటిలో సంపూర్ణంగా మునిగిపోయి, ఒళ్ళు మర్చిపోవటం, అవసరమైన భావావేశానికి లోనుకావటం అనే అంశాలకు ఆయన వ్యతిరేకి. రస నిర్దేశాన్ని దాని తాలూకు ప్రభావాన్ని నటుడు ప్రేక్షకులలో కల్గించాలి కానీ, తాను వాటికి లోనుకాకూడదు. ఈ విషయంలో నటుడు అద్వైతిగా శోభించాలి. ఇది కష్టసాధ్యమే అయినా దాన్ని వాస్తవం చెయ్యటంలోనే కర్నాటివారి ప్రతిభ ఇమిడివున్నది.

మొదటి సన్నివేశంలో అన్నదమ్ములు అంటే ఛైర్మన్ అతని తమ్ముడు నారాయణరావులు ఘర్షణ పడతారు. అది వ్యక్తిగతమైందికాదు. ఆదర్శాలకు సంబంధించింది.ఇద్దరూ ఆదర్శవాదులే.తమ్ముడు పూర్తిగా శ్రామికవర్గపక్షపాతి. అన్నది బాధ్యతతో కూడుకొనివున్న ఆదర్శం. ఈ సన్నివేశం నెమ్మదిగా సాత్వికంగా ప్రారంభమౌతుంది, ఆ తర్వాత సంభాషణలు రాకెట్లలా దూసుకొని వస్తాయి. ఒకరితో నొకరు గట్టిగా మాట్లాడుతారు. ఉద్రేకంలో సంభాషణఔచితి చెడకూడదు.కదలికలకు అర్థం ఉండాలి.వాటిలోనే అన్నదమ్ముల ప్రేమ, ఔన్నత్యం, ఆదర్శం మిళితమై వుండాలి. ఈ సన్నివేశం చిరుగాలిలా

ప్రారంభమై ప్రభంజనంగా మారింది. తర్వాత అన్నగారు తన అకారణ పరుష త్వాన్ని గుర్తిస్తాడు.తమ్ముని ఔన్నత్యాన్ని అర్థం చేసుకుంటాడు. ఈ సన్నివేశం మొత్తం అతి చురుగ్గా, భావస్ఫోరకంగా ప్రదర్శించబడింది. ప్రేక్షకులను రంజింప చేసింది. ఆ సన్నివేశం యొక్క పూర్తి సందేశం ప్రేక్షకుల కందించటంలో నటులనేర్పుకు పదును పెట్టిన ఘనత, సన్నివేశాన్ని కూర్చటంలో ఆయన పట్టు, శ్రమ అనితరసాధ్యమని చెప్పవచ్చు.

అలానే రెండవది స్వామీజీ, ఛైర్మన్‌ల ఘర్షణ. ఇక్కడ కర్నాటివారే స్వామీజీ వేస్తున్నారు కాబట్టి ఆ పాత్రకు ఎలాంటి పేచీలేదు. పోతే నా పాత్ర- దాన్ని ఆ సన్నివేశంలో శ్రీ కర్నాటి అతిగొప్పగా శిల్పీకరించారు. పేదప్రజలను ఆదరించే ఆదర్శవాదిగా ఛైర్మన్ రామచంద్రరావు పలికే ప్రతిమాటకూ స్పందన కల్గింది, Duality (ద్వంద్వ విలువలు). మోసం లక్షణాలను కల్గిన స్వామీజీ ఉద్రేకానికి లోనై మళ్ళీ సాత్విక భావంలోనికి స్థిర పడడాన్ని శ్రీకర్నాటి వారు తన అభినయ చాతుర్యం ద్వారా ప్రేక్షకులను రంజింప చేశారు. నేను మర్చిపోలేని సన్నివేశాలలో ఇది ఒకటి. అలాగే తండ్రీకొడుకులు ఘర్షణపడే సన్నివేశాన్ని చాలా చక్కగా రూపొందించారు.

ఉన్నతమైన కళావిలువలను ఔచిత్యాన్ని పరిరక్షించటంలో శ్రీ కర్నాటి వారు ఎప్పుడూ రాజీ పడలేదు. ఛైర్మన్ నాటకంలో ఒక చిన్న సమస్య తలెత్తింది. మూర్ఖులు విలాసవంతులైన ముగ్గురు కౌన్సిలర్స్ క్లబ్బులో త్రాగి తందనాలాడే సీనులో ఒక డాన్సర్‌ను పెట్టాలనీ, ఆ సీను అలాచేస్తే ప్రేక్షకులు రిలీఫ్ పొందుతారని చాలామంది నటులు వాదించారు. ఆ సీనును ప్రవేశ పెట్టినందువల్ల నాటకం యొక్క స్థాయి తగ్గిపోతుందని కర్నాటి వారు వాదించారు. నేనుకూడా వారి అభిప్రాయంతో ఏకీభవించాను. మొత్తానికి ఒకసారి మాత్రంఆ సీనును ప్రదర్శించినా తర్వాత మా పట్టుదల వల్ల దాన్ని రద్దు చెయ్యటం జరిగింది.

ఛైర్మన్ నాటకం నాకు ఎన్నో పాఠాలు నేర్పింది. కర్నాటివారు తన దర్శక ప్రతిభవల్ల దాన్ని మహత్తరమైన నాటకంగా తీర్చి దిద్దారు. నాటక సూత్రాలను దానికి చక్కగా అన్వయింప చేశారు, ఆంధ్ర నాటక రంగంపై అనుభవం, నిరుపమాన ప్రతిభ, ఔచిత్యం ఆదర్శం కల్గిన దర్శకులలో కర్నాటి వారు ప్రథమ శ్రేణికి చెందుతారనటంలో ఏ మాత్రం సందేహంలేదు. *



"వట్టయ్య" పాత్రధారిగా శ్రీకర్నాటి

# "సజీవ కళా ప్రవంతి"

శ్రీ కె.యస్.టి.శాయి

ప్రయోక్త, నటుడు, నాటక రచయిత.

కర్మ సిద్ధాంతం నమ్మితే-కళాకారుడిగా పుట్టటం ఓ అదృష్టం-వరం. ప్రపంచాన్ని చూడటానికి అలవాటుపడ్డ ప్రజలు, కళాకారుడిలో మానవ ప్రపంచాన్ని చూడగలుగుతారు-అంతేనా? పరకాయ ప్రవేశం చేసి సమాజంలో తనలాంటి మరో మనిషి స్వభావాన్ని తనలో యిముడ్చుకోగల విశాలహృదయం కళాకారుడిది. 'కళ' కళకోసం అన్న నానుడి పుట్టిననాటి కంటే, కళ ప్రజలకోసం అని భావించిన వర్తమానంలో కళాకారుడి ప్రాధాన్యం, బాధ్యత ఎంతో పెరిగింది.

సుదీర్ఘమైన తెలుగు నాటకరంగ చరిత్ర పరిశీలిస్తే, పరిశోధిస్తే మనకు నటులు, ఉత్తమనటులు-మహానటులు కోకొల్లలుగా లభ్యమౌతారు. కానీ, ప్రజానటులు మాత్రం అల్పసంఖ్యలో కనబడతారు. నటులను వర్గీకరించటం, పొరబాటు కావచ్చుగాని, తప్పుమాత్రం కాదు.ఒక మహానటుడు సాటి నటీనటులకు, సమాజాలకు, కొద్దిమంది ప్రేక్షకులకు జోత్స్నలను పంచిపెడితే, ప్రజానటుడు సమస్త మానవ సమాజానికే ప్రచండ భానుడు.కనుక నాదృష్టిలో 'మహానటుడు' అనే స్థాయికంటే ఉన్నతమైన స్థానం ప్రజానటులది. సమకాలీన సమాజపు ఛాందస పోకడలు, మూఢచారాలకు స్పందించి, వాటిలోని లొసుగులను విడమర్చి విపులీకరించే పవిత్ర బాధ్యత ప్రజానటులపై వుంటుంది- కనుక ప్రజానటులస్థాయి చాలా ఎక్కువని మనం అర్థం చేసుకోవచ్చు- ఆ స్థాయికి చేరిన అతి తక్కువ మంది కళాకారుల్లో శ్రీ కర్నాటిది మొదటి స్థానం అని చెప్పటంలో ఎవ్వరికీ అనుమానం వుండ వలసిన అవసరంలేదు-

మనిషి సహజగుణాలు ధరించేపాత్రలపై పడ్తుంటుంటాయని కొందరు పెద్దల అభిప్రాయం అది నిజం కావచ్చుగాని. అందరి విషయంలో కాదు. శ్రీ కర్నాటి విషయంలో అసలు కానే కాదు. అందుకు దాఖలాలు నా వద్ద చాలా వున్నాయి.

**అగ్నిహోత్రావధాన్లు:-** ఇదొక అగ్నిగోళం. పేరాశకు పెట్టింది పేరు. తన మాట మాత్రమే నెగ్గాలనే నిరంకుశస్వభావి. జాలి కరుణ

కంచుకాగడా వేసి వెతికినా దొరకదు. మరి యీ పాత్రను, మితభాషి, సహృదయుడు. శాంతస్వభావి అయిన శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్య అభినయించి, ప్రేక్షకులను ఆశ్చర్యపరిచారు. ఆనంద పర్చారు. విజయవాడ- తెనాలి ప్రేక్షకులు గురజాడ అవధాన్లకు సరైన ప్రతిరూపం శ్రీ లక్ష్మీనరసయ్య అని కొనియాడిన సందర్భం నాస్వానుభవం కూడా! తన స్వభావానికి పూర్తి విరుద్ధమైన పాత్రను అభినయించి సెహభాష్ అనిపించుకున్నాడు.

పట్టయ్య:- ఈ పాత్ర విచిత్రమైంది. క్లిష్టమైంది- నన్నయగారి మాటలో చెప్పాలంటే. "నిండుమనంబు, నవ్య నవనీత సమానము, పల్కు-దారుణాస్త్ర ఖండల శస్త్రతుల్యము".... కానీ అమాయకుడు. రాజకీయ చదరంగలో క్షూరుకుపోయి, తన సంసారాన్నే అలక్ష్యం చేసుకుంటాడు. ఈ పాత్రలో శ్రీ కర్నాటి జీవించారు. మానసిక సంఘర్షణను, వ్యధను చూపించటంలో కృతకృత్యులైనారు. రచయిత శ్రీకొండేటి "సరైన పట్టయ్యను శ్రీ కర్నాటిలో చూశాను, కర్నాటి వల్లనే నా నాటకం నిలబడింది" అన్న మాటలను బట్టి శ్రీ కర్నాటి శక్తి సామర్థ్యాలు అర్థం చేసుకోవచ్చు. అలానే శ్రీ కర్నాటి ధరించిన ప్రతి పాత్రకు ఓ ప్రత్యేకత గుర్తింపు రావటం వారి పాత్ర అధ్యయన' విధానానికి చక్కని తార్కాణం, మా భూమిలో రాముడు, మా వూరులో మహంకాళి, 'ఆసామి'తో శ్రీ రంగం. ఒకటేమిటి అన్నీ చిరస్మరణీయాలే. పైనుదహరించిన పాత్రలు శ్రీ కర్నాటిని ఓ మహానటుడుగా ముద్రవేశాయి. కానీ వాస్తవం మరింత భిన్నమైంది ఆయన స్థాయి ప్రజానటుడి స్థాయి. ప్రజాకళాకారుడి స్థాయి.

ప్రజలను చైతన్యవంతులుగా తీర్చిదిద్దటం కోసం. తెలంగాణా పోరాట కాలం నుండి నేటివరకూ వివిధ కళారూపాలద్వారా సంఘ సేవ చేస్తున్న కర్నాటి నిస్సంశయంగా ప్రజా కళాకారుడు. జానపద కళలను వెలుగులోకి తీసుకురావటానికి తన యావచ్ఛక్తి వినియోగిస్తున్న ప్రజాహితుడు: వీధి నాటకాలు, వీధి భాగవతాలు, యక్షగానం. జముకుల కథ వీటన్నింటిలో నిష్ణాతుడు. తనకుగల సర్వ కళా ప్రక్రియలను మానవ సమాజ శ్రేయస్సుకే వినియోగిస్తున్న సౌజన్యమూర్తి శ్రీ కర్నాటి.

యాభై వసంతాలపైగా ఆంధ్రనాటక రంగస్థలంలో, జన జీవన ప్రవంతిలో. ఔత్సాహిక రంగస్థలఉద్ధారకుడుగా ఖ్యాతి, ప్రఖ్యాతిగాంచిన శ్రీ కర్నాటి. తెలుగు నాట "కర్నాటి అంటే సజీవ కళాప్రవంతి" అని కొనియాడ బడతారని, తెలుగు నాటక రంగ చరిత్రలో ప్రజాకళాకారుడిగా శాశ్వత స్థానం కలిగి వుంటారని నమ్ముతున్నాను.

# మానవతామూర్తి మహానటుడు శ్రీకర్నాటి

—డి. యం. కె. గాంధి

"Affection is the broadest basis of good life" అన్నాడు జార్జి ఇలియట్. దీనికి మనం తెలుగు చెప్పుకోవాలంటే మమకారమే మంచి జీవితానికి గట్టి పునాది అని చెప్పుకోవచ్చు. నేటి విశిష్టవ్యక్తి కర్నాటి వ్యక్తిత్వం సరిగ్గా ఇదే పునాదిపై నిర్మితమయింది. మృదుహాసం, మధుర భాషణం ఆయన సొత్తు. Be good and be happy అనేది ఆయన మతం. అందరితో చెలిమిని పెంచుకొనే ఈ స్నేహశీలి నోటివెంట ఎప్పుడు ఒక్క పరుషవాక్యం పలుకదు. 'To gossip is a fault, to libel is a cirme. to Slander is a Sin' అనేది అయన నియమం. ఈ నియమానుసారంగానే ఆయన అనర్థమైన వ్యర్థభాషణకు ఎన్నడూ పూనుకోలేదు. పరదూషణ అనే నేరానికి పాల్పడలేదు. పాపభూయిష్టమైన అన్యాపవాగులకు తలపడలేదు. 'Discipline in life is more precious than life itself' అన్న సూక్తికి అనుగుణంగా ఆయన క్రమశిక్షణకు ఎక్కువ విలువ ఇచ్చాడు. ఆయన ధరించే తెల్లటి దుస్తుల్లాగే అవధరించే హావభావాలు కూడ స్వచ్ఛంగా, నిర్మలంగా వుండి ఎదుటివారిని ఇట్టే ఆకట్టుకుంటాయి.

"Some men are born great, some achieve greatness. and some have greatness thrust upon them" అన్నాడు షేక్స్పియరు. మన కర్నాటి స్వశక్తితో శ్రమించి కీర్తిశిఖరాలందుకున్న వ్యక్తి. ఆయన తన బతుకుబాటలో తన స్వేచ్ఛా శీలాలను ఎన్నడూ పణంగా పెట్టలేదు. 'Many aspire for greatness but few attain it' అన్నట్టు అందరూ కీర్తికొరకు ఆశపడితే కర్నాటిని కీర్తి తనంతటతానే వరించింది. కర్తవ్యం సదా శిరోధార్యంగా భావిస్తూ వచ్చాడాయన. వినయం ఆయన ఉన్నతికి సోపానమయింది. మహానటుడైనా పటాటోపం ఎరుగని మనిషి ఆయన. "The rightecus shall flcurish as palm tree" కర్నాటి ఉదాత్తుడు, ధీశాలి. అందుకే ఆయన తాళవృక్షం అంత సమున్నతంగా ఎదిగాడు. "Art is long life is short" అన్న విషయాన్ని గుర్తించిన కళాకారుడు కనుక అహోరాత్రాలు కళామతల్లి సేవలో శ్రమిస్తూ జీవితాన్ని సార్థకం చేసుకుంటున్నాడు. ఆయన చేపట్టిన ప్రతి కళారూపంలోనూ, ఆయన రూపం అచ్చుదిద్దుకొంటుంది. ఆయన ప్రతిభకు

అర్ధం పడుతుంది. "No legacy is so rich as honesty"గా కర్నాటికి సుసంపన్నమైన ఆస్తి ఆయన నిజాయితీ. నిజాయితీతోపాటు విజ్ఞానం పడుగు పేకలా పెనవేసుకున్న జీవితం ఆయనది. "Integrity without knowledge is weak and useless,knowledge without integrity is dangerous and dreadful" అన్నాడు శామ్యూల్ జాన్సన్. విజ్ఞానం లేని నిజాయితీ నిరుపయోగంకాగా నిజాయితీ లోపించిన విజ్ఞానం ప్రమాదకరమైంది. కర్నాటి వారిలోని నిజాయితీ, విజ్ఞానం పూవుకు తావిలా ఆయన వ్యక్తిత్వాన్ని గుబాళింపచేశాయి "Geniusos one percent inspiration ninety nine percent perspiration" అని థామస్ అల్వా ఎడిసన్ అన్నాడు. కర్నాటి లోని కళాకారునివెనుక నూటికినూరుపాళ్ళ శ్రమగోచరిస్తుంది.అనిరంతర శ్రమ లోనే ఆయనకు ఆనందం. "As you have come into this world, leave your mark behind" అని స్వామి వివేకానందుడన్నాడు. కర్నాటి కళా రంగానికి చేసిన సేవలు చరితార్ధకాలు.

కర్నాటి అభ్యుదయవాది. మానవతావాది, నాటకరంగాన్ని ప్రజా ఉద్య మాలకు ఒక వేదికగా, సాధకంగా ఉపయోగించుకున్నారు. అలాగే సామాన్య ప్రజలకు సన్నిహితమైన జానపద రూపాలను వెలుగులోకితెచ్చి, ప్రచారంచేసి మన సంస్కృతికి జీవంపోస్తున్న కళాస్రష్ట ఆయన. నటుడు, గాయకుడు, వర్త కుడు, ప్రయోక్త, ఒక్క మాటలో చెప్పాలంటే కళాపారంగతుడు. అయినా నిరంతర కళాతపస్వి. ఆయనలోని పాటవం, ఆత్మబలం ఒక విశిష్ట వ్యక్తిగా మలచింది.

**ఈ విశిష్ట వ్యక్తిని సన్మానించటం కళామతల్లిని గౌరవించుకోవడమే.**

శ్రీ కర్నాటి జీవితపు పుటల్ని పరికిస్తే ఆయన ప్రజ్ఞాపాటవాల వెనుక ఎంతటి శ్రమ కఠోరదీక్ష పాదుకొని వున్నాయో అవగతమవుతుంది. పుట్టింది రైతు కుటుంబంలో. మెట్రిక్యులేషన్‌తోనే చదువుకు అంతరాయం కలిగింది. భుక్తికోసం కొన్నాళ్ళు బడిపంతులు ఉద్యోగం చేశారు. అలా బడిపంతులుగానే వుండిపోతే ఇంతటి గొప్ప కళాకారుడు మరుగున పడిపోయి వుండేవాడేమో కాని ఆయనలోని కళాతృష్ణ ఉద్యోగంలో నిలవనివ్వలేదు. ప్రజానాట్యమండలి

ఈయనలోని కళాభినివేశానికి ఊతం ఇచ్చింది. ఆయన గొప్ప నటుడుగా రూపొందాడు. శ్రీ కర్నాటి కళాకారుడే కాదు గొప్ప దేశభక్తుడు కూడా. 18 ఏళ్ళ వయస్సులోనే స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొని మూడుసార్లు జైలుకు వెళ్ళాడు. తెలంగాణా గ్రామాల్లో వయోజనులకోసం రాత్రిపూట పాఠశాలలు నడిపాడు. జానపద కళారూపాల ద్వారా గ్రామీణులను చైతన్యపరచడానికి కృషి చేశాడు. నాజర్ బుర్రకథ దళంలో రాజకీయం, హాస్యం చెప్పడంలో సాటిలేనివాడని పేరు తెచ్చుకున్నాడు. ఒక్క బుర్రకథ అనే ఏమిటి, జముకుల కథ, చెక్కభజనలు, కోలాటం, సుద్దులు, చిత్రవిచిత్ర వేషధారణలో జనరంజకంగా పెక్కు ప్రదర్శనలు ఇచ్చాడు.

ఇవన్నీ ఒక ఎత్తు కాగా, నటుడుగా శ్రీ కర్నాటి ఉన్నత శిఖరాల్ని అందుకొన్న విషయం మన అందరికీ తెలిసిందే. నాటి 'ముందడుగు', 'మాభూమి' నాటకాలతో మొదలుపెట్టి, ఆయన నటించి ప్రదర్శించిన నాటకాలు అసంఖ్యాకాలు. ఆయన పొందిన పురస్కారాలు అనేకాలు. పుట్టిల్లు, అగ్గిరాముడు, భలేబావ, ఈ చదువులు మాకొద్దు, ఈ చరిత్ర ఏసిరాతో, పూలపల్లకి, లవ్‌మారేజ్, ఇది కాదు ముగింపు, నీడ లాంటి సినిమాల్లో నటించారు.

విజయవాడలో శ్రీ కర్నాటి నెలకొల్పిన 'ఆంధ్ర నాటక కళాసమితి' ఎంతోమంది కళాకారుల్ని ప్రోత్సహిస్తూ కళామతల్లికి అమూల్యమైన సేవ చేస్తోంది. ఆయన నెలకొల్పిన జానపద కళా కేంద్రం, ఎందరో కళాకారులను తీర్చిదిద్దుతోంది.

ఏ వ్యక్తిలోనైనా ఒక కళలో ప్రతిభ, రాణింపు వుండడం కద్దు. అయితే మన కర్నాటి సర్వకళా పారంగతుడుగా రూపుదిద్దుకున్న యశస్వి. పృథ్వీరాజ్‌కపూర్, శాంతారాం వంటి మహామహుల మన్ననలు పొందిన ప్రజానటుడు. ఆయన ఖ్యాతి మరింతగా దశదిశలా వ్యాపించాలని ఆకాంక్ష.

శ్రీ కర్నాటి సంస్కారం కల వ్యక్తి. ఈ సంస్కారంలో నుంచి వచ్చిందే సంస్కృతి . సంస్కారం అంటే శుద్ధి చేయడం, పదును చేయడం అని అర్థం చెప్పుకోవచ్చు. ఇంగ్లీషు పదం 'కల్చర్' కూడ దాదాపు అదే అర్థం ఇస్తుంది, COLERE అనే లాటిన్ పదం నుంచి CULTURE అనే పదం

వచ్చింది. COLERE అంటే దున్నడం, ఆరాధించడం అని. దున్నడం అంటే సంస్కరించడం అన్నమాట. ఈ నాటక కృషీవలునికి ఈ పదం చక్కగా అతికినట్టు సరిపోతుంది. సంస్కృతి అంతరంగికమైనదైతే, సభ్యత బాహ్యస్వరూపాన్ని ప్రస్ఫుటపరచేది. వ్యక్తి మానసిక స్థాయిని సంస్కృతి సూచిస్తే, జీవన సరళిని సూచిస్తుంది సభ్యత. ఈ సంస్కృతి, సభ్యత-రెండు కలవోసిన స్నేహశీలి కర్నాటి.

కర్నాటి జీవితచరిత్ర అంటే సుమారు 40 ఏళ్ళ నాటకరంగ చరిత్ర అన్నమాట. ఈ నాటకరంగం ఎన్నో ఒడుదుడుకులు ఎదుర్కొంటూ వచ్చింది. ఎందరో మహనీయులు అహోరాత్రాలు ఈ రంగంలో శ్రమించారు. అసలు తెలుగు నాటకరంగ చరిత్ర అప్పో ఏనాటిది! చరిత్ర పుటలు తిరగేస్తే 1860 నాటినుంచి వేళ్ళు పాదుకొన్నది రంగస్థలం. నాటి యక్షగానాలు, వీధి భాగోతాలు ఈ నాటకరంగానికి ఆది రూపాలు. మనం మరిచిపోయిన ప్రాచీన సంస్కృతికి ప్రతీకలయిన జానపద రూపాలను మళ్ళీ మన కళ్ళ ముందుంచి; పునరుజ్జీవింప చేస్తున్న కృషీవలుడు కర్నాటి అభినందనీయుడు కాదా? ఇంగ్లీషులో ఒక నానుడి వుంది. "Jack of all trades, Master of none" అని. మన కర్నాటి విషయానికొస్తే, ఆ నానుడిని తిరగేసి చెప్పుకోవాలి. అంటే ఈయన 'Master of all theatre forms' అని. ఈమాట కేవలం నేను మాత్రం అంటున్నదికాదు. చాట్ల శ్రీరాములు. వంటి సుప్రసిద్ధ రంగస్థల దర్శకులు ఇచ్చిన కితాబు ఇది. శ్రీకర్నాటి గొల్లసుద్దులు చెప్పినా, జముకుల కధచెప్పినా, వీధిభాగోతం ఆడినా. చెక్కభజనలు చేసినా, కోలాటం వేసినా-ఇదీమన సంస్కృతి అని ఆంధ్రుడు సగర్వంగా చెప్పుకొనగలిగేలా ఉత్తేజపరుస్తాడు. నాజర్‌దళంతో కలిసి కర్నాటి ఇచ్చిన బుర్రకథ ప్రదర్శనలు ఆనాడు పల్లెపల్లెలో తెలుగుజాతిని ఉర్రూతలూగించాయి.

నాటకరంగంలో లబ్ధప్రతిష్ఠుడైన కర్నాటి నటనా కౌశలాన్ని గురించి నాటకరంగంతో పరిచయం వున్నవారందరికి తెలుసు. ఈనాటి అమెచ్యూర్ నాటక రంగాన్ని గురించిన ప్రస్తావన వచ్చినప్పుడు ముగ్గురు మహనీయులు మన స్ఫురణకు రాకుండా వుండరు. 1944-45 ప్రాంతాల్లో శ్రీ కె. వి. గోపాలస్వామి గారు ఆంధ్రవిశ్వవిద్యాలయంలో నాటకోత్సవాలు- నాటక

పోటీలు ప్రారంభించి విద్యార్థులకు నాటక కళపట్ల అభిరుచి పెంపొందింప చేశారు. అలాగే శ్రీ ఎమ్. ఆర్ అప్పారావు గారి ఆధ్వర్యంలో ఆంధ్ర నాటక పరిషత్ అమెచ్యూర్ నాటక కళాకారుల వెన్నుదట్టి ప్రోత్సహించింది. వీరి కృషి ఒక ఎత్తు- కాగా స్వర్గీయ డాక్టర్ గరికపాటి రాజారావు స్థాపించిన ప్రజా నాట్యమండలి కృషి మరొక ఎత్తు. ఇదిగో, ఈ ప్రజానాట్యమండలి ఆధ్వర్యంలో, డాక్టర్ రాజారావు శిక్షణలో తర్ఫీదు పొందిన వాడు మన కర్నాటి. ముందడుగు నాటకంలో కర్నాటి నటనను చూసిన డాక్టర్ రాజారావు ప్రజానాట్యమండలిలో చేర్చుకోవడంతో ఆయన నటకౌశలం మరింతగా వికసించి దశదిశలా ఖ్యాతిని వెదజల్లే అవకాశం కలిగింది. 'మాభూమి' నాటకంలో రాముడుగా కర్నాటి నటనను కోడూరు అచ్చయ్య మెచ్చి వెన్నుతట్టి శిష్యుడుగా స్వీకరించి ఆయన నటనకు మరింతగా మెరుగులు దిద్దారు. తనకు నటునిగా సంఘంలో లభించిన గుర్తింపు, కీర్తికి కారకులు తమ గురుదేవులేనని శ్రీ కర్నాటి తరచూ తన ప్రసంగాలలో చెప్పడం, ఆయన వినమ్రతకు తార్కాణం. వెలిదండ్ల హనుమంతరాయ గ్రంథాలయం సాంస్కృతిక విభాగంగా ఏర్పడిన ఆంధ్ర ఆర్ట్ థియేటర్ (దీని స్థాపకులు శ్రీ కృత్తివెంట కుటుంబరావుగారు) నటునిగా శ్రీ కర్నాటి నాటకరంగానికి చేసిన సేవ మరువలేనిది. కాగా ఇప్పుడు ఆంధ్రనాటక కళాసమితి ప్రధాన కార్యదర్శిగా ఎందరో నటీనటులకు ప్రోత్సాహమిస్తున్న శ్రీ కర్నాటి ఒక వ్యక్తి కాదు, ఒకవ్యవస్థ అని చెప్పుకుంటే అది అతిశయోక్తి కిందకు రాదు. ఈవిశిష్టవ్యక్తిని గౌరవించటము కళామతల్లిని గౌరవించుకోవటమే!

(ప్రజానటుడు శ్రీ కర్నాటిని నాగభైరువారిపాలెంలో కాకతీయ కళా పరిషత్ వారు 29-1-90 న నాటక కృషీవలుడు బిరుదు ఇచ్చి విశిష్టవ్యక్తిగా సన్మానించిన సందర్భంగా చేసిన ప్రసంగవ్యాసం.)

ఒక్కొక్క కళలో ఒక్కొక్కరు రాణకెక్కితే, అన్నికళలు ఒక్కరిలోనే పుంజీభవించి పురివిప్పి వినుతికెక్కడం అరుదైన విషయం. అటువంటి అరుదైన కళాకారులలో శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్య గారొకరు.

వీరు కృష్ణాజిల్లా తునికిపాడు గ్రామంలో ఒక రైతుకుటుంబంలో జన్మించారు. శ్రీమతి రాజమ్మ శ్రీ వెంకయ్య వీరి జననీ జనకులు. ఉర్దూ ఆంగ్ల భాషల్లో మంచి ప్రవేశం ఉన్న వీరు మెట్రిక్‌తోనే చదువు ఆపేసి ఒక ఏడాదిపాటు బడిపంతులు ఉద్యోగం చేశారు.

కానీ చిన్ననాటనే మనసులో దాగున్న కళాతృష్ణ వీరిని ఈనాడు సకల కళానిష్ణాతులుగా తీర్చిదిద్దింది. కోడూరు అచ్చయ్యవద్ద నటనలో శిక్షణ పొందిన వీరు ప్రజానాట్యమండలి వారి 'ముందడుగు' నాటకంలో నాయకపాత్రధారణతో వీరు నటజీవితం ఆరంభించారు. నాటి నుంచి నేటిదాకా శతాధిక నాటకాలు సహస్రాధిక ప్రదర్శనలిచ్చారు. బహుముఖీనమైన వీరి కళా ప్రతిభ చెక్కభజనలు, కోలాటం, వీధిభాగవతం, సుద్దులు, చిత్రవిచిత్ర వేషాల వంటి పలు జానపద కళారూపాలలో దర్శనమిస్తుంది.

వీరు నటులేకాదు చక్కటి ప్రయోక్తలు కూడా. నటుడిగా తెలుగు నాటక రంగంలోనే కాదు, తెలుగు చలనచిత్ర రంగంలో కూడా ఒక స్థానాన్ని గడించారు.

గొప్పగొప్పనటుల సరసన నటించి, పృథ్వీరాజ్‌కపూర్, శాంతారామ్‌వంటి మహామహుల మన్ననలు పొందిన వీరు 'ప్రజానటుడు' అనే బిరుదుతో పాటు పలు సత్కారాలు బడశారు.

స్వాతంత్ర్య సమరంలో పాల్గొని జైలుకు వెళ్ళివచ్చిన వీరు తెలంగాణా గ్రామాల్లో వయోజన పాఠశాలలు నిర్వహించి అనేక సాంస్కృతిక కార్యక్రమాల్లో పాల్గొన్నారు వీరు స్థాపించిన ఆంధ్ర నాటక కళాసమితి, జానపద కళాకేంద్రం, విజ్ఞానవేదిక వంటివి కళావికాసానికి దోహదం చేస్తున్నాయి. 1979లో సోవియట్ యూనియన్ సందర్శించిన వీరిని గూర్చి 'కళారంగంలో కర్నాటి, కళాతపస్వి కర్నాటి, కర్నాటి లక్ష్మీనరసయ్య జీవితం–నాటకరంగం' అనే పుస్తకాలు కూడా వెలుగులోకి వచ్చాయి.

1983 డిసెంబరు 7, 8 తేదీలలో రవీంద్రభారతిలో
**రాష్ట్రస్థాయి నాటికానాటకోత్సవాల సందర్భంగా**
**ప్రచురించిన బుక్‌లెట్ నుండి**

# కళాయశస్వి శ్రీ కర్నాటి

డా|| జి.వి. పూర్ణచంద్

గతం అనుమతి లేకుండా
వర్తమానానికి చోటెక్కడిది !
గతం ఆశీస్సు అందకుండా
భవిష్యత్తుకు భవిష్యత్తెక్కడిది !

వచ్చు కాలాన్ని మేలైనదిగా చేసే
గతానికి స్వాగతాన్ని పలికేచోట
గతం-భవిష్యత్తుల మధ్య వారధిపైన
నాలుగురోడ్ల కూడలిలో నిలబడి
పదం పాడుతూనే వున్నారు
పదండంటూనే వున్నారు

ఉద్యమాలను ఉరికంబం ఎక్కించిన
వర్తమాన చరిత్రను చూస్తూ

సర్వకాల సర్వావస్థలందూ
వెల్తురుని నడి వీధిలో నరికి పోగుపెట్టిన
వర్తమాన ఘనతని వీక్షిస్తూ
ఎప్పుడూ పరితపించే సమయంలోనో....

ఎవరికోసం ఎవరున్నా లేకపోయినా
అందరికోసం నేనున్నాననే ధీమాతోనో
ఆగి పోయిన గడియారాన్ని ఆడించాలంటున్నారు
మూగవోయిన గళాన్ని పలికించాలంటున్నారు

వీరికి ప్రత్యక్ష పరిచయమున్నట్టూ మహాప్రస్థానం చాలా భాగాలు కంఠస్థమన్నట్టూ.

చాలా గంభీరంగా శ్రీశ్రీ గేయాలు సమయోచితంగా ప్రస్తావిస్తూ తమ రష్యా పర్యటనను అనుసంధానిస్తూ చక్కని వాచకంతో లోతైన ఆలోచనతో నలభై అయిదు నిమిషాలు ఆలోచనాత్మకమైన ఉపన్యాసాన్ని చేశారు. ఒక్కసారి ప్రేక్షకులనూ శ్రీ కర్నాటిని చూచిన నా గుండె దిటవు వడ్డది. కరతాళధ్వనులమధ్య తన గంభీరోపన్యాసాన్ని ముగించి 'శర్మగారూ ఏమంటారు' అన్నట్టుగా నావైపు చూచారు. అందులో భావాల్ని ఇప్పటివరకూ గుణించుకొంటూనే ఉన్నాను.

అందుకే అంటాను మనస్ఫూర్తిగా "సాహతీనందనసుమ తేటి కళాస్రష్ట కర్నాటి" అని.

మరొకమాట—

ఆనాటి సభాధ్యక్షులు సన్మానాన్ని చమత్కరిస్తూ వడియాలశాలువ అన్నారు. మరుక్షణమే కర్నాటివారు లేచి ఏ కళాకారుడైనా భక్తి గలుగుకూడు పట్టెడైన చాలు అన్నభావంతో ఉండాలని, నేను ఆ విధంగానే స్వీకరిస్తానని రసభారతి వారి హృదయం కోట్లతోకూడ కొలవలేమని కరతాళధ్వనుల మధ్య వ్యక్తం చేశారు.

కర్నాటివారి సహృదయానికి మా కళాభివందనాలు. ఆడంబరాలకు దూరమైన ఇట్టి సహృదయులే సమాజానికి కరదీపికలు.

---

శ్రీ కర్నాటి జగమెరిగిన కళాకారుడు, స్నేహశీలి. జానపద కళారూపాలన్నింటిలో తనదంటూ ఓ ప్రత్యేక బాణీ సృష్టించుకున్న విశిష్ట కళాకారుడు శ్రీ లక్ష్మినరసయ్య.

—ఆంధ్రజ్యోతి (వారపత్రిక)




"పట్టిందార్ వేషంలో శ్రీ కర్నాటి

# పిట్టలదొర పాత్రలో కర్ణాటి

ప్రజా కళలు అనగానే ఒకనాటి బహురూపాలు స్ఫురణకు వస్తాయి. ఎందరో అజ్ఞాత కళాకారులు వివిధ రూపాలు ధరించి ప్రజలను నవ్వించి. కవ్వించి ఆనందాబ్ధిలో ఓలలాడించి చారిత్రక చీకటి కోణములో కనుమరుగైనారు. కాని, వారు సృష్టించిన అపూర్వ కళాస్వరూపాలు మాత్రం ప్రజా హృదయాలలో శాశ్వతమైన స్థానాన్ని సంపాదించుకున్నాయి అలాంటి బహురూపాలలో పిట్టలదొర, సాధువు, బుడబుక్కల, ఫకీరు వేషము, చెంచు, బైరాగి వేషము, పాముల వాని వేషం మొదలైనవి సామాన్య పౌరుల హృదయాలలో అమృతధారలు కురిపించిన రసనిష్యందనాలు.

ఈ బహురూపాలు ధరించేవారు పెద్దగా చదువుకోకపోయినా సమకాలీన సామాజిక. దుర్నీతిని, కాలుష్యాన్ని తమ సహజ హాస్య ధోరణిలో ప్రక్షాళన చేసేవారు. వినోదం. విజ్ఞానం పెనవేసుకున్న సామాజిక సందేశం ఇవ్వడంలో వారు కీలకమైన పాత్ర నిర్వహించారనడంలో సందేహం లేదు. అలాంటి బహురూపాలలో చెప్పుకోదగినది పిట్టలదొర! దానిని కూలంకషంగా పరిశీలించి మెరుగులుదిద్ది మరచిపోలేని విధంగా ఆధునికంగా శిల్పీకరించినవారు శ్రీకర్ణాటి ఈ విషయంలో వారికివారే సాటి.

నాటకరంగస్థలాన్ని ప్రజాఉద్యమంగా భాసింపచేసిన ప్రజా నాట్యమండలి తరపున 45 సంవత్సరాలకు పూర్వం కర్ణాటివారు ఈ పాత్రను ధరించి దానికి విశిష్ట వైవిధ్యాన్ని చేకూర్చారు. ఆయన ఆ పాత్రను అతి సమర్థంగా ఆవిష్కరించేవారు. ఆయన ప్రాసంగికంగా ఆ పాత్ర ద్వారా ఆనాటి ప్రపంచ యుద్ధ సంక్షోభాన్ని. వస్తువుల కొరతను, ఫాసిస్టు శక్తులవల్ల ఉత్పన్నమయ్యే ప్రమాదాన్ని ఎత్తిచూపేవారు.వారు తమ పదునైన సంభాషణలతో ప్రేక్షకులను ఉక్కిరి బిక్కిరి చేసేవారు. ఆ తరువాత మళ్ళీ శ్రీ కర్ణాటి చాలాకాలానికి ఆ

పాత్రను తెలుగు విశ్వవిద్యాలయంవారు ఏర్పాటుచేసిన అభినయోత్సవంలో ప్రదర్శించి పలువురి మన్ననలను పొందారు.

ఈ నెల 7వ తేదీన లైన్స్‌క్లబ్ ఆఫ్ విజయవాడ వారి ఆధ్వర్యంలో శ్రీ కర్ణాటి వారు పిట్టలదొర వేషం ప్రదర్శించారు. ఖాకీప్యాంటును కాళ్ళపైకి మడిచి, చిరిగిన ఖాకీ షర్టు, పాతకోటు వేసుకుని, తలపై టోపి, చేతిలో కట్టెతుపాకి, మెడలో రుమాలుతో ప్రత్యక్షమయ్యేసరికి అందరూ ఆశ్చర్యపోయారు. 60 సంవత్సరాల ఆసామి 25 ఏళ్ళ దొరగా ఎలా మారిపోయాడా అని, తన సహజ చతురోక్తులతో ప్రేక్షకులను మంత్రముగ్ధులను గావించారు. భ్రమకు, వాస్తవానికి మధ్య ప్రేక్షకులను పల్టీకొట్టించి ఎన్నో విషయాలతో శాఖాచంక్రమణం చేసి మళ్ళీ అసలు విషయం దగ్గర స్థిరపడగలిగిన ఆయన సామర్ధ్యం అనితర సాధ్యం.

శ్రీ కర్ణాటి, తన పిట్టలదొర వేషాన్ని పలు పట్టణాలలో ప్రఖ్యాతిచెందిన సభా వేదికలపై అభినయించి ప్రేక్షకులకు ఆనందాన్ని కలిగించారు ఒక గొప్ప ప్రాచీన కళా స్వరూపానికి మెరుగులు దిద్దుతున్నామన్న ఆయన ఆత్మవిశ్వాసం హర్షించదగింది. వారు ప్రదర్శించే సమయస్ఫూర్తి, సమకాలీన సామాజిక చైతన్యం మేధావులను సయితం ఆకర్షించింది. ఈ పాత్ర తాలూకు లోతులను పరిశీలించి దానిని తన నట జీవితానికి నికషోపలం చేయాలనుకున్నవారి ఆదర్శాన్ని గురించి విన్న చాలామంది ఆనందించారు. నూత్నప్రయోగానికి ఎల్లప్పుడు ఆసక్తి చూపే శ్రీ కర్ణాటివారి రంగస్థల జీవితంలో ఈ పాత్ర కలికితురాయి.

ఆంధ్రజ్యోతి సౌజన్యంతో అక్టోబర్ 13, 1988

---

కొందరు జీవితంలో నటిస్తారు. మరికొందరు నటనలో జీవిస్తారు. లక్ష్మినరసయ్య నటనలో జీవించిన కళాకారుడు.

శ్రీ రెంటాల

# జగమెరిగిన నటుడు

—పోలవరపు ప్రకాశరావు

ప్రధాన కార్యదర్శి : ఆంధ్రనాటక కళాపరిషత్

మాట ఒకటి చాలు మనసు పరిమళింప
మంచితనమె వారి మాతృభాష

(నండూరి)

గుండె నిండా మంచితనం నింపుకున్న
సహృదయుడు కర్నాటి.
ఆయన వాక్కు మృదులం.
మనస్సు కోమలం.
సంకల్పం సుదృఢం.
దక్షత అనితర సాధ్యం
ఇన్ని విశేషాలు కలపోసిన కర్నాటి ఒక వ్యక్తిగాదు. నాటక, జానపద కళోద్ధరణకు కంకణబద్ధుడైన ఒక వ్యవస్థ.
జగమెరిగిన నటుడు!

ఆంధ్రనాటక కళాపరిషత్ కార్యవర్గ సభ్యుడు. శ్రీ కర్నాటి బుర్రకథలు చెప్పేనాటి నుంచీ పరిచయం. తనను గురించి ఎవరు విమర్శించినా సీరియస్‌గా తీసుకోరు. అది ఆయనలోని గొప్పతనం, ఎవరినీ నొప్పించని స్వభావం నవ్వు, నవ్వించు అన్నది ఆయన మతం, సుషుప్తి నుంచి జనావళిని జాగృతం చేయడం ఆయన ధ్యేయం. తన పనేదో తాను చూసుకొనే స్వభావం ఆయనది. ఇన్నేళ్ళుగా నాటక సమాజాన్ని. ప్రేక్షక సంఘాన్ని నిర్వహిస్తున్నా ఎన్నడూ వివాదాలకు పోలేదు వర్గవైషమ్యాలను చొరనీయలేదు. ఇతరులను విమర్శించే అలవాటుకు ఆయన చాలా దూరం.

ఆంధ్రనాటక కళాపరిషత్ ద్వారా ఆయనతో దాదాపు 43 సంవత్సరాల అనుబంధం.

కర్నాటి వారి నటనను గురించిన కొన్ని ముచ్చట్లు!

ఈ ప్రజానటుడికి ఖ్యాతి తెచ్చినవి, మాభూమి, గాలిమేడలు, ప్రగతి, ఆసామి నాటకాలు. "మాభూమి" విజయవాడ పరిషత్‌కు, "ప్రగతి" కాకినాడ

పరిషత్‌కు వెళ్ళాయి. "గాలిమేడలు" తెనాలి పరిషత్‌లో ప్రదర్శించారు. "ఆసామి" బందరు పరిషత్‌లో ఆడారు. "నేరము-శిక్ష" హైదరాబాద్ పరిషత్‌లో ఆడారు. "గాలిమేడలు" నాటకంలో కర్నాటివారు పోషించినవి మూడుపాత్రలు—ఆంజనేయులు, సీతారామయ్య, హోటల్ ప్రొప్రయిటర్. ఆ నాటకం చూశాక అనిపించిందేమంటే? రచయిత అనిశెట్టిగారు కర్నాటిని దృష్టిలో పెట్టుకొని ఈ పాత్రలను సృష్టించారా, అని! అలా కాని పక్షంలో బహుశా అనిశెట్టిగారు తన కోసమే ఈ పాత్రలను సృష్టించారని కర్నాటి భావించి ఆ పాత్రల్లో లీనమై నటించి ఉండవచ్చు. అంతటి అనుభూతి కలుగుతుంది ప్రేక్షకులకు. ఇది అతిశయోక్తి కాదు. ముఖస్తుతి అంతకన్నా కాదు.

అలాగే ఆత్రేయ నాటకం "ప్రగతి"లో పిచ్చివాని వేషంలో కర్నాటి అభినయం చూస్తుంటే వీరికి సాటిలేరని అనిపిస్తుంది. ఎంతోమంది పిచ్చివాని వేషాలు వేశారు. వారంతా నటించారు. కర్నాటివేషం చూస్తే నిజంగా పిచ్చివాడే స్టేజిపైకి వచ్చాడా! లేక కర్నాటికే పిచ్చెక్కిందా! అన్న భ్రమ కలుగుతుంది. అంతటి పరిణతి చెందిన నటన ఆయనది!

నాజర్ వ్రాసిన "ఆసామీ" నాటకంలోని "శ్రీరంగం" కర్నాటికి పేరు తెచ్చిన మరొకపాత్ర. కర్నాటి రైతుబిడ్డ. రైతు జీవితం ఆకళింపు చేసుకున్న వ్యక్తి. కనుక భూస్వాముల కింద రైతులు పడే బాధలు ఆయనకు కరతలామలకం. అందుకే భూస్వామి దగ్గర గుమాస్తాగా వుండి, రైతులను పీడించుకుతినే శ్రీరంగం పాత్రలో ఆయన జీవించాడు. విజయవాడ ప్రజా నాట్యమండలి బందరు పరిషత్‌లో ప్రదర్శించిన నాటకం ఉత్తమ బహుమతి పొందింది.

కర్నాటి వ్యక్తిత్వాన్ని గురించి ఒక్కమాట.

ఎంతటి మహాత్కార్యాన్నయినా తలపెడితే పూర్తి అయ్యేవరకు విశ్రమించని ఏకాగ్రత, పట్టుదల ఆయనలో వున్నాయి.

"ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాససంత్రస్తులై
యారంభించి పరిత్యజింతురు విఘ్నాయత్తులై మధ్యముల్
ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్."

(భర్తృహరి)

కర్నాటి ప్రజ్ఞానిధి. కనకనే విఘ్నాల్ని లెక్కచేయకుండా చేపట్టిన కార్యం సాఫల్యం చేస్తాడు.

ఆయన ధీశాలి, దీక్షాబద్ధుడు!

కనకనే తాను స్థాపించిన ఆంధ్రనాటక కళాసమితిని నిర్విఘ్నంగా నడుపుకొస్తున్నాడు.

"తనిసిరే వేల్పులుదధి రత్నములచేత
వెఱచిరే ఘోరకాకోల విషముచేత
విడిచిరే యత్నమమృతంబు వొడముదనుక
నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు."

(భర్తృహరి)

---

'ఎవరు ద్రోహి' నాటికలో ఎం.యల్.ఏ.గా నటిస్తున్న శ్రీ లక్ష్మీనరసయ్య నటన ప్రతిభకది ఒకమకుటాయమానమైనపాత్రగా పేరూపొందిందని చెప్పవచ్చు.

జనశక్తి

# సుమధుర లహరిలో
# పసిడి కళలు ఉరకలెత్తాలి

—పి. ఎస్. రావు.

తెలుగు నాట జానపద కళాసంపద పునరుద్ధరణకు, వ్యాప్తికీ నడుంకట్టిన జానపద కళాకేంద్రం (విజయవాడ) కృషిని అభినందించాలి. జానపద కళలలో దిట్ట అయిన శ్రీ కర్నాటి లక్ష్మీ నరసయ్య నేతృత్వంలో కళా కేంద్రం పగటి వేషాల శిక్షణా శిబిరం నిర్వహించి, ఆ కళా వైవిధ్య విస్తరణకు తోడ్పడుతోంది. అందుకే స్వచ్ఛమైన జానపద కళా రూపాల సిసలైన జిలుగు సొగసును, జిగిబిగిని అందించాలనే సంకల్పంతో బుర్రకథ, చెక్కభజన మొదలైన ప్రక్రియల్లో నిష్ణాతులైన కళా కారులను ఒకచోట చేర్చి వారితో సభలు చేయించి ప్రదర్శనలు ఇప్పించడం....! ఔత్సాహిక కళాకారులకు గురుకుల పద్ధతిలో ఈ జానపద కళారూపాల్లో పరిణతి చెందిన ప్రముఖులతో శిక్షణ ఇప్పించడం, తత్సంబంధిత పరిశోధనా పత్ర ముద్రణ అనే త్రివిధ లక్ష్యంతో కళాకేంద్రం పనిచేస్తోంది. శిక్షణా శిబిరం ముగింపు ఉత్సవం సందర్భంగా విజయవాడ హనుమంతరాయ గ్రంథాలయంలో నవంబర్ 23వ తేదీన పన్నెండు పగటి వేషాల ప్రక్రియలను పసందుగా ప్రదర్శించాడు. పాల్గొన్న ఔత్సాహికులు అంతగా విద్యాగంధం లేని బడుగు వర్గాల వారైనా, తమలో నిక్షిప్తమై ఉన్న కళాభినివేశాన్ని వ్యక్తం చేశారు. అందుకు ప్రయోక్త లక్ష్మీనరసయ్య అభినందనీయులు. పిట్టలదొర, జోగి, కాశీకావడి అనే అంశాలు హాస్యంతో, వ్యంగ్యంతో కూడి తొణికిసలాడాయి.

నగర వాసులకు ఈ జానపద కళారూపాలు జీవంతో ఉట్టిపడే సంపదగా పరిచయంచేసి, వారిలో ఆసక్తి కలిగించి, తద్వారా వీటి ప్రాచుర్యానికి తోడ్పడే మహదాశయంతో వ్యవహరిస్తున్న జానపద కళా కేంద్రానికి అందరి అండదండలు ఎంతో అవసరం.

—ఉదయం, డిసెంబర్ 3, 1986

# మనం మరచిపోతున్న తెలుగు కళారూపాలు

సుమారు రెండు, మూడు వేల సంవత్సరాల నుండి తెలుగుజాతికి పారంపర్యంగా సంక్రమించిన ఈ జానపద కళాసంపదను పరిరక్షించుకోవలసిన బాధ్యత మనపై ఉంది. వీటి పునరుద్ధరణ, పునర్వికాసాలకు దోహదంచేయాలన్న సత్సంకల్పంతో విజయవాడలో రెండు రోజులపాటు జానపద కళా రూపాల ప్రదర్శన జరిగింది.

ప్రతిపనికీ ఒకపాట వుంటుంది. మేలుకొలుపులు, బుడబుక్కలవాండ్రు, గొబ్బిళ్ళు, తుమ్మెదపాటలు, హరిదాసులు, జంతరపెట్టె, పంబకథ, తంబురకథ, పిచ్చుగుంట్లు, జముకుల కథ, బుర్రకథ, రుంజలు, దప్పులు, వీరనాట్యం, చెంచు నాటకం, పగటి వేషాలు, గరగ నృత్యాలు, లాలిపాటలు, జోలపాటలు —ఇలా ఎన్నెన్నో!

రాష్ట్రం నలుమూలల నుండీ దాదాపు 100 మందికి పైగా జానపద కళాకారులు వివిధ వాయిద్య సమ్మేళనంతో ఈ ప్రదర్శనలలో పాల్గొని ప్రేక్షకులను, శ్రోతలను అలరించారు. కళాకారుల్లో చాలామంది ఇంతకుముందే లబ్ధ ప్రతిష్టులు. పలుచోట్ల ప్రదర్శనలు ఇచ్చి కళాభిమానుల మన్నన లందుకున్నవారు. పల్లెప్రజల దినచర్య యావత్తూ ఈ కళా రూపాల్లో ప్రతి బింబమైంది. శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్య పాడిన పొలం పనుల పాటలు ప్రత్యేకంగా పేర్కొని ప్రశంసించదగినవి.

ప్రయోక్త వ్యాఖ్యాత అయిన శ్రీ కర్నాటి లక్ష్మీ నరసయ్య తొలుత ఈ జానపద కళారూపాల పుట్టు పూర్వోత్తరాలను గురించి, చక్కగా వివరించారు. ప్రతి ఐటమ్‌కూ ఆయన తన గంభీర కంఠస్వరంతో చేసిన వ్యాఖ్యానం, విశ్లేషణాత్మకంగా, హృద్యంగా ఉండి, ప్రదర్శనలకు ప్రాణం పోసింది.

ఆంధ్రప్రభ సౌజన్యంతో, జూలై 10, 1986.

# రేడియో నటుడు కర్నాటి

—పాండురంగ

ఒక ఆదివారం మధ్యాహ్నం మూడు గంటలకు విజయవాడ రేడియో కేంద్రం నుండి ఒక నాటకం ప్రసారమవుతోంది. ఆ నాటకం వింటున్నంతసేపు ఆసక్తికరంగా వుంది. అయితే ఆ నాటకంలోని ఒక మోతుబరి రైతుపాత్ర అందరిలోనూ కొట్టొచ్చినట్లుగా, ప్రస్ఫుటంగా వుంది. ఆ పాత్రధారి ఇతర పాత్రధారుల్ని మించి పాత్రోచితంగా తన సంభాషణల ద్వారా తన పాత్రని మెప్పిస్తున్నారు. ఈ పాత్రధారి ఎవరా అని ఉత్సుకత పెరిగింది. నాటకం చివర ప్రకటించిన నటీనటుల వివరాలు అతి జాగ్రత్తగా విన్నాను. ఈ మోతుబరి రైతు పాత్రని నిర్వహించింది. శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్య గారని తెలిసింది. అప్పుడు నా మనస్సు తృప్తిగా వుంది. ఎందుకంటే, ఎటువంటి పాత్రనైనా అవలీలగా విజయవంతం చేసే నేర్పు ఆయన దగ్గరుంది.

రంగస్థల కళాకారుడిగా, జానపద కళా ప్రయోక్తగా అందరికీ మంచి మిత్రుడిగా మెలిగే లక్ష్మీనరసయ్యగారు, ఒక ఉన్నతశ్రేణి రేడియో కళాకారుడని కొంతమందికే తెలుసు. దాదాపు విజయవాడ కేంద్రం స్థాపించిన దగ్గర్నుంచి ఈ నాటి వరకు కొన్ని వందల రేడియో నాటకాల్లో పాల్గొని శ్రోతల హృదయాల్లో సుస్థిరస్థానం సంపాదించుకున్నారు.

"రేడియో నాటకాలలో పాల్గొనటం ద్వారా నేను అనేక అనుభవాలను ప్రోది చేసుకున్నాను. డైలాగులు చెప్పడంలో ఒక్క గొంతు ద్వారానే హావభావాలు పలికించడం కష్టసాధ్యమే అయినా, పేరు పొందిన ఎంతో మంది కళాకారుల సరసన నటించి, అవతల వారి సంభాషణలలోని ఆరోహ, అవరోహణలని గమనిస్తూ నా పాత్ర విజయవంతం అయ్యేటట్లు కృషి చేసేవాడ్ని. ఈ కష్టమైన శ్రవ్య నాటక ప్రక్రియ నాకు అందుబాటులో వుండడం నాకు సంతోషాన్ని కలిగిస్తుంది" అంటారు తమ సహజ ధోరణిలో.

రేడియోలో సాంఘిక, పౌరాణిక, చారిత్రాత్మక నాటకాల్లో ఎన్నో వైవిధ్యములయిన పాత్రల్ని నిర్వహించారు. "కర్ణ"లో కర్ణునిగా, "అభిమన్యు"లో సైంధవుడిగా అద్భుతంగా నటించారు. అలాగే "ప్రతిమ"లో రావణుడిగా, "గయోపాఖ్యానం"లో బలరాముడిగా, "బొబ్బిలియుద్ధం"లో ధర్మారాయుడు, "పల్నాటియుద్ధం"లో నరసింగరావు, "అల్లూరి సీతారామరాజు"లో ఒక ముఖ్య పాత్ర ప్రభావతీ ప్రద్యుమ్నం"లో రాక్షసరాజుగా "పంచతంత్రం"లో ద్రోణునిగా ఆయన చక్కటి నటనని వినిపించారు.

ఇక సాంఘిక నాటకాలకి వస్తే కర్నాటి వారి ప్రతిభ "తుఫాను"నాటికలో రాఘవరెడ్డి పాత్ర, "ప్రగతి" "చిన్నపరెడ్డి" "హిమబిందు" నాటకాలలోని పాత్రలు మర్చిపోలేనివి. ఆయన పాత్రలకనుగుణంగా డైలాగులు చెప్పే సరళి అందరిని ఆకట్టుకుంటుంది. ఎటువంటి పాత్రనైనా ఆకళింపు చేసుకుని చక్కటి క్రమశిక్షణలో పాత్రకి న్యాయంజేసే నేర్పరితనం ఆయన దగ్గర వుంది. అలాగే, రేడియోలో నటించేటప్పుడు, రంగస్థలంమీద నటించేటప్పుడు పాటించవలసిన తేడాలు ఆయనకు వెన్నతో బెట్టిన విద్య.

"శ్రవ్యనాటకానికి, రంగస్థల నాటకానికి ఎంతో తేడా వుంది. ఈ కాలం నటీనటులకి ఈ తేడామీద శ్రద్ధలేదు. మా కాలంలో ఒక క్రమశిక్షణతో నడిచేవాళ్ళం. మా సరసన నటించే నటీనటుల్ని నిశితంగా పరిశీలించేవాడిని. చిన్నకోట రామన్నపంతులు, రామచంద్ర కాశ్యప, పీసపాటి, ధూళిపాళ, బందా మొదలైన హేమాహేమీల సరసన నటించడం నాకెంతో సంతోషాన్ని కలిగించింది. ఇంతేకాకుండా, Dr.గరికపాటి రాజారావుగారితో సన్నిహితత్వం నాటకరంగంలో నిలబడ్డానికి అవకాశమిచ్చింది. అన్నారు సంతృప్తిగా.

ఆకాశవాణివారు 'ఏడిద' గ్రామంలో నిర్వహించిన ఆరుబయలు రంగస్థల కార్యక్రమంలో 'దోపిడి' నాటికలో మధ్యతరగతి రైతుపాత్ర అత్యంత సహజ సుందరంగా నటించి రసిక ప్రేక్షకులను, శ్రోతలను అలరించారు.

విజయవాడ కళాక్షేత్రంలోనూ ఆకాశవాణి నిర్వహించిన ప్రత్యేక కార్యక్రమం 'రంగవల్లరి'లో వివిధ ప్రదర్శనలను పరిచయంచేసే 'సూత్రధారుని' పాత్రలో శ్రీ కర్నాటి అద్భుతంగా రాణించారు. కొంతేరు

గ్రామంలో ఆహూతుల సమక్షంలో నిర్వహించిన కదంబ కార్యక్రమంలో "పిట్టలదొర" (బహురూప కళాప్రక్రియల్లో ఒక అంశం) పాత్ర ధరించి తమ ప్రతిభతో ఆహూతులను మెప్పించారు.

కర్నాటివారు నటించిన రేడియో నాటకాల సంఖ్య, వారు నిర్వహించిన వివిధ పాత్రల గురించి రాసుకుంటూ పోతూంటే, ఒక గ్రంధమవుతుంది. ఇటీవలే ప్రసారమయిన "జాతర" నాటకంలోని వారి పాత్ర మరపురానిది. అటువంటి మోతుబరి రైతు పాత్రలకి ఆయనకి మించిన నటుడు లేడంటే అతిశయోక్తికాదు.

రేడియో నటుడిగా కర్నాటివారి ప్రతిభ యిది అయితే, వారు నాటక రంగానికి చేసిన, చేస్తున్న సేవ ఎంతో కొనియాడదగింది. నాటకరంగాన్ని నమ్ముకుని జీవిస్తున్న అరుదైన మహానుభావుల్లో ఆయన ఒకరు. ఆయన సహనశీలి, దీక్షాపరుడు. ఏదయినా ఒక కార్యక్రమాన్ని పూర్తిచేయాలంటె, ఆ పని పూర్తయ్యేవరకు విశ్రాంతి తీసుకోరు. మరి ఈనాటి కాలంలో అలా క్రమశిక్షణతో, నమ్రతతో, మంచితనంతో, చిరునవ్వుతో, కలుపుగోలుతనంతో నాటకరంగం కోసం కృషి చేసేవాళ్ళు అరుదు, ఆయన ఏ పనినీ వాయిదా వెయ్యరు,

అందుకే! కర్నాటివారు మర్నాటివారు కాదు. ఈనాటివారు. *

---

లక్ష్మీనరసయ్యగారిలో చైతన్యం వుంది. అంతేకాదు. ప్రజలక చైతన్యాన్ని కలిగించే శక్తి వుంది.

—వింజమూరి శివరామారా



"అల్లూరి సీతారామరాజు" నాటకంలో
హైటరుగా శ్రీ కర్నాటి




అనిశెట్టి "మా వూరు" నాటకంలో
మహంకాళి పాత్రధారిగా శ్రీకర్నాటి

# నాకు తెలిసిన లక్ష్మీనరసయ్యగారు

— నటనాచార్య చింతా కబీర్‌దాసు

నాటకంలో తాను ధరించిన పాత్రను సంపూర్ణ పతాకస్థాయికి చేర్చి పండించేవరకూ పంతంవీడని నటులు లక్ష్మీనరసయ్యగారు. జీవితంలో పట్టుకొన్న పనిని పూర్తి పరాకాష్టకు చేర్చువరకూ పట్టువదలని లక్ష్మీనరసయ్యగారు. సత్‌సంకల్పం, ఏకాగ్రత, పట్టుదల, ఈ త్రిసుగుణాల సంపద లక్ష్మీనరసయ్యగారి సొత్తు. ఈ సూత్రం అటు నటజీవితంలోనూ ఇటు నిజజీవితంలోనూ బాగా ప్రయోగించుకుంటారు. అన్ని కోణాలనుండి ఉన్నత శిఖరాలకు ఎగబ్రాకుతారు. అంటే ఎలాంటి పరిస్థితులనైనా తనకు అనుగుణంగా మల్చుకొని ఆ స్థితిని ఆనందమయం చేసికొనగల ధీరోదాత్తులు శ్రీకర్నాటి.

చైర్మన్ నాటకంలో స్వాములవారి పాత్రలో లక్ష్మీనరసయ్యగారి నటనావిశేషాలను విశ్లేషించి నా మనోరంగస్థలంపై చిత్రించుకొని నా మనోనేత్రాలతో తిలకిస్తే!!

అది 1962వ సం॥, ఆరోజు ప్రదర్శన నాటకం "చైర్మన్". రచన- కొడాలి గోపాలరావు, రంగస్థలం- వెలిదండ్ల హనుమంతరాయ గ్రంథాలయ నాటకశాల విజయవాడ. విభిన్న పాత్రలలో హాస్యబ్రహ్మలు కీర్తిశేషులు శ్రీ చదలవాడ కుటుంబరావు, శ్రీ నల్ల రామమూర్తి, A.I.Rలో వున్న A.B. ఆనంద్‌గారి కాంబినేషన్‌తో ఒకప్రత్యేక తరహాపాత్రలో స్వాములవారిగా దర్శనమిచ్చారు. శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్యగారు, క్రిక్కిరిసిన ప్రేక్షకుల కోలాహలంమధ్య నాటక శుభారంభం జరిగింది. కొద్దిక్షణాలకే నిశ్శబ్ద వాతావరణం అలముకుంది హాలులో. ఆ క్షణాల ప్రత్యేకత ఏమంటే స్వాములవారిపాత్ర ప్రవేశం. రాజగురువులు ధరించే పట్టుకాషాయాంబరాలు ధరించి సహజ అలంకరణలతో పాత్రోచితమైన ఒడ్డూ పొడవుతో విరాజిల్లుతోంది. సహజ ఆంగికాభినయములతో చూడముచ్చటగా వుంది ఆ పాత్ర. శ్రవణానందకరమైన కంచుకంఠం వినిపించింది ఆపాత్ర. (High frequency voice with metallic sound). నాటకారంభం నుండి నాటకాంతంవరకు, పాత్ర ప్రవేశ క్షణాలనుండి పాత్ర నిష్క్రమణ క్షణాల వరకూ లక్ష్మీనరసయ్యగారు స్వాములవారిపాత్రను సహజంగా సజీవంగా

నిలబెట్టగల్గారు. రంగస్థలం మీద, ఈ స్థితిని Sustained characterisation అంటారు పాశ్చాత్యులు. ప్రేక్షకుల చూపుల్ని తదేకదృష్టితో తనవేపు మళ్ళింపచేసికోగల్గారు. ప్రేక్షకుల అనుభూతుల్ని వీరి అనుభూతితో మేళవింపచేసుకోగల్గారు. అస్తిత్వాన్ని అనుభూతినీ అందించగల, ఆస్వాదించగల, అనుభవించగల, బహుకొద్దిపాటి నాటక కళాకారులలో శ్రీకర్నాటి లక్ష్మీనరసయ్యగారు ఒకరు అని ఆనాటి ప్రదర్శన రుజువు చేసింది. నాట్యవేదంలో చెప్పబడిన సిద్ధహస్తుల లక్షణం ఈ విధంగా వుంది.

> "సహృదయుల హృదయ సంవాదము పొందిన రసోద్భవ భావము సర్వము శరీరమంతట ప్రసరించును-శుష్కమైన కాష్ఠమున అగ్ని వ్యాపించిన విధమునభావము శరీరధాతువు లందంతట ప్రసరించును"

ఈనాడు మరుగునపడుతున్న, ఆదరణ కోల్పోతున్న జానపద కళల సముద్ధారకుడిగ లక్ష్మీనరసయ్యగారు ఆ కళల పునరుద్ధరణకు ఆ కళాకారులను వెలుగులోకి తీసికొచ్చి ఆదరించటానికి తనవంతుగా అంతో యింతో చేయూత లోగడ యిచ్చారు. యిప్పుడు యిస్తున్నారు. మునుముందు యిస్తారని ఆశించవచ్చును. ప్రభుత్వపరంగా విజయవాడలో జరిగిన జానపద కళా సమ్మేళనాలు ఏర్పాటు చేయడంలో ప్రధానపాత్రవహించారు శ్రీ కర్నాటి. ఈనాటి యువతరంలో ఆ కళల విశిష్టత మచ్చుకైనా తెలియని వారెందరో లోగడ జరిగిన ఒక జానపద కళా సమ్మేళనం చూడ్డం జరిగింది. వారిలో కొందరు "ఈ రకం కళలు మేం ఎరుగం, ఈచిత్రవిచిత్ర వేషాలు యింతవరకూ చూడలేదు. ఈ వింతలు మాకు తెలియవు, అద్భుతం', మహాద్భుతం!!, ఆహా! ఓహో!!" అంటూ మెచ్చుకోళ్ళతో అబ్బురపడిపోయి తబ్బిబ్బయిపోయినవారిని ప్రత్యక్షంగా నేను చూశాను. నేనుకూడా అలాటి అనుభూతినే పొందాను.

ఇటీవల విజయవాడ రోటరీక్లబ్‌వారు శ్రీ కర్నాటిని సత్కరించిన సందర్భంలో ఆయన ఓ ప్రసంగం చేశారు రెండు గంటలసేపు. ప్రతిభాశాలిగదా! అనాడు అది ప్రసంగం అనిపించుకోలేదు అంటే ఆశ్చర్యమే! పదిమంది పాల్గొన్న ఏకపాత్రాభినయముల పోటీ అని భ్రమ కల్పించింది.

బుర్రకధకధకుడిగా, జముకులకధ కధకుడిగా, ఒగ్గుకథ కథకుడిగా,

పిట్టలదొరగా, కోతలరాయుడిగా, బుడబుక్కలవాడిగా, జంగందేవరగా, గంగిరెద్దులవాడిగా, జంతర్ మంతరవాడిగా, తదను గుణమైన ధ్వని అనుకరణలతో శ్రీకర్నాటి మాటల రూపంలో మచ్చుకు పలికిన పలుకులు పండితపామరులను రంజింపచేశాయి. అది ఆయన ప్రతిభకు ఓ చిన్న తార్కాణం మాత్రమే! అలాంటి తియ్యటి అభిరుచులే వారి నటజీవితాన్ని జానపదకళలతో అనుసంధానింపచేయడానికి దోహదపడ్డాయని నా అభిప్రాయం.

లక్ష్మీనరసయ్యగారు పిల్లల్లో పిల్లవాడు. యువకుల్లో యువకుడు, పెద్దల్లో పెద్దవాడు, విద్యావేత్తల్లో విద్యావేత్త, పామరుల్లో పామరుడు, కార్మికులలో కార్మికుడు, రైతుల్లో రైతు, కూలీలల్లో కూలి, రాజకీయవేత్తల్లో రాజకీయవాది. "జగమెరిగిన బ్రాహ్మణుడు" సామెత ఈయనకు బాగా వర్తిస్తుంది. ఆయన ఎక్కువ సమయాన్ని యువకులు తనకన్నా చిన్నవయస్కుల వారిమధ్య గడపటానికి యిష్టపడతారు.గౌరవిస్తారు. తృప్తి చెందుతారు.ఆ విధంగా ఆయన ఆయుః ప్రమాణాన్ని పెంచుకుంటారు. ఆ తృప్తే ఆయనకు ఒక గొప్పటానిక్‌లా పనిచేస్తుందేమో!

ఆయన ఈర్ష్య, ద్వేషం, క్రోధం అసూయలను మనస్సుకు పట్టనీయరు. అందుకే షష్టిపూర్తి చేసికొన్నప్పటికీ బుద్ధిమాంద్యంలేక, దృష్టిమాంద్యంలేక, ముఖ్యంగా తిండిమాంద్యంలేక ముద్దపప్పు, గడ్డపెరుగూ, సేవిస్తూ సంపూర్ణ ఆరోగ్యంగా వున్నారని తలుస్తాను యిప్పటికీ. ఇంకోచిత్రం ఏమంటే ఒక మిత్రుడు లక్ష్మీనరసయ్యగారి దగ్గరకు వస్తాడు. వచ్చి తనకు కావలసిన యాభై సంవత్సరాలక్రితం. రచింపబడిన ఒకనాటకపుస్తకం కావాలనిచెబుతూ పుస్తకం వెంకటపతిరాజుగారి దగ్గర దొరుకుతుందని తెలిసి ఆయనతో పెద్దగా పరిచయం లేనిమీదట యిస్తారో యివ్వరో అని సంశయిస్తూ లక్ష్మీనరసయ్యగారిని యిప్పించమని కోరుతాడు.

"వెంకటపతిరాజుగారా? భలేవారే! ఆయన మనకు మంచి మిత్రులు! అబ్బో! ఆయనది ఒక పెద్ద లైబ్రరీ! ఆయన దగ్గర దొరకని నాటకాలు మరెక్కడా దొరకవు. తప్పకుండా ఏర్పాటు చేద్దాము" అంటారు లక్ష్మీనరసయ్యగారు. ఇక్కడగమనించ తగ్గది-

"నాకు మంచి మిత్రులు అనరు" మనకు మంచి మిత్రులు అంటారు, అంటే ఆయనకు మిత్రులు తప్పితే శత్రువులు లేరన్నది సత్యం. సహాయనిరాకరణ ఎరుగని మనిషి అన్నది వాస్తవం. సమిష్టికార్యక్రమాల్లో ఒక కార్యకర్తగా ఆయననోటినుండి ఎన్నడూ నేను నాది అనేమాటగాని, మేము మాది అనే మాటగాని వినలేదు. నేనుగాని మరెవ్వరైనాగాని వినివుంటే, వినబోతే అది వింతే అవుతుంది. మనమూ మనది అంటారు మనమూ మనది అనుమాటలమత్తులో ఎంతటివారైనా ఆ సమిష్టి కార్యక్రమాల వలయంలో చిక్కుకు పోయి ఆనందంగా, ఐచ్ఛికంగా విధినిర్వహణలో నిమగ్నులైపోతారు. ఇందుచెప్పుకోవలసినది."సామాజిక స్పృహ- సమిష్టి బాధ్యతలు" ఈనినాదాలు ప్రజలలోనికివెళ్లాలంటే ఆచరణ యోగ్యంకావాలంటే మనమూ మనది అను ఉత్ప్రేరణ పదాలు మాటల్లోనూ, చేతల్లోనూ కూడా ఉపయోగించాలి. అందరూ. అప్పుడే సమసమాజస్థాపనకు ఒకబాట ఏర్పడుతుందేమో! శ్రీ కర్నాటి గారికి స్త్రీ పట్ల ఒక విలక్షణమైన సంబోధనాపదం వున్నది. ఆ సంబోధన స్త్రీ యందు ఆయనకు వున్న గౌరవభావాన్ని సూచిస్తుంది. తనను కనిన తల్లి "అమ్మ" ఈయనకు, అంతవరకూ బాగానే వుంది. తన తల్లి తల్లిని కనిన తల్లీ అమ్మేఈయనకు, తన భార్యను కన్నతల్లీ అమ్మే ఈయనకు. చెల్లీ అమ్మే, ఒదినా అమ్మే, కాలేజిగరల్ అమ్మే,కూరగాయలు అమ్మే అమ్మి అమ్మే,ఇంటిలో అంట్లుతోమే పనిమనిషీ అమ్మే, బిచ్చగత్తె అమ్మే, ఆఖరికి ఊయలలోని పసిపాపా అమ్మే, సర్వం అమ్మమయం, ఈయనకు ఒకరుతప్ప. ఆమె ఎవరోకాదు వారి జీవిత భాగస్వామి అయిన వారి శ్రీమతిగారు.

ఆనాడు ఆయన నాకు తెలియదు. నేను ఆయనకు అంతకన్నా తెలియదు. అంటే మేం ఒకరికిఒకరం నటులుగా అపరిచితులం. ఆ స్థితిలోనే ఆనాటి ప్రదర్శన చూడడం,ఆయన మీద ఆ భావన ఏర్పడుచుకోవటం యాదృచ్ఛికం. ఈనాడు శ్రీ కర్నాటిగారు నా శ్రేయోభిలాషులు నాకు మంచి మిత్రులు, ఈస్థితిలో ఆయన గురించి ఈవ్యాసం వ్రాయడం మీ ముందు ఉంచడం నాకు లభించిన సదవకాశం.

*

# సర్వ కళాప్రపూర్ణులు

—టి. వెంకటపతి రాజు

నటుడు, రచయిత

జానపద కళాకారులు కర్నాటి

జ్ఞానపథంలో పయనించిన ప్రముఖులు

కష్టజీవుల కన్నీటి కథలను బుర్రకథలుగా చెప్పి. మెప్పించిన కధకులు, నాటక రచయిత సృష్టించిన పాత్రలకు ప్రాణప్రతిష్ఠ చేసిన ప్రతిభాసంపన్నులు.

కళాకారులకు ఆత్మీయులు, ఆదర్శనీయులు

కళాసేవలో కాకలు తీరిన యోధులు!!

తమ నటనతో పామరులను, పండితులను పరవశింపచేసిన

ప్రజ్ఞా దురంధరులు

ఆనాడెప్పుడో నా బాల్యంలో కళలకు నిలయమైన విజయవాడ గవర్నర్‌పేట సెంటర్‌లో శ్రీ కర్నాటివారు బుర్రకథను చెప్పేటప్పుడు నేను ప్రథమంగా లక్ష్మీనరసయ్యగార్ని చూడటం, కథను వినడం జరిగింది. తదనంతరం వారు ఏ కళాప్రదర్శనం యిచ్చినా, నేను చూడటం జరుగుతూ వస్తున్నది. ఆనాటి కథాక్రమంలో, వారి వాక్పటిమ, వారి వాక్చమత్కారం, నా మనోఃఫలకంపై చెరగని ముద్రలు వేశాయి.

తర్వాత గిడుతూరి సూర్యంగారు రచించిన "మానవుడు చిరంజీవి" మూక నాటికకు శ్రీ కర్నాటి వారు వ్యాఖ్యానం చదవడం అద్భుతం.... "ఈ సంఘర్షణలో అతనికి జయమో, పరాజయమో మానవుడు నిశ్చయించాడు. ధైర్యం, సాహసం, విశ్వాసం, బలం, అతనిలో విజృంభించాయి." అతనిలో అణగారి పోయిన దీక్షాదీప్తి. శక్తి పెల్లుబికి ప్రదీప్తి చెందాయి. అతని దేహం మేధస్సు ఉప్పొంగి, ఒక మహాశక్తిగా మారాడు. అతడిప్పుడు మానవోత్తముడు. పరమశివుని ప్రచండశక్తి విప్పిన ఫాలనేత్రంతో మృత్యువును "పారజూచాడు" మృత్యువు అదిరిపోయింది. భయంతో కంపించింది, కాలికి బుద్ధిచెప్పింది."

ఈ మాటలు పలికేటప్పుడు శ్రీ కర్నాటిగారి గళం గంగా ప్రవాహంలా గలగలా ప్రవహించేది.... మరికొద్ది చోట్ల దూకుతూ, దుముకుతూ, గర్జిస్తూ, గాంఢ్రించేది.

వారిగళంలో బాధామయుల రోదన, ఆవేదన. ఆవేశం. ఆక్రోశం ఘోషిస్తుంది. చూసే ప్రేక్షకుల హృదయ కవాటాలను తట్టి తాకుతుంది. వారి మాటలు ప్రేక్షకుల మనోఫలకాలపై. ప్రళయనృత్య పాదాల ధ్వనుల ప్రకంపనలు కలిగిస్తాయి.

ఇక నాటకాల కొస్తే అనిసెట్టి అపూర్వసృష్టి 'మావూరు' నాటకం.... అది నాటకం కాదు. గ్రామీణ వాస్తవ జీవితానికి దర్పణం. పల్లె మనుషుల జీవితాలకు చిత్రపటం. ఆ నాటకంలో పాత్రలు నా వూళ్ళో, మీవూళ్ళో మనందరి వూళ్ళల్లో కదిలే, కన్పించే సజీవ మనుషులు. భవిష్యత్తులో బ్రతికే పాత్రలు.

నిర్మలంగా నిశ్చింతగా జీవిస్తూ, నీతిగా, నిజాయితీగా బతుకున్న బడిపంతులు శివశంకిరం యింట్లోకి శకునిలా చేరతాడు మహంకాళి అనే మహాశయుడు. అసలే అక్కడున్న మునసబు, కరణాలు ఇరువర్గాలుగా విడిపోయి, కక్షలతో, కలహాలతో వూరు వూరంతా వుడికి పోతున్నది. ఈ సమయంలో ఈ వూళ్ళోకి ఈ మహంకాళి మహాశయుడు, ఈ కుయుక్తుల కుట్రదారుడు, ఈ కోర్టుపక్షి ప్రవేశించాడు. అగ్నికి ఆజ్యంలా తయారయ్యాడు ఈ మారాముళ్ళగాడు.ఈ మాటలమరాఠీ పోట్లాటలకు పొగపెట్టడం,కొట్లాటలకు కొత్రెక్కించడం, కేసులు పెట్టించడం, కోర్టుల చుట్టూ పల్లెప్రజలను తిప్పటం ఈ మహంకాళి వృత్తిప్రవృత్తి. అతను పచ్చి స్వార్థజీవి, పరులు పచ్చగా వుంటే కళ్ళల్లో నిప్పులు పోసుకుంటాడు. పరుల జీవితాల్లో నిప్పు పెడతాడు. ఆఖరికి పాపం పండింది. నూరుగొడ్లు తిన్న రాబందు ఓ గాలివానకు చచ్చినట్టు ఎత్తులు వేసివేసి, ఆఖరికి తానే చిత్తయ్యాడు. చింతించాడు. గ్రామదేవతను తరిమినట్టు తరిమేశారు పల్లెప్రజలు మహంకాళి మహాశయుణ్ణి.

ఆనాడు అలాంటి అద్వితీయమైన మహంకాళి పాత్రను యాభై పైచిలుకు వయసున్న పాత్రను 22 సంవత్సరాల యువకులైన శ్రీ లక్ష్మీనరసయ్యగారు అచ్చంగా వృద్ధునిగా, మాటలు నడకలు అద్వితీయంగా నటించి, చూసిన వాళ్ళందరినీ ఆశ్చర్య చకితుల్ని చేశారు.

మహంకాళి పాత్రసృష్టే మహాద్భుత సృష్టి. ఆ పాత్రను నటించడంలో శ్రీ కర్నాటి వారి నటనా విశిష్టతను, ప్రతిభా పాటవాలను నేను మాటల్లో రాయలేను. మళ్ళీ ఎప్పుడైనా వారు ఆ నాటకం ప్రదర్శించితే, అలాంటి అవకాశం వస్తే, ఆ అవకాశాన్ని జార విడుచుకో వద్దని నా మనవి.

ఆయన నటన మాటల కలవికానిది. మాటల్లో చెప్పడానికి వీల్లేనిది. ప్రతి పలుకులో విన్పిస్తుంది వాచిక ప్రావీణ్యం... ప్రతి కదలికలో కనిపిస్తుంది నటనా విన్యాసం.

మహంకాళి పాత్రను ధరించి ఆయన జీవితం ధన్యమైంది. ఆ మహంకాళి పాత్రను లక్ష్మీనరసయ్యగారు నటించి, తెలుగు నాటకరంగ చరిత్రలో చిరస్థాయిగా, చిరస్మరణీయంగా, చిరంజీవులుగా నిలిచి వున్నారు. వుంటారు.

ప్రజల మనస్సులో ప్రతిభావంతులు, పండితుల ఆలోచనల్లో కళా ప్రపూర్ణులు, ఆ మధ్యన ఓ సభలో తెలుగు విశ్వవిద్యాలయం అధిపతి శ్రీ తూమాటి దొణప్పగారు లక్ష్మీనరసయ్యగారు 'సర్వకళా ప్రపూర్ణులు' అని చెప్పారు. అందుకని ఏ విశ్వవిద్యాలయం అయినా తక్షణం కళాప్రపూర్ణ బిరుదునిచ్చి, సత్కరించి, సన్మానించి తన గౌరవాన్ని నిలుపుకుంటుందని నిలుపుకోవాలని నేనాశిస్తున్నాను.

---

ఉత్తమ నటులు, ఉదాత్త ప్రయోక్తలు
పలు జానపద కళా ధీవిలసితులు
కళా రంగంలో కీర్తికి వారసులు
శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్య

(ప్రభవ ఉగాది ఉత్సవం సందర్భంగా తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురించిన "తెలుగు వెలుగులు" నుండి)

9)

# నా మధురానుభూతి

—డాక్టర్ చెన్నకేశవ
కె. బి. యన్. కళాశాల
విజయవాడ-1

అయిదు దశాబ్దాల కళారూపాల తరంగాలు
శ్రీకర్నాటి కళాపయోనిధికి నిలయాలు!
హృదయవీణ పలికేను మంచితనం ప్రియ సంభాషణల రాగాలు
అవి చిందించేను ఆత్మబలం, సంయమనం సోయగాలు
మనసు వినయం. వివేకం కళారాధనల నిలయం
వీరి నవజీవన సాధనకు మార్గదర్శకం
సేవాభావం కర్నాటి అంతరంగరాగం
ఈ యుగాన వెలసిన మోహనరాగం!
వీరికి కాకతీయ కళాపరిషత్తు విశిష్టపురస్కారం
'నాటక కృషీవలుడు' బిరుదు ప్రదానం
ఈ తరం పొందిన విశిష్ట మధురానుభూతి
కర్నాటి కళారంగ కీర్తి నభూతో నభవిష్యతి!

# వందనం అభివందనం

కళాతపస్వీ!
వందనం అభివందనం!
మీ వదనం సుందరం
వాక్కు మధురం
హృదయం సుమపేశలం

అభిజాత్యానికి దూరం మీరు
ఆడంబరాలు గిట్టవు మీకు
మనఃసాక్షే మీ పథ నిర్దేశి

లయతప్పని అడుగు మీది
క్రమం తప్పని జీవిత గమనం
శ్రుతి తప్పని సుస్వరనాదం

కళల పట్ల ఎంత అనురక్తో
కలల పట్ల అంత విరక్తి
జానపదులు మీ బాంధవులు

జానపద కళల కాణాచీ
కళ కళకోసం కోసం కాదు
మనిషి శ్రేయస్సుకని నమ్మే
హితార్థులు మీరు!

పదిమందీ బాగుంటే
పరమాన్నం తిన్నంత సంబరం మీకు!

సకల సద్గుణాల రాశీ
అందుకోండి మా వందనం
అభివందనం!

—పూటుకూరి విఠల్‌రావు

# స్నేహపారిజాతం

— డోగిపర్తి శంకరరావ్,
అధ్యక్షుడు,
శారదా కళాసమితి

కీర్తి, విద్య, విత్తము పవిత్ర గంగానదిలా పదిమందికీ ఉపయోగపడితే ఆ వ్యక్తి జీవితం ధన్యం—అని మానసకారుడు శ్రీ తులసీదాసు 'రామ చరిత మానస్' లో

'కీరితిభనితి భూతి భలిసోయీ
జో సురసరి సమహిత కర్ హోయీ'

అనడం విన్నాం- అయితే అయిదు దశాబ్దాలు వివిధ తెలుగు కళారీతులను ప్రదర్శించి, కీర్తి ప్రతిష్ఠలు సాధించిన శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్య జీవితంలో ప్రత్యక్షంగా చూశాం.

ఆయన కళారంగ గగనంలో ఎగురవేసిన కీర్తి బావుటా, అభ్యసించిన కళలు, ఆర్జించిన సాధనా సంపత్తి అనితర సాధ్యం.

నూనూగు మీసాల నూత్నయౌవనంలో స్వతంత్ర సమరయోధునిగా కారాగారం వెళ్ళిన దేశభక్తుడు. కళారాధన ఓ తపస్సుగా, తెలుగు యక్షగాన ప్రక్రియలకు ఓ భాష్యం చెప్పిన మహామనీషి,

కర్నాటి సమయస్ఫూర్తితో ఎలాంటి సభనైనా రంజింప జేయగల దిట్ట. వీరు మహావక్తలు, విశిష్టవ్యక్తులు. నటులుగా, నాటక ప్రయోక్తలుగా....'నాటక కృషీవలుడు' బిరుదునూ, 'విశిష్టవ్యక్తి పురస్కారం' అందుకొన్న మేటి కళాకారులు.

అందరికీ ప్రేమపాత్రుడు, వివేకి, వినయశీలి. అందుకే ఆయన తెలుగు తల్లి ముద్దుగా, మనోహరంగా గానం చేయగల కీర్తిగీతం.

నిష్కళంక జీవన ప్రవంతిలో కళారాధననూ, సమాజసేవనూ పండించు కొన్న అదృష్టజీవి.

అమృత మనస్కులు, పదిమందికీ హితులూ, సన్నిహితులూ అయిన మా కర్నాటి ఓ కళా గ్రంథాలయం, అనురాగ దేవాలయం, మూర్తీభవించిన స్నేహ పారిజాతం,



శ్రీ కర్నాటిని సత్కరిస్తున్న కళావాచస్పతి జగ్గయ్య

# లలితకళాతరంగిణి

## "నాటక కళావతంస"తో నాలుగు నిమిషాలు

జానపద కళారూపాలైన కోలాటం చెక్కభజనలు, చెంచుపాటలు, పకీర్లవేషాలు వేయడంలో కళాకారుడుగా "నాటక కళావతంస", "ప్రజానటుడు" ఇత్యాది బిరుదులతో అలరారుతూ పదిమందితోను కలిసిపోయే వారిలో ఆరు పదులు నిండిన శ్రీ కర్నాటి లక్ష్మీ నరసయ్య ఒకరు నాటక కళకు ఇంతగా జీవితాన్ని అంకితం చేసిన ఒకూ కొద్ది మందిలో వీరు ఒకరు. తమకు 60 సంవత్సరాలు నిండుతున్న సందర్భంగా "ఉత్సవకమిటీ"ఆధ్వర్యాన షష్టిపూర్తి ఉత్సవాన్ని జరపతలపెట్టిన సందర్భాన్ని పురస్కరించుకొని జరిపిన ఇష్టాగోష్ఠిలో తమ జీవిత విశేషాలతో పాటు, తమకంటూ ఏర్పరచుకొన్న కొన్ని నిర్దిష్టమైన అభిప్రాయాలను వెలిబుచ్చారు.

తిరువూరు తాలూకా తునికిపాడు గ్రామములో 1927లో జన్మించిన వీరు ఖమ్మంలో విద్యాభ్యాసం చేసి పల్లెలలో, పట్టణాలలో ఎన్నో ప్రదర్శనలను వివిధ కళారూపాలను ప్రదర్శించి, ప్రశంసలందుకొని చివరకు విజయవాడలో కళాకారుడిగా స్థిరపడ్డారు.

"బుర్రకథ" కధకుడుగా పదహారు సంవత్సరాల వయస్సులో ప్రజల దగ్గరకు ప్రజల మనిషిగా వెళ్ళటమే కాకుండా "ముందడుగు"తో ప్రారంభించిన కళాజీవితం, ఆ తర్వాత ఎన్నో మలుపులు తిరిగి "మా భూమి"(రాముడు) "ప్రగతి" (పిచ్చివాడు)"అంతా పెద్దలే" (చైనులు) "చైర్మన్" (స్వామిజీ) "ప్రెసిడెంట్ పట్టయ్య" (పట్టయ్య) మొదలగు నాటకాలలో నటించడమేగాక ప్రజల ఆశీస్సులు పొందారు.ఆకాశవాణి నాటకాలలో తనగంభీరమైన కంఠంతో శ్రోతలను అలరించిన నటుడు శ్రీ కర్నాటి.

పెక్కుసార్లు జైలుకువెళ్ళి (ఉర్దూ ఉపాధ్యాయుడుగా, ఆంధ్ర మహాసభ కార్యకర్తగా) దేశంకోసం పాటుపడ్డ క్రియాశీలి వీరు. "తెలుగు విజ్ఞానపీఠం" (రవీంద్రభారతి1985)వారి ఆధ్వర్యంలోను,"ఆంధ్ర విశ్వవిద్యాలయం"(1987 ఉగాదిరోజున) ఆధ్వర్యంలోను ముఖ్యమంత్రిచే ఘనంగా సత్కారంపొందారు.

## కళ ప్రజల కోసం

కళ దేనికి! "స్వాంతస్సుఖాయ" అన్నారు కొందరు. అలా కాక కళ ప్రజలకూ. దేశానికి పనికిరావాలి, ప్రయోజనంలేని కళ కళకాదు అని గాఢంగా నమ్మే కొద్దిమంది కళాకారులలో శ్రీ లక్ష్మీనరసయ్య ఒకరు.

వటననే నమ్ముకొని, చిత్తశుద్ధితో దృష్టిని, బుద్దిని క్రోడీకరించి నడుచు కున్నట్లయితే నటులకు తిరుగుండదని, ఎటువంటి లోటురాదని, కళను నమ్ము కునేవారికి ఏ లోపం జరగదని, అది తన నమ్మకమని తెలిపారు.

## "జానపద కళాకేంద్రం" ద్వారా కళాసేవ

ఒకనాటి విశిష్టమైన మన తెలుగు జానపద కళారూపాలైన జముకులకథ, బుర్రకధ, పంబకథ, పిచ్చుగుంటలకధ, ఒగ్గుకథ, కోలాటం మున్నగునవే కాక వీధి భాగవతంవంటి కళారూపాలలో శిక్షణనివ్వాలని తద్వారా వాటిని ప్రచారం లోనికి తెచ్చి,పెక్కుమంది కళాకారులను తయారు చేయాలనే తమ అకాంక్షను వెలిబుచ్చారు.

**(కౌండిన్యస)**

**(ఆంధ్రపత్రిక, బుధవారం జనవరి 25. 1989)**

# కళారంగానికి పండుగ

సాధనతో సమకూడేది కళ....ఒకరిద్వారా అభివ్యక్తమై మరొకరికి రసానుభూతిని కలిగిస్తుంది .... అభివ్యక్తమైన కళాపరిణామమే కళాకారుని గమ్యం....ఈగమ్యంచేరేందుకు అవిశ్రాంతకృషి సాగించడంద్వారా కళామతల్లి ముద్దుబిడ్డలుగావాసికెక్కిన కళాకారుల్లోశ్రీకర్నాటి లక్ష్మీనరసయ్యఒకరు.పండిత పామరుల ప్రశంసలందుకున్న శ్రీకర్నాటి తెలుగు నాటకరంగంలో నాటికినేటికి తనకంటూ ఒక ప్రత్యేకశైలిలో ప్రేక్షకహృదయాలలో చెరగని ముద్రవేశారు. 'మాభూమి'నాటకంలోని అతిసామాన్యమైనరామునిపాత్రద్వారాఆయనప్రముఖుల ప్రశంసలందుకున్నారు. శ్రీ కర్నాటి నటుడుగా, వక్తగా, ప్రయోక్తగా, మానవతావాదిగా పరిపూర్ణమైన వ్యక్తిత్వాన్ని పొందిన కళాతపస్వి- శ్రీకర్నాటి తన 18వ ఏట్నని స్వాతంత్ర్య సమరంలో దుమికి మూడుసార్లు జైలుకు వెళ్ళారు. తెలంగాణా ప్రాంతంలోని గ్రామసీమల్లో వయోజనావిద్యా వ్యాప్తికి పాటు పడటంతోపాటు జానపద కళారూపాల ద్వారా గ్రామీణులను చైతన్యపరచటానికి అవిరళ కృషిసల్పారు. తప్పటడుగులతో కళారంగంలో అడుగిడిన నాటినుంచి నేటివరకు ఎందరో మేధావుల ప్రశంసాపురస్కారాలకు పాత్రులైన శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్య తన జీవితంలో పండించుకున్న అనుభవాలపంటను పంచి ఇచ్చారు.

## ఆనాడు ఈనాడు ఒకే ఆదరణ

నాటకరంగం పట్ల ప్రజల్లో ఆనాడు, ఈనాడు ఒకే ఆదరణ ఉందని, ప్రజలకు సంబంధించిన ఇతివృత్తాన్ని ఎంపిక చేసుకుని ప్రదర్శిస్తే ఆశించిన

దానికంటే ఈనాడు ఎక్కువ ఆదరణ లభిస్తుందని శ్రీకర్నాటి లక్ష్మీనరసయ్య పేర్కొన్నారు. సినిమాల్లో నటించడానికి నాటకానుభవం అవసరమంటూ సినిమాల్లో మూడొంతులపని దర్శకుడు, కెమెరామెన్ చేస్తారని, అదే నాటకరంగంలో స్వయంప్రతిభతో నిలిచి నాటక రక్తికి కృషి చేయాల్సిఉంటుందన్నారు. ప్రస్తుతం నాటకరంగంలో ప్రవేశిస్తున్న ఔత్సాహికుల విషయమై ప్రస్తావిస్తూ శ్రీకర్నాటి జీవితగమనంలో వేగం హెచ్చినకారణంగా, వారిదైనందిన కార్యక్రమాల్లో ఉండే వత్తిడి కారణంగా ఏదో చెప్పాలని తపనవున్నా, సరైన వ్యవధి తీసుకుని ఒక నాటక ప్రదర్శనను ప్రదర్శింపలేక పోవడంవల్ల ప్రజల్ని మెప్పించలేకపోతున్నారన్నారు. నాటక సమాజాలు నడిపేవారిలో హెచ్చుతగ్గులు కలిగి వుండటం నాటకాలద్వారా సినిమాల్లో ప్రవేశిద్దాం అనే అభిప్రాయం కలిగిన పలువురు వ్యక్తులవల్ల అవి స్థాపించిన అచిరకాలంలోనే అదృశ్యమైపోతున్నాయని శ్రీ కర్నాటి అభిప్రాయం వ్యక్తంచేశారు. పౌరాణికనాటకాల్లో నటనకు ప్రాధాన్యం తగ్గి పద్య పఠనానికి ఎక్కువ మక్కువ చూపుతున్న విధానానికి కారణం కేవలం పద్యపఠనంలో వున్న గొప్పదనం కళాకారుని అలా తీసుకు వెళుతుందేతప్ప నటనలో నైపుణ్యంలేక కాదని అభిప్రాయపడ్డారు.

కృష్ణాజిల్లా తిరువూరు తాలూకాలోని తునికిపాడు గ్రామంలో జన్మించిన శ్రీ కర్నాటి, దెందులూరు, ఖమ్మంలలో విద్యాభ్యాసం చేశారు. ఉర్దూభాషలో పరిచయం సంపాదించి ఒక ఏడాదిపాటు ఉపాధ్యాయునిగా పనిచేశారు, రంగస్థల నటునిగా శ్రీకర్నాటి సుమారు వెయ్యికిపైగా ఆకాశవాణి నాటికల్లో పాల్గొన్నారు, సినీరంగంలో ప్రముఖుల సరసన నటించి పేరొందారు. వీరు ప్రదర్శించిన అనేక నాటకాలు ఒక్కొక్కటి 10 సార్లు ప్రదర్శితమై ప్రముఖ హిందీ దర్శకనటులు శ్రీశాంతారామ్ శ్రీ పృథ్వీరాజ్‌కపూర్ వంటి వారి ప్రశంసలు పొందారు. హేతువాది అయిన శ్రీ కర్నాటి "ఈ చరిత్ర ఏ సిరాతో" "ఇది కాదు ముగింపు" "ఈ చదువులు మాకొద్దు" చిత్రాల్లో నటించారు. వీరు ప్రజానాట్య

మండలిలో అడుగిడి కోడూరు అచ్చయ్య, పెరుమాళ్ళగార్ల సారధ్యంలో శిక్షణపొంది "మాభూమి"ద్వారా పలువురిచే కీర్తింపబడ్డారు. 1979లో సోవియట్ యూనియన్ దర్శించిన శ్రీ కర్నాటి రాజధానిలో జరిగిన తెలుగు మహాసభల్లోకూడా పాల్గొన్నారు. నాటకరంగంలో ప్రోత్సాహక పథకాలను గురించి మాట్లాడుతూ శ్రీకర్నాటి ఆ కాలంలో రాజులు, జమీందార్లు కళలను పోషించేవారని అయితే ఆ బాధ్యత ప్రస్తుతం ప్రభుత్వానిదేనన్నారు. క్రీడారంగంలోను, ఎన్.సి.సి. వంటివాటిల్లో ప్రావీణ్యత పొందిన విద్యార్థులకు ఉద్యోగాలవిషయంలో రాయితీలు కల్పించినట్లే కళారంగంలో పేరుగాంచిన వారికికూడా అదే విధంగా ప్రోత్సాహం ఇవ్వాలని శ్రీ కర్నాటి సూచించారు, పాఠశాలల్లోకూడా నాటకకళ గురించి బోధించే అవకాశం కల్పించాలని రిహార్సల్ చేసుకునేందుకు ప్రతిజిల్లా కేంద్రంలో ప్రభుత్వం వసతి ఏర్పాటు చేయాలన్నారు. రేడియో నాటకాలను గురించి చెబుతూ నటులను ఎంపిక చేసేటప్పుడు తగుజాగ్రత్త రచనల విషయంలో అవసరమైనశ్రద్ధ కనబరిస్తే ఇప్పటికంటే మంచి ఫలితాలు వస్తాయన్నారు. అయితే ప్రస్తుతం అవి కొరవడ్డాయని ఆయన పేర్కొన్నారు. ఆంధ్రనాటక కళాసమితి స్థాపించి ఇప్పటికీ ప్రధానకార్యదర్శిగా కొనసాగుతున్నారు. ఔత్సాహిక నాటక సమాజాలను ప్రోత్సహిస్తూ. అంతరించిపోతున్న జానపద కళలకు తిరిగి పట్టం కట్టి తెలుగు నేల నాలుగు చెరగులా కళాచైతన్యం తీసుకురావాలని శ్రీ కర్నాటి తన వంతు కృషిలో నిమగ్నమయ్యారు. జానపద కళారూపాలపై పరిశోధనాత్మక గ్రంథాలు వెలువడి తద్వారా ఆ సంస్కృతిని భావితరాలకు దర్పణం పట్టి చూపించే విధంగా సహాయపడాలని ఇటీవల జానపద కళా కేంద్రాన్ని స్థాపించిన శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్య అధ్యక్షపదవి చేపట్టి కళామతల్లి సేవలో పునరంకితమయ్యారు.

(న్యూస్‌టుడె కల్చరల్ రిపోర్టర్ 16-5-1986)

# Quaint Charm of Rustic Expressions

Andhra Pradesh has a rich and varied heritage of folk arts intertwined with rural life. The variety of Stage forms like Burrakadha, Damaku, Veedhinatakam and Tholubommalu provide entertainment to masses and sustenance to the artistes. There are dance forms like Runja, Sarabhalu or Veerangam, Veeranrityam and Garagalu. Other folk dance and drama forms are still found in rural areas despite the fact that these arts posed a severe threat from celluloid field. For instance the Veedhibhagavatam and Tholubommalu, the main source of entertainment before the advent of dramas and cinemas are languishing for want of public patronage. All the folk arts are rich in literary value and closer to the lives of the people reflecting their customs and tradition. They have excellent rhythm that save them from extinction.

It goes to the credit of Mr. Karnati Lakshminarasaiah, founder of Janapada Kalakendram in Vijayawada for attempting to revive the glory of folk arts and preserving them for future generation.

He says the Kalakendram would strive to collect the folk songs and folk art forms and develop them without affecting their charateristic features.

Mr. Lakshminarasaiah have plans to impart training to artistes to present them to the people in a more agreeable manner. He has an ambitious plan of bringing together the nomadic people and record and preserve their songs on tapes.

("*The Hindu*" *May*" *17, 1987*)

# People's Artiste

— DHARA

On the stage Karnati has been the most innocent, humorous and naive Ramudu in "Ma Bhumi", a crafty, wily and fanatical swamiji in "Chairman" and dynamic Narayana Rao in "Mundadugu". Whatever character he delinates, he leaves an indelible impression on the hearts of the audience. His dedicated efforts to revive the folk-arts are uncanny and nonpareil. When he takes up folk items like "Golla Suddulu". Burrakatha" and "Jamukula Katha", Karnati enthrills the audience with his deep sense of humour, ready wit and political wisdom. A staunch believer in the movement of People's Theatre, he has succcssfully unshackled himself from the trends of traditional drama and infused new life and fresh blood to the avante-gardism. His life as an artiste is a mighty saga of fascination and charm, trouble and turmoil. His single minded self-effort has made him a veteran actor.

About playing some roles, he said, "Acting of some famous characters devours me. It is a dangerous game. I had to take up some characters like Pattaiah and Swamiji with a challenge. I tried to bring the best out of me".

His vibrant voice, lusty directness and courage of conviction captivated thousands of theatre lovers. His artistic success is a gradual buildup, not accidental, nor thrust upon. In every sense, he is a people's Actor. In recognition of his services rendered to the Andhra stage in general and folk-arts

in particular, he was felicitated here on February 1983 by a committee of hosts. He was recently honoured by Telugu Vignanapeetham. Hyderabad.

Karnati Lakshmi Narasaiah started his life as an Urdu teacher in Reddygudem. His reformist zeal made him to go from one village to other and spread the message of adult education. He had to surmount many difficulties created by the ruthless authorites of the erstwhile Nizam State. Dr. G. Raja Rao, picked up Karnati and dratted him into Praja Natya Mandali, after seeing him portraying the character of Narayana Rao in "Mundadugu". Under the guidance of Dr. Raja Rao. Koduri Achaiah, Karnati began to participate actively in the activities of Praja Natya Mandali. He is an adopt and expert in folk forms like "Golla suddulu". "Chenchula Katha" "Jamukula Katha" "Burrakatha' "Veedhi Bhagavatham", Bhajanalu" "Kolatalu" etc.

It is a happy news that Karnati has established a training school of folk arts in Vijayawada and soon it will start functioning. Karnati is also the general secretary of Andhra Nataka Kala Samithi a premier cultural organisation in Vijayawada. Through it he is cultivating a fine taste among art lovers.

— *Indian Express, March 1983*

# Demonstration On Folk Arts

— P. SRIRAM.

A 45-minute lively demonstration with explanatory notes on various folk arts was presented by Karnati Lakshminarasayya at Anupama conference chambers in Vijayawada in connection with the installation of new executive members of the Lions Club of Vijayawada rural.

Life is laya-based and one finds 'laya' and 'vadupu' in every folk art-form and song. The rich folk heritage of ballads dance dramas, music, burrakathas, harikathas, and numerous other forms has been passed on from generation to generation by hundreds of thousands of people by the Vedas of the Hindu epic lore passed on from generation to the next generation, said the doyen of Telugu stage theatre in his introductory speech.

Almost all folk art forms, be it kolatam, bhajans. 'sramikajana geetalu' [songs of working classes], tummeda songs, dappu daruvu [drum beat] or folk songs by farmhands while attending to agricultural operations like threshing, pounding paddy, winnowing or during tilling of lands invariably reflect the cultural legacy of the people and what is astonishing is the perfect rhythm, melody and message in these art forms.

The rendering of folk songs to demonstrate the beauty of them and to convey the meaning and message of these songs by the artiste received good response from the more than hundred gathering. Some of the folk numbers sung included 'Chengaavi cheerakatti', 'Yellipotondannasurya... Vannekarodembati' [referring to the setting of the sun by workers after a day's hard labour]'chickave ammadi...cheruvu gattumeeda [the sighting of one's be-loved on river bank 'Yendi Lachamma.. Jara chinna boyinavu' Telangana ballad] 'Domadorasani ...', suvvi, Yalalu, dhavalalu. Jola, jajara, Ariveni and others. The explanation that preceded every item

made it easy for the gathering to follow the nuances of folk songs and to appreciate them.

Although the dialect varied in some songs. the commentary and the explanation compensated it. The artiste held the attention of the gathering for full three quarters of an hour by his sheer force of talent and artistry. There was no musical or instrumental support and the melodious singing of these rustic and down to-earth numbers was interesting both to the tutored and untutored ears.

— *Indian Express, July 15, 1989.*

---

Mr. Karnati Lakshminarasiah, a doyen of folk arts, during his speech at Rotary auditorium in Vijayawada on the occasion of the presentation of "Telugu Janapada Kalarupalu" programme spoke of the richness of the folk arts and how they mirrored the rural life. He emphasised on the finer points of 'Dappu Daruvulu', 'Tummeda Patalu' 'Veeranatyalu'.'Garaga Nrutyalu', 'Budabukkalu' and 'Jangamdevara' besides elabora. ting on other forms of folk arts on the occasion.

Mr. Lakshminarasaiah has neatly delineated the subtle differences in the various folk arts in a simple and lucid manner.

[—Newstime, July 5, 1986.]

# Glimpses of folk-art-forms

'WHEREVER are the snows of yesteryears ?, bemoaned Sri, Sri, recalling the cultural glory of a gloary past, now in a 'fade-out' stage.

The soft snowfall which once made the aesthetes ecstatic had drifted and melted, beaten by the cruel winds of change. The fragrance of a rich cultural heritage, waited on the wings of time it now is on the wane.

Folk art forms which form a part of that heritage have been dubbed 'crude' and sidelined with the advent of the modern media of visual entertainment. Leather puppet shows for instance, have been relegated to the limbo of oblivion. Nor is there patronage for the folk-songs which once brimmed with the native idiom and had a cadence of their own.

If such folk art forms like 'Jamukula Katha', and 'Chindu' etc, still amblish the Andhra cultural scene, it is on account of the dedicated and unremitting service of votaries like Karnati Lakshmi Narasayya, a stage veteran. Against heavy odds, he is valiantly striving to keep the torch burning.

Lovers of the folk-art forms had fleeting glimpses of them on September 26, when Karnati Lakshmi Narasayya, well-versed in folk-lore, presented varied and brief items in the Rotary auditorium, under the auspices of Kannada Seva Sangha.

The cultural programme was prefaced by an elucidatory account of the folk songs by Lakshmi Narasayya, who stated that they have survived for more than 2500 years, through in a lesser light having been handed down from one generation to another through word of mouth. The enlivining songs once brightened the rural areas.

Man's life is governed by certain rhyme and rhythm and certain pace, he explained. What inspire the common folk to break into a song are the transient seasons, rain and shine, births and deaths. sorrows and pleasures which they encounter in their lives. And the workers intone a song to forget their fatigue and add swing to their work. That's why the fields echo with the labourer's songs at the times of transplantation and harvest. Like '*Yellipotondo Yellipotondanasurya*', which was rendered by Lakshminarasayya and his troupe.

Sankranti festival is a signal for celeberation by the farmers soon after the harvesting season is over. Songs like '*Chemataku tadisi chedirina gandham ghuma ghuma ladindolala*' (the sweat-soaked sandal paste exudes a rare fragrance) pulsate with rhythm and imagination.

Under Lakshmi Narasayya's lead, singer Nancharayya was his student best with the '*Soggadu*' song. Another piece that drew loud applause was the rhythm-oriented '*Chindu*'. While Surya Bhagavanta Rao led with rhythmic beats on the 'dappu', dancer. Hemanth Kumar's nimble feet repeated them without a false step. The tempo rose steadily, to the utter delight of a captive audience.

'*Burra Katha*' is a rare folk art form found only in Andhra Pradesh. It reflects the Andhra genius for narrative entertainment. One singer, playing on the 'tambura' (one-stringed instrument) narrates the story and two others are his side-men. The narration in song is occasionally interrupted by extemporising in prose by the side-men.

*—Dec. an Chronical, Sept 30, 1989.*



"పుట్టిల్లు" చిత్రంలో డా॥ రాజారావు గారితో కర్నాటి, జమున

# A Survivor Recalls his Glory Days

To break away from the shackles of a taboo-ridden society,KarnatiLakshminarasaiah urned to folk arts. Pisipati Sriram profiles the doyen of Telugu theatre.

KARNATI LAKSHMINARASAIAH is one of the few surviving stalwarts of the golden era of Telugu theatre. Soft-spoken Lakhminarasaiah has been associated with Telugu theatre for over four decades. He believes that art which serves no social purpose has no relevance and does not contribute to the view 'art for art's sake'. He is a pleasant conversationalist who thrilled audiences with his innovative presentation of folk arts and plays. He feels that a fair knowledge of the epics is a must if an artiste wishes to portary mythological, historical or social characters.

Recollecting his theatre days, he says. "I used to accompany performing artistes to distant places to learn their arts. It was fascinating to observe them in action. Th dressess worn by them, the slang they used in their dialogues, the story or the message were all very interesting. It was not that I wished to bring about radical changes in the set up with my street theatre performances or social plays."

A champion of the folk art forms, the 62-years-old veteran was born at Tunikipadu in Krishna district in a rural family of modest means. He was witness to the plight of the rural massess and their suffocating existence under Nizam's rule. This superstitious and taboo-ridden society shook him so much that even at the tender age of seven, he felt a compulsive urge to protest against the oppression. It was at this stage that he was attracted to folk arts like burrakatha. veedibhagothams, tolubommalata, gollasuddulu, jangam katha and kolatam. He found in these an effective medium to expose society's ills, It was these folk arts which played a key role in rousing the people to revolt.

Praja Natya Mandali provided him a forum as so many progressive actors, to express his dramatic talents and he received instant recognition for his role in the play 'Mundadugu'.

Karnati Lakshminarasaiah had his formal schooling at Madhira and Khammam.

A people's actor, he with his voice culture and imposing stage presence, has thrilled audiences throughout the length and breadth of the State, as a member of the Andhra Mahasabha in the formative years of his career. It would not be an exaggeration to say that there is no folk art in the State with which he is not well versed.

His credentials as an artiste were established in "Mundadugu", presented at Madhira, under the auspices of Praja Natya Mandali. His role of Ramudu in 'Maabhumi' earned him accolades and he never looked back. Lakshminarasaiah has had the privilege of learning under experts like Koduri-Achayya and Perumallu of the Krishna

district unit of the Praja Natya Mandali. He has a long association with Dr. Raja Rao, the doyen of the people's art movement.

Burrakatha can be presented effectively with minimum para phernalia, according to Lakshminarasaiah. Two vantas (accompanying artistes) tambura and cymbals are all that is needed to provide entertaining programmes, To date, he has directed several stage plays and participated in more than a thousand radio plays.

His role as swamiji in 'Chairman' was symbolic of crookedness. Raghava Reddy's role which he played in Toofan was equally memorable, for it set a new trend in theatre movement. As Pattaiah in 'President Pattaiah' which was staged more than 50 times his acting was unparalleled. In 'Evaru Drohi' he played the role of an MLA. It was the forerunner of the present day natyavadhanam.

Lakshminarasaiah is also a writer and character actor. Pragati, Eenadu, Galimedalu, Mavuru Aasami, seetaramaraju, Antapeddale, Neramu-siksha, Sputnicyatra, Veedhi natakam, Vakchitram, Jeevitapadham and Jeetagadu are some of the plays he acted in. His action-studded roles as Ravana in 'Pratima', as Danavadeeshudu in Prabhavati, Praddyumnam and as Drona in 'Pancharatnam' have enforced the view that he is equallly at ease with classical plays as he is with folk arts.

To have spent more that 40 years on stage is no mean achievement. And this has assured Karnati Lakshminarasaiah now settled in Vijayawada, a place in the annals of Telugu theatre.

— Indian Express, Express Weekend

# ముత్యాల గొడుగు

— డాక్టర్ నండూరి రామకృష్ణమాచార్య

M.A., Ph D.

శౌర్య శూరుడైన కర్నాటి నర్సయ్య
మేటి నటులలోన మేరు పూస
అతని శక్తి-యుక్తి ప్రభా ప్రభావముల్
ఆంధ్ర నాటక కళ కంకితములు

కళకు "అతని బ్రతుకు" కర్పూర హారతి
పసిడి తెరకు క్రొత్త పరిమళమ్ము
యువ నటీనటులకు-ధృవతారకా దీప్తి
తెలుగు తల్లి హృదికి పులకరింత

కళకు మారుపేరు - కర్నాటి నర్సయ్య
బుర్రకథకు క్రొత్త పరిమళమ్ము
నిత్య నాట్య సేవ - ముత్యాల గొడుగుగా
మెరయును గాత అతని శిరము పైన

# పద్యపఠనంలో కొత్తపోకడలు

[పునాది లేనిదే సౌధనిర్మాణం సాధ్యం కాదన్నట్లు, సంప్రదాయ పునాదులు లేకుండా ఏ కళా రాణించలేదు, మనలేదు.

నాటకకళకూ ఆ సిద్ధాంతం వర్తిస్తుంది.

ఇతర ప్రదర్శనా కళలకు లాగానే నాటకరంగానికి ప్రాచీనత వున్నది. ఆధునికత వున్నది. సూక్ష్మదృష్టితో పరిశీలిస్తే రెంటికీ సమన్వయ సూత్రం గోచరించకపోదు. అందుకే ఒకదాని సరసన మరొకటి మనగలుగుతున్నాయి.

సమసమాజం వెలసిన పురోగామి దేశాలూ మన సాంప్రదాయ నాటకాల్ని ఆదరిస్తున్నాయి. వాటి కళాత్మకతకు జేజేలు పలుకుతున్నాయి. పాశ్చాత్యదేశాలూ 'మహాభారతం' నాటకానికి ఇటీవలే, ప్రశంసలు కురిపించాయి.

సోవియట్ రష్యాలో 'అభిజ్ఞాన శాకుంతలం' అంటే యిప్పటికీ ఎనలేని ఆదరణే.

నాటకరంగంలో సంప్రదాయానికున్న విలువకు, ప్రాచుర్యానికి, వేరే నిదర్శనా లవసరంలేదు.

ఔత్సాహికనాటకాలతోబాటు సంప్రదాయ నాటకాలూ చైతన్యవంతంగా సాగుతున్నాయి.

సంప్రదాయ నాటకాల దీప్తిని కళాభిమానులకు రేఖామాత్రంగా ఎరుకపరిచేందుకే లోగడ (ఆగస్ట్ 1989) ఆకాశవాణి అధినేతలు 'రంగవల్లరి' కార్యక్రమం ప్రదర్శింప జేశారు.

"నూరేళ్ళకు పైబడిన చరిత్రగల తెలుగు నాటకరంగంలోని మహోజ్జ్వల ఘట్టాల్ని" ప్రేక్షకులకు పరిచయం చేయడమే "రంగవల్లరి" ధ్యేయం.

అది సౌరభాలీనే కదంబమ సుమమాలిక, మెరపుతీగెల కలయిక తొమ్మిది నాటకాల ఉదంతాల నవరసభరిత నవం.

తెలుగువారికి అత్యంత ప్రీతిపాత్రమైన రాగయుక్తమైన పద్యపఠనం పౌరాణిక, చారిత్రాత్మక నాటకాల విశిష్టత. అలనాడు రాగం గిరికీలు తీస్తే, యీనాడు భావోన్నత్యాని కనుగుణంగా సంక్షిప్తమైనది, సంయమనం చోటు చేసుకున్నవి.

అందుకే పద్యనాటకాలకు పద్యాలు మణిభూషణాలు. నటీనటులు ధరించే 'మణిభూషణాలు' కంటికి మెరుపులైతే, పద్యాలు మనోభిరామాలు,

ఆ నాటకాలకు వివిధ ఘట్టాలు ఒక ఎత్తు. కథాక్రమము, సందోర్భోచితం, వివరించే నటి. సూత్రధారుల ప్రవేశం మరొకఎత్తు. వారుభయులు కూడా నటనలో, గానంలో, ప్రావీణ్యమున్నవారై. తమ వ్యాఖ్యానాలతో నాటకంపై వెలుగు ప్రసరిస్తారు. లాక్షణికులు సూచించిన, రసికులు మెచ్చిన, ప్రత్యేక ప్రయోజనంగల ప్రక్రియ అది.

ఆ ప్రక్రియకు 'రంగవల్లరి' ప్రదర్శనరోజు, అనుభవజ్ఞుడైన నటుడు ఐన కర్నాటి లక్ష్మీనరసయ్య, అనుపమాన రీతిలో సూత్రధారిగా అనువైన ఆహార్యంతో జీవం పోశారు. నటిగా బెజవాడ చంద్రకళ కర్నాటికి సహకరించింది. ఆ సందర్భంలో పద్యం పాడవద్దు, చదవమని నటిని సూత్రధారి నిర్దేశించడం, అన్యాపదేశంగా అదే సూత్రాన్ని నాటక ఘట్టాల్లో నటీనటులు పాటించాలని సూచించడంగా అర్థం చెప్పుకోవచ్చు.

అలా పద్యాన్ని భావస్ఫోరకంగా 'చదవడం' ప్రారంభించినది 'మీసాలకృష్ణుడు'గా ప్రసిద్ధి చెందిన బెల్లంకొండ సుబ్బారావు. ఆనాటినుంచే 'సహజత్వం' కోసం కృషి సాగింది. ఆ పోకడలో భాగమే రాగాలహోరుతగ్గి, భావాల సొరుకు ప్రాధాన్యం కల్పించబడడం. ఈనాటికీ ఆ సాంప్రదాయాన్ని పాటిస్తున్నవారు పీసపాటి నరసింహమూర్తి, ఆధునాతనులలో పొన్నాల రామసుబ్బారెడ్డి.

సాంప్రదాయ తెలుగునాటకానికి పద్యం విలక్షణమైతే దాన్ని కాపాడ్డానికి తగుమాత్రమైన రాగంతో పద్య పఠనం ఆవశ్యకతనలా గుర్తుచేసి కర్నాటి మేలే చేశారు. ఆతడు చేసిన అమూల్యమైన మరో సేవ ప్రతీ నాటక ఘట్టానికీ ముందుగా దాని సందర్భాన్ని, స్వరూపాన్ని, ప్రాముఖ్యతని పసందైన వచనంలో పరిచయం చేయడం, తద్వారా 'రంగవల్లరి' ప్రదర్శన నిండుదనం సంతరించుకున్నది.

సొబగులు నింపుకున్న నటీ, సూత్రధారుల సంభాషణని ప్రచురించడం ఆ కారణంగా సంగతమే, సముచితమే. సాంప్రదాయ నాటక రంగంలో పద్యానికున్న ప్రత్యేక స్థానాన్ని, శ్రుతిమించిన రాగాలాపన ఉచితానుచితాన్ని విశ్లేషించిన తీరు రుచినాస్వాదించే వీలు కల్పించేందుకే దాని ప్రచురణ.

అవధరించండి మరి!

—పి. ఎస్. రావు]



సూత్రధారి వేషంలో శ్రీ కర్నాటి



ఆత్రేయ "ప్రగతి" నాటికలో పిచ్చివాడిగా శ్రీ కర్నాటి

# నటి - సూత్రధారుడు

సూత్ర : [ప్రవేశిస్తూ సభను ఉద్దేశించి]

నమస్కారం!!....మహాశయులారా!....నూరేండ్లకు పైబడిన మహనీయ చరిత్రగల మన తెలుగు నాటకాల్లోని-కొన్ని రసవత్తర సన్నివేశాల మధురిమ-చవి చూడడానికి దయచేసిన రసజ్ఞులకు .... కళాంజలి....

మన తెలుగు నాటకరంగం 'నూరువత్సరాలకు పైబడిన చరిత్ర' గలిగివున్నదని-మనవిచేశాను కదూ? అవును. తెలుగు నాటకం అనే మొలకను-ప్రోదిచేసి పెంచి, మహావటవృక్షం వలె దశదిశలా విస్తరింపజేసి, దాన్ని సుస్థిరం చేయడానికి-పెను ఊడలవలె ఊతగా నిలిచి, ఆదుకున్నవారు—యెందరో .... మహానుభావులు; సంస్థలు— వారందరికీ వందనములు. అట్టివారిలో మచ్చుకు....బళ్ళారి సుగుణవిలాస సభ మొదలుగా-హరిప్రసాదరావుగారు నాయకులుగా 'గుంటూరు ఫస్టు కంపెనీ', కృష్ణవేణీ తీరంలో కీ. శే. శ్రీ సూరానేని పాపయ్యారావు బహద్దరు వారిచే "మైలవరం-బాలభారతీ నాటక సమాజం", ఏలూరు మోతే నారాయణరావు జమీందారు వారిచే "శ్రీ సీతారామాంజనేయ నాటక సమాజం", రాజమహేంద్రవరం "గున్నేశ్వరరావుగారి" కంపెనీ, మచిలీ బందరులో "ఇండియన్ డ్రమెటిక్ కంపెనీ", తెనాలి "రామ విలాస సభ"....యిలాగే-యింకా-నగర-పట్టణ-గ్రామస్థాయిలలో అనేక నాటక సమాజాలు, ప్రజాసంస్థలు, ప్రేక్షకసంఘాలు....యిలా ఎన్నెన్నో- ఎందరెందరో-నాటక కళారంగాన్ని సేవించి ప్రముఖపాత్ర వహించిన వీరు-అందరూ మనకు చిరస్మరణీయులే.

[మందహాసంతో] అది సరే. కాని-సభాసదులకు ప్రస్తుత విషయాన్ని అలా వుంచి, ఉపోద్ఘాతానికి ఉపక్రమించినందుకు క్షంతవ్యుణ్ణి. అయితే.... వంటకాలలో 'ఉప్పు' ఎంత అవసరమో-ఉదాత్త విషయ సమర్పణలో 'ఉపోద్ఘాతం' అంతే అవసరం. అస్తు!

ఇప్పుడు ప్రేక్షకమహాశయులకు-వివిధ నాటక సంక్షిప్త సన్నివేశ

ప్రదర్శనల రసతర్పణ చేయడానికి-మానటి-అంతా సర్వసన్నద్ధం చేసిందో.... లేక....[ఎదుట చూచి] అదిగో!మాటలోనే వస్తున్నట్లున్నది!

నటి : [ప్రవేశించి-సభ్యులకు, సూత్రధారునకు నమస్కరించి]
హైందవ పురాణ సంస్కృతి నందజేసి,
నీతి-నియమాలు జనులకు నేర్వజేసి,
శాంతి-సౌఖ్యాలు జాతి కొసంగజాలు
మానిత మహాంధ్ర రంగస్థలీ! నమోఽస్తు. [రాగాలాపన పొడిగిస్తూ వుండగా]

సూత్ర ; [వారిస్తూ] నటీ! నటీ! ఆగు ఆగు!

నటి : ఆర్యపుత్రులకు నమస్కారం!

సూత్ర : సరే! కానీ నటీ-ఏఁవిటది? ఇంత పద్యానికి అంత రాగమా? నటీ! తోక బరువైతే-గాలిపటం గూడ ఎగరలేదు తెలుసా? అసలు, తోక లేకపోయినా కొన్ని యెగురాయనీ నీకు తెలుసనుకో....అలాగే....

నటి : ఇంతకు మీరనేది ఏఁవిటి? రాగాలాపన చేయవద్దనేనా?

సూత్ర : అలా అనలేదు. పద్యాన్ని పద్యంగా చదవమంటున్నాను. పద్యంలో ఉన్న భావానికి తగినంత సంగీతం మాత్రమే చాలు అంటున్నాను.

నటి : అని, మీరు అంటున్నారా? ఆ విధానమే మీకు యిష్టమన్నమాట.

సూత్ర : నాకు యిష్టం అనీ కాదు, ఇది నా వొక్కడి మాటా కాదు. ఇది ఒక సంప్రదాయిక నియమం. మన పెద్దల కట్టుబాటు. మన పద్య నాటకాల్లో-సాహిత్యానికి-అన్వయ-అర్థ - భావాలు ప్రాణం వంటివి. సమయ సందర్భాలకు, భావ, అర్థ ప్రకటనకు-సంగీతం భారం కారాదని నాభావం. పైపెచ్చు; భావస్ఫోరకంగా వుండడం అవసరం. ఈ ఆశయంతోనే, 'నాటకం' అనేది లలితకళా సమాహారం గనుకనే నాటకాలలో పద్య పఠనానికి సంగీతాన్ని మేళవించారు మన పెద్దలు. అందుచేత-ఈలలు, చప్పట్లకు మురిసిపోయి ఔచిత్యాన్ని మరచిపోకూడదు. ఒక ముఖ్య విషయం గమనించావో లేదో ఏ యితర భాషా నాటకాలకు లేని ఒక దివ్య వరం మనకున్నది. అది-తెలుగుపద్యం. ఆ వరాన్ని సగౌరవంగా సద్వినియోగం చేసుకోవడం మన బాధ్యత.

నటి : అయితే మరి-యీనాటి పద్యనాటకాల్లో ప్రధానంగా, సంగీతాన్నే సమాదరిస్తున్నారు కదండీ?

సూత్ర : [వ్యంగ్యంగా సాగదీస్తూ] ఆ-ద-రిస్తున్నా-రు. అయితే .... సంగీతమే ప్రధానంగా ప్రయోగింపబడి, యీనాడు కొన్ని మాత్రమే నాటకాలు, చాల కొద్దిమంది మాత్రమే నటులు-రంగంలో ముందున్న మాట గూడా నిజమే. కాని, యీ పరిణామం వల్ల నటనా ప్రాముఖ్యం గల అనేక నాటకాలు, సంప్రదాయజ్ఞులైన అనేకమంది నటులు-అనాదరణకు గురి ఔతున్నారు. సంప్రదాయ నాటక రంగ ప్రగతికిగాని, దాని మనుగడకుగాని యీ పర్యవసానం వాంఛనీయం కాదు.

నటి : బాగా చెప్పారు....అయితే-యింతకు పూర్వం, నాటకాలలో, సంగీతం పాడినవారు లేరూ అంటారా?

సూత్ర : ఎందుకంటాను? సంగీతం పాడినవారూ వున్నారు. పాడుకోదగిన కొన్ని పాత్రలూ వున్నాయి. గానలోలుడైన కృష్ణుడూ, నారదుడు, కొందరు భక్తుల పాత్రలు, ప్రచారకుల వంటి పాత్రలు, అవన్నీ యీ కోవకు చెందుతాయి. సంగీత మర్యాదను, శాస్త్రమర్మాలను తెలుసుకొని, గురుముఖతః శిక్షణపొంది, అనుభవాన్ని గడించిన వారూ, పాత్ర ఔచిత్యాన్ని, అవకాశాన్నిగుర్తెరిగి నాటకాలలో సంగీతం పాడి మెప్పించి, పండిత పామరులలో పేరుపొందిన మహనీయులూ మనకు ఉండేవారు. వారిలో కీ.శే.లు. కపిలవాయి, జొన్నవిత్తుల, తుంగల చలపతిరావు, అద్దంకి శ్రీరామమూర్తి, యీలపాట రఘురామయ్య, సూరిబాబు మొదలగువారు. అలాగే నటీమణులలో శ్రీమతులు రామతిలకం, దాసరి కోటిరత్నం వంటి గంధర్వ గాయకులు-వుండేవారు. ఏ భావానికి యే రాగం రసస్ఫోరకంగా వుంటుందో-ఆయా శాస్త్ర గ్రంథాలలో నిర్దేశింపబడివున్నది. ఆ విషయాలను పరంపరగా ఆకళింపు జేసుకుని విజ్ఞతతో ఆచరించేవారు. ఇందుకు ఉదాహరణగా ఒక వింత విషయం చెప్తాను విను! "అభిజ్ఞానశాకుంతలమ్" అనే నాటకంలో-ఒక్క-సీస పద్యం-రంగస్థలిపై చదివే అర్హత నంపాదించడానికిగాను, శ్రీ యడవల్లి

వారి పర్యవేక్షణలో, కపిలవాయి రామనాథశాస్త్రిగారికి ఆరుమాసాల సాధన అవసరం అయింది అని-యీ నాటికీ చెప్పుకుంటూ వుంటారు-ఆనాటి వారు.

నటి : ఆలాగా! అయితే-తెలియక అడుగుతాను. ఒక్క విషయం చెప్పండి! కేవలం సంగీత ప్రాధాన్యం వల్ల నాటక ప్రయోజనం సిద్ధించదంటారు. అంతేగా?

సూత్ర : తెలిసినా-తెలియకపోయినా-మంచి ప్రశ్నే అడిగావు. నాటక ప్రయోజన సాధనకు-ముఖ్యంగా-సాహిత్యరచన, సన్నివేశ కల్పన, వేషధారుల ఎంపిక, పరిగణన, సంభాషణోచ్చారణలు-పాత్రాలంకరణ, హావభావ, ప్రకటన, నటన, ఇవి అతి ప్రధానమైనవి, వీటిలో-సంగీతం ఒక అంశం మాత్రమే.

నటి : అదీ సంగతి. అలా చెప్పారు-బాగున్నది. నిన్న మొన్నటివరకు నటీ-నటులకు గురు శిక్షణ, శాస్త్ర నిర్దేశం-ప్రమాణంగా ఉండేవి అని అర్థం అయింది. అయితే.... యీనాడు....

సూత్ర : చూడు! మన విధిని-మనం విస్మరించినందువల్లనే, నాటక ప్రదర్శనలకు యీనాడు ప్రజాదరణ పలచబడుతున్నది. అజరామరం అయిన ఆంధ్ర నాటకరంగం-ఆపద్దశను ఎదుర్కోవలసిన పరిస్థితి ఏర్పడుతున్నది. ఇంతెందుకు? ఒక విషయం చూడు తెలుగు నాటక కళాభారతికి దివ్య కుసుమాలుగా అలంకరింపబడిన ఎన్నెన్నో మహానాటకాల ఉనికిగాని, ఆయా నాటక రచయితల నామమాత్ర పరిచయంగాని యీనాటి వారిలో కొందరికి లేకపోవడం ఎంతైనా విచారకరం.

నటి : చూడండి! దయచేసి, సమయభంగం అని మీరు అనుకోకపోతే- ఆ మహా నాటకాలు యేవేవో-ఆ మహాకవులు యెవరో సంక్షిప్తంగా సెలవిస్తారా?

సూత్ర : అలాగే-తప్పేం వుంది? తప్పకుండా చెప్పుకుందాం. పైగా-ఆంధ్ర నాటకరంగ వైభవ సంస్మరణకోసమే కదా యీ నాటి సమావేశం,

మొదట 'ఆంధ్రనాటక పితామహ' బిరుదు పొందిన శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యులవారు 'చిత్రనళీయం'. 'భక్తప్రహ్లాద' మొదలైన నాటకాలు రచించి, తాముగా నటించి ప్రదర్శించారు. బహుశః వీరిని-తెలుగున తొలి స్వతంత్ర నాటక కర్తలలో ముఖ్యులుగా భావిస్తారు. అంతకుముందు 'అభిజ్ఞానశాకుంతలం,' భాస నాటకాలు. శూద్రకుని 'మృచ్ఛకటికమ్' వంటి సంస్కృతానువాద నాటకాలు. కొన్ని వెలువడినై. తరువాత క్రమంగా వేదం వేంకటరాయశాస్త్రిగారి ప్రతాపరుద్రీయం, వడ్డాది సుబ్బారాయ కవిగారి 'వేణీ సంహారం', తిరుపతి వెంకటేశ్వర కవుల 'భారత నాటకాలు, శ్రీపాద వారి 'బొబ్బిలి' నాటకం, కాళ్ళకూరి వారి 'చింతామణి, వరవిక్రయం'. పానుగంటివారి 'పాదుకా పట్టాభిషేకం. రాధాకృష్ణ. విప్రనారాయణ. బలిజేపల్లివారి 'హరిశ్చంద్ర, చిలకమర్తివారి 'గయోపాఖ్యానం', ప్రసన్నయాదవం, యింకా 'విజయనగర సామ్రాజ్య పతనం,' 'ఖిల్జీరాజ్యపతనం', 'రసపుత్ర విజయం,' వంటి చారిత్రాత్మక నాటకాలు, మరెన్నెన్నో ఆంధ్రనాటక కళాభారతి గళసీమను అలంకరించాయి. ఆ నాటకాలన్నీ భారతీయ,ఆంధ్ర-సాంఘిక, సాంస్కృతిక, పారమార్థిక ప్రబోధకమైన నిత్యసత్యాలు. అటువంటి మహానాటక సంపదను విస్మరించడం ఒక విధంగా-మన దురదృష్టం.

నటి : బాగా చెప్పారు. 'ఆంధ్ర నాటకరంగ వైభవాన్ని గూర్చి' యీ రోజు చాలా మంచి విషయాలు వినిపించారు. కృతజ్ఞురాల్ని.

సూత్ర : మంచి విషయాలను వినడమే కాదు. ఒంట బట్టించుకొని, తెలియ గోరిన వారికి చెప్పి, చేయించడం ముఖ్యం. మన తెలుగు నాటకరంగ సమగ్ర పరిచయం వున్నదే-ఇది-కళాకారులమైన, మన కర్తవ నిష్ఠకు-యెంతగానో ఉపయోగపడుతుంది. సరిగాని-నటీ!....ప్రదర్శన సమయం ఆసన్నం అవుతున్నది. అందుకు అంతా సిద్ధమేనా?

నటి : అహా! మీ సమయ పరిపాలనలో, అలసత్వానికీ, ఆలస్యానికి ఆస్కారం కూడా వుంటుందా?

సూత్ర : అయితే-వద!

ఇక

## —రసవద్ఘట్టాల రమ్యావలోకనం—

## సూత్రధారుని పరిచయ వాక్యాలు

### పాండవోద్యోగం

ఇరుపక్షాలవారికి యుద్ధం తటస్థించినప్పుడు ఆయా పక్షాలవారు, యితర రాజుల సహాయం కోరడం అనేది. యీనాడే కాదు, పూర్వయుగాల్లో కూడా వున్నట్లే తెలుస్తున్నది. ఆ రీతిగానే, కురుక్షేత్ర సంగ్రామం సందర్భంగా, శ్రీకృష్ణుని సహాయం పొందడానికై దుర్యోధన-అర్జునులు ద్వారకకు వస్తారు. వచ్చి, ఎవరు యేది కోరుకుంటారో, ధర్మపక్షపాతి అయిన శ్రీకృష్ణుడు ఏమి అంటాడో, ఎలా ఆచరిస్తాడో, అది శ్రీ తిరుపతి వెంకటకవులు రచించిన 'పాండవోద్యోగం' నాటకం నుండి శ్రీకృష్ణుడుగా శ్రీ ఏ. వి. సుబ్బారావు, అర్జునుడుగా శ్రీ బి.వి. రంగారావు, దుర్యోధనుడుగా, శ్రీ ధూళిపాళ సీతారామశాస్త్రిగార్ల నటనా వైదుష్యాన్ని తిలకిద్దామా?

### సత్యహరిశ్చంద్ర

యుగ యుగాల నుండి, యీ జగత్తు సర్వం- "సత్యమే" ఆధారంగా నిల్చి ఉన్నది. అని-మన వేద-శాస్త్ర-పురాణాలు చెప్తున్నాయి. అట్టి 'సత్యసంధత'కు ప్రతీకగా ఉన్న-అలనాటి హరిశ్చంద్రుడు సత్యవాక్య పరిపాలనకోసం, ఎన్ని అగచాట్లు అనుభవించాడో, అందుకు ఆయన సతీమణి చంద్రమతి ఎలా సహకరించింది, అనే గాథను దృశ్యకావ్యంగా మలిచిన- బలిజేపల్లి లక్ష్మీకాంత కవిగారి 'సత్యహరిశ్చంద్రీయ' నాటకంనుండి హరిశ్చంద్రుడు'గా శ్రీ కె. నాగేశ్వరరావు, చంద్రమతిగా - శ్రీమతి కోమలాదేవిగార్ల పాత్రాభినయాన్ని దర్శించండి.

## భక్తరామదాసు

శ్రీరామ భక్తుడు అయిన కంచెర్ల గోపన్న భద్రాచల రామదాసుగా ప్రసిద్ధుడై, ఆంధ్ర వాగ్గేయకారుల్లో ముఖ్యుడై, తన రామభక్తి పారవశ్యంలో కడకు చెఱసాల పాలైన గాథను-పండిత డి. గోపాలాచార్యులవారి రచననుండి రామదాసుగా శ్రీ చుండూరి మధుసూదనరావుగారు నటిస్తారు.

## గయోపాఖ్యానం

భారత కథల్లో కొన్ని పాత్రలు ఆధారంగా కీ. శే. చిలకమర్తి లక్ష్మీ నరసింహం పంతులుగారు రచించిన నాటకం 'గయోపాఖ్యానం' యీ సంవాద - సంగ్రామం. ఇదిఒక 'కళాత్మక సన్నివేశం'. ఆ ఘట్టాన్ని శ్రీ కృష్ణుడుగా పీసపాటి నరసింహ మూర్తిగారూ, అర్జునుడుగా వేమూరి రామయ్యగారూ ప్రదర్శిస్తారు.

## మాయల ఫకీర్ (బాలనాగమ్మ)

కణ్వశ్రీ రచించిన 'బాలనాగమ్మ' నాటకంలో-"మాయల ఫకీర్"…. అహఁ-అలా ఉలికి పడకండి! నాటకంలో-మాయలఫకీరు - బాలనాగమ్మను రూపుమార్చి అపహరించుకు పోతాడు. కాని-మనకా, అనుమానం అక్కర్లేదు. వల్లూరి వెంకట్రామయ్యగారి'మాయల ఫకీరు' పాత్ర చిత్రీకరణ చిత్తగించండి.

## నర్తనశాల

మహాభారత ఇతిహాసంలో మకుటాయమానమైన విరాట పర్వంలో 'కీచక' పాత్ర సృష్టి అపురూపమైంది. ఆ పాత్ర యొక్క వైలక్షణ్యం ఎటువంటిదో-కీ. శే. పి.వి. భద్రంగారి 'నర్తనశాల', అదే- 'కీచకవధ'- నాటకం నుండి కీచకుని పాత్రలో ఆచంట వెంకటరత్నం నాయుడుగారి నటనను తిలకించండి.

## శ్రీకృష్ణ తులాభారం

భగవానుడు భక్తులకు 'హితకారి' అనీ, గర్వితుల గర్వాపహారి అనే విశ్వాసానికే నిదర్శనగా - ముత్తరాజు సుబ్బారావుగారు రచించిన 'శ్రీకృష్ణ తులాభారం' నాటకం నుండి శ్రీకృష్ణుడుగా శ్రీమతి అబ్బూరి కమలాదేవి, సత్యభామగా శ్రీమతి రంగపుష్ప, రుక్మిణిగా శ్రీమతి నగరాజ కుమారి, నారదుడుగా శ్రీ టి రామకృష్ణశాస్త్రి ప్రదర్శించే దృశ్యాన్ని తిలకించండి !

## సతి—సక్కుబాయి

మహాభక్త విజయంలోని భక్తులలో - మహాభక్తురాలుగా ప్రసిద్ధి బడసిన యిల్లాలు సతి-సక్కుబాయి. సాంఘిక అవరోధాలు సాంసారిక బంధాలను అధిగమించి, ఆమె, భక్తి పారమ్యాన్ని ఎలా పొందిందో- సోమరాజు రామానుజరావుగారి 'సతి-సక్కుబాయి' నాటకం నుండి సక్కుబాయిగా శ్రీమతి పువ్వుల అనసూయ తమ నటనను ప్రదర్శిస్తారు.

## పాదుకా పట్టాభిషేకం

అజ్ఞాతశక్తి ప్రేరితురాలైన కైక - పూర్వమెప్పుడో దశరధుడు తనకు "రెండు వరములను యిచ్చెద" నని వాగ్దాన మిచ్చినందుకు ప్రతిఫలంగా యిప్పుడు తన కుమారుడైన భరతునకు రాజ్య పట్టాభిషేకముగా ఒక వరము, రామునకు 14 ఏండ్ల అరణ్యవాసముగా రెండవ వరము కోరగా

దానిపై దశరధుని ప్రతిస్పందన - ఎలా వుంటుందో— కీ.శే. పానుగంటి లక్ష్మీ నరసింహారావుగారు రచించిన 'పాదుకా పట్టాభిషేకం' అను నాటకం నుండి 'దశరథుడు'గా శ్రీ కందుకూరి చిరంజీవిరావు గారి దశరధ పాత్రాభినయం పరికించండి.

— ముక్తాయింపు —

సూత్ర : మరి, చూశావు కదా మన తెలుగు నాటకరంగ వైభవంలో కొన్ని మచ్చు తునకలు? ఇప్పుడు చెప్పు నీ అభిప్రాయమేమిటో?

నటి : కన్నుల పండువుగా, వీనుల విందుగా వున్నది. నా అభిప్రాయమేమిటి-అంటారా? నా ప్రవృత్తి, స్వభావాల ననుసరించి నా కోరిక యిదే స్వామీ-

సూత్ర : అదేమిటో నిస్సందేహంగా చెప్పు!

నటి :
కళలు, జనజీవనంబున మిళితమగుచు
జనుల, చైతన్యవంతుల సలుపవలయు,
సాటివారలలో తాను మేటియగుచు
తెలుగు నాటకరంగము వెలయవలయు,—

సూత్ర ; ఇది చాలా బాగున్నది. పద్యపఠనంలో కూడా నా సూచనను చక్కగా గమనించావు-అనుసరించావు. సంతోషం. మంచిని పాటించడమే కదా మనకు కావలసింది? సరే! ఇప్పుడు చెప్పిన నీ ఆశయం వున్నదే-అది సర్వజనామోదయోగ్యం అయినది, మరి, మరొక్క మాటలో 'భరతవాక్యం' పలికి, ప్రేక్షక మహాశయుల వద్ద శలవు తీసుకుందామా?

నటి : అలాగే,

సూత్ర :
కళలు, దేశాభ్యుదయ సహకారులగుచు
వెలయుగాత; కళాకారులు, + అలఘుకళలు,
తెలుగు నాటకరంగము-దేశమునకు,
ప్రజలకు + అంకితమొనరింప బడెడుగాక!

నటి :
సూత్ర : } తథాస్తు!

(ఆకాశవాణి, విజయవాడ కేంద్రం వారి సౌజన్యంతో)

# జానపద రంజని

ప్రశ్న: లక్ష్మీనరసయ్యగారూ! నమస్కారం! మీరు ప్రజానటులు, నాటక ప్రయోక్తలు, జానపద కళాభిజ్ఞులు. మీరు ఆచార్యత్వం వహించి జానపదశిక్షణాలయాలలో చాలమంది కళాకారులకు తర్ఫీదు ఇచ్చారు. మీ ఉద్దేశంలో, మీ పరిశీలనకు అందినంతవరకు యీ జానపద కళా రూపాలకు అంకురార్పణ ఎప్పుడు ఏ విధంగా జరిగివుండవచ్చునని, భావిస్తున్నారో వివరిస్తారా?

సమా: అలాగేనండి. మనవి చేస్తాను. తొలి రోజులలో "ఆదిమ మానవుడు, తనకు విద్యాగంధం లేకపోయినా కేవలం ప్రకృతి సాహచర్యంతో ఆ సౌందర్యానికి ముగ్ధుడై పరవశించి పాడిన ఆశుకవితాగానామృత బిందువులే జానపదగేయాలుగా రూపొందాయి," అన్నది ఒక సిద్ధాంతం. తమ ఊరు, పేరు చెప్పని యీ జానపద కవుల కందరకు గురువులకు గురువైన ప్రకృతే ఆదిగురువు అని పలువురి నమ్మకం. ఆదిమానవుడు ప్రకృతి సౌందర్యాన్ని పరిశీలించి, దాన్ని రాళ్ళమీద రప్పలమీద పసరు పూతలతో చిత్రించుకున్నాడు. లతా నికుంజాలను చూచి పర్ణశాలలు నిర్మించుకున్నాడు. ప్రకృతిలో నిండివుండే మౌన గంభీర నాదాన్ని ఆలకించి, దానితో శ్రుతిగలిపి పాడాడు. నెమళ్ళ నాట్యాన్ని అనుకరించి ఆటలాడాడు. తన పరిసరాల్లో వుండే మృగ- పక్షి జాతుల అనురూప స్వభావాలను ఆకళించుకొని, వాటి సహజత్వాన్ని అనుసరించాడు. ఆనందించి చప్పట్లు చరిచాడు. "ఆ చప్పట్లే యిప్పటి, 'తప్పెట' లకు మూలం"అని చెప్పుకున్నా తప్పు లేదు. కనుక, యీ కళలకన్నిటికీ ప్రకృతే 'ఆదిగురువు' అనే విషయం. అవగతం అవుతోంది. మొదట్లో. అడవులే నివాసంగా గల వీరు, సామూహికంగా ఆహార సంపాదన చేసేవారు. సమానంగా పంపిణీ చేసేవారు. సామూహిక రక్షణకు మనుగడకు గుంపుగా గూడి.

రాత్రులుగడుపుతూ, తమకు జీవితాధారాలని తెలుసుకుని నిప్పు, నీరూ గాలీ, చెట్టూ, గట్టూ, సూర్య-చంద్రులూ మొదలైన ప్రకృతి శక్తులను తలుస్తూ కొలుస్తూ కాలక్షేపం చేసేవారు. మాటా, పలుకూ నేర్చిన కొంతకాలానికి వీరు, తమకు ఆరాధనీయమైన వాటిని, మాటలతో పొగడేవారు, ఆ పొగడ్తలు క్రమంగా పాటలుగా పరిణమించాయి. వాటినే మనం 'జానపదగేయా'లని అంటున్నాం. ఇదొక దృక్కోణం మాత్రమే. మరొకటి- ఆది మానవుడు అడవులలో భయార్తుడైనప్పుడు, ప్రకృతిసౌందర్యానికిపరవశుడైనప్పుడు, దుఃఖ పరీతమానసుడైనప్పుడు, వసంతకాలంలో పంచమ స్వరాన, కలకూజితంతో తనను మురిపించి, మారు కూయించిన కోయిల కూత, కానికాలంలో మూగవోయినప్పుడు ఆ అలాపానుభూతితోనూ ఆయా సమయాల్లో- భయంతో, ఆనందంతో, ఉద్రేకంతో, ఉద్వేగంతో, విషాదంతో అతడు చేసిన ఆలాపన" ఆక్రందన- ఔత్సాహిక ధ్వనులలోని ఉదాత్త-అనుదాత్త స్వరాలాప రీతులే 'జానపదగీతాలు'గా, గేయాలుగా ఆవిర్భవించాయన్నది ఒక పరిశీలన.

ప్రశ్న: మరి ఆదిమానవునిలో ఉద్భవించిన కళాఉత్తేజం, 'జానపద కళా రూపంగా' అదొక వాఙ్మయ విశేషంగా రూపొందిన పరిణామదశను స్థూలంగా వివరిస్తారా?

సమా: కాలం గడిచిన కొద్దీ అడవులలో వుంటున్న వీరి జనసంఖ్య పెరుగుతూ వచ్చింది వారి మేధస్సూ పెరుగ సాగింది. ఆ కారణంగా ఎండ-వానలతోనూ, మిట్ట-పల్లాలుగాను, మృగాకీర్ణంగానుఉండే అటవీ నివాసం వదిలి సుభిక్షము, సురక్షితము అయిన మైదాన ప్రాంతాలకు చేరుకున్నారు. జనావాసాలను నిర్మించుకున్నారు. జనులు నివశించే ప్రదేశాలు గనుక 'జనపదా'లనీ, అందు నివశించే వారు 'జానపదు'లనీ, వారి ఆహార- ఆచార- వ్యవహార- నుడికారాలను '**జానపదా**' లనీ అనడం పరిపాటైంది. కాలక్రమేణా వీరిలో కుటుంబవ్యవస్థ యేర్పడింది. జీవికకు ఆధారంగా స్వీకరించిన వివిధ వృత్తులనుబట్టి

వారిలో 'వర్ణవ్యవస్థ'యేర్పడింది. అయితే, ఇది- వారి సామూకహి జీవితానికి అడ్డుగోడగా మాత్రం వుండేది గాదు. ప్రధానంగా ప్రకృతి శక్తుల ఆరాధన, ప్రార్థనా విధానంతో ప్రారంభమైనజానపదసాంప్రదాయిక వాఙ్మయ సంస్కృతి-క్రమేణా వారి వారి సాంఘిక-సామూహిక-కుటుంబ-వృత్తి కార్యకలాపాల్లోకి గూడా విస్తరించింది. మన పూర్వులు తమ వైదిక సంపదను అనుశ్రుత విధానంలో మౌఖికంగా యెంత భద్రంగా కాపాడుకొంటూ వచ్చారో- వీరుకూడా, తాము సముపార్జించిన జానపద వాఙ్మయ సంపదను- అక్షరాస్యులు కాకపోయినప్పటికీ, ఆనూచానంగా ఆనోటా ఆనోటా నిల్పుకుంటూ వచ్చారు. అప్పుడేకాదు. ఇప్పుడూ ఎప్పుడూ ఈ జానపద వాఙ్మయ సంపద అజరామరం. అనంతం. కోలాటాలు, భజనలు, యాలలు. జోలలు,గోరుముద్ద పాటలు, చందమామ పాటలు, నలుగు పాటలు, వాన- వల్లప్పలు, వియ్యాల పాటలు. కయ్యాలపాటలు, వీరులపాటలు. వావి వరుసల పాటలు, వ్యవసాయిక పదాలు, వృత్తులు, ఉపాఖ్యానాలు. నీతులు, తత్త్వాలు మొదలగా యీ వాఙ్మయం సముద్రంలా విస్తరించింది. వీటి ప్రచారాన్నే వృత్తిగా తీసుకొని అనాదులు. జక్కులు, కురవంజులు, పిచ్చుకకుంట్లు, జంగములు, పగటి వేషాలవారు, భాగవతులు మొదలైనవారు జీవిస్తూవుండేవారు. ఆనాడూ, యీనాడూ ముఖ్యంగా తెలుగునాడు వ్యావసాయిక వ్యవస్థకే ప్రాధాన్యం ఇచ్చింది. నిన్న,- మొన్నటి వరకు గృహస్థుడైన తెలుగు రైతు యింటిలో 'తండులాలు నిండుకోవడం అన్నప్రసక్తే వుండేదికాదు,

కాబట్టి అతిధి అభ్యాగతుల ఆదరణకు ఎటువంటిలోపమూ వుండేది కాదు. తమ తమ పల్లెల్లో పర్యటించే జానపద కళాకారులను. కళారూపాలను గ్రామీణులు అభిమానించేవారు. ఆదరించేవారు, కలిగినవారు కలిగినంతలో వితరణ చేసేవారు. తక్కినవారు 'అటుకకు యింత' అని చందాలు వేసుకునేవారు. అదీ రొక్కరూపంలో కావచ్చును.

వస్తు వినిమయ రూపంలో కావచ్చును. సాధారణంగా ఆనాటి పల్లెపట్టుల వారు 'రొక్క-రూపం యెఱుగరు' అంటే ఆశ్చర్యపడనక్కర్లేను. ఈ పద్ధతిగా, తమ జనపదాల్లో జానపద కళారూపాలను ప్రదర్శింపజేసేవారు. ఒక్కొక్క జట్టును ఒక్కొక్కప్పుడు వారం - పదిరోజులైనా తమ గ్రామంలో నిలుపుకొని ఆదరంతో భరించడానికి వెనుకాడేవారు కారు. వీధి భాగవతాలు, జక్కులకథలు, వీరగాధలు, పగటివేషాలు, జంగంకథలు, కురవంజులు, పిచ్చుకకుంట్లు మొదలైన వారి వివిధ కళారూపాలన్నిటినీ ప్రధానంగా జానపదులే కాపాడుకుంటూ వచ్చారు.

ప్రశ్న : ఇప్పుడు ప్రస్తుతం యీ కళారూపాలు, జానపద సాహిత్యం వీటి ప్రగతికోసం జరిగిన, జరుగుతున్న, జరగవలసిన ప్రయత్నం యేమిటో చెప్తారా?

సమా : షుమారు 800 సంవత్సరాలనుండి మాత్రమే వెలువడుతున్న మార్గకవితను అందరూ ఆదరిస్తున్నారు. సంతోషమే. కాని, వేలయేండ్ల చరిత్రగలిగి అపరిమితమైన జానపద గేయ వాఙ్మయం నిరాదరణ కారణంగా రాను రాను పరిమితం అవుతున్నదేమో' నన్న సందేహం కలగడం సహేతుకమే. అయితే, కొందరు విద్యావంతులు, పరిశోధకులు, పరిశీలకులు. జానపద వాఙ్మయాభిమానులు-ఉదాహరణకు శ్రీయుతులు నేదునూరి గంగాధరం - యింకా-"మాలపల్లి" నవలలో జానపదగేయ మాధుర్యాన్ని చదువరులకు చవిచూపిన ఉన్నవ లక్ష్మీనారాయణపంతులు మొదలగు ఎందరెందరో మహనీయుల కృషివల్లనూ, ఆకాశవాణివారి శ్రద్ధ-అభిమానముల కారణంగానూ- కేవలం జానపదులలోనే పరిమితంగా వుండిపోయిన జానపద వాఙ్మయానికి, యిప్పుడు ఒక ప్రత్యేకత యేర్పడింది. ఎందరెందరో విజ్ఞానవంతులైన జానపదకళాభిమానులు శ్రమించి వూరూరూ తిరిగి, విషయ సేకరణ చేసి, పరిశీలించి విశ్లేషణ చేసి. గ్రంథస్థం గావించి అమూల్యమైన జానపదగేయ వాఙ్మయ భాండారాన్ని మనకు అందజేశారు. అట్టి వారందరూ మనకెప్పుడూ

అభినందనీయులే - ఆరాధనీయులే, ఎంతో జానపద సాహిత్యం కాలవాహినిలో కలిసిపోయినా, యిప్పుడు ఆ మహనీయులైన వారి కృషి కారణంగా, మిగిలిందైనా వెలుగులోకి వచ్చింది. విశిష్టస్థానాన్ని పొందింది. ఎందరో మనీషులు, విద్యాధికులు యీ సారస్వతాన్ని ఆకళింపు చేసుకున్నారు, ఆస్వాదించారు. వారి మాటలలోనే-"జానపద సాహిత్యం-తేనెసోనలు జాలువారే మధురిమ" అనీ, "సజీవ చైతన్య స్రవంతి" అనీ శ్లాఘించారు, విదేశ సాహితీవేత్తలు సైతం-"తెనుగు భాష"-నుడికారపు సొంపులో ఇటాలియను భాషకు తులతూగుతుంది" అని ఉగ్గడించారు. నిజానికి-అసలైన తెనుగు నుడికారపు యింపు సొంపులు గ్రహించాలి 'అంటే-జానపదగేయ సాహితీ సముద్రాన్ని మధించక తప్పదు' అని అభిప్రాయపడ్డారు. పండిత ప్రకాండులైన వారి రచనలు రసగుళికలైతే-జానపదకవుల రచనలు చెట్టున పండిన అమృతఫలాల వంటివి. వీటి స్వారస్యాన్ని-అన్యుల అవసరం, ఆసరా లేకుండానే ఆస్వాదించవచ్చు"నని విశ్లేషించారు. పైగా మన వారిలో శ్రీనాధుడు మొదలు చిలుకూరివరకు, త్యాగయ్య మొదలు ద్వారం నాయుడుగారి వరకు (ఫిడేల్ నాయుడుగారు) సరస సాహిత్య సంగీతజ్ఞులైనవారుకూడ జానపదగేయ సాహిత్య నుడికారంలోని సొంపునూ, గేయగానామృత రసంలో వున్న ఇంపునూ పలికించిన వారే. ఒలికించిన వారే.

ప్రశ్న : జానపదగేయం, సాహిత్యం వీటి ద్వారా సంఘానికి చరిత్రకు విశేష ప్రయోజనం యేదైనా వుంటుందని ఆశించవచ్చునంటారా?

సమా : 'విశేష ప్రయోజనం' అంటే-వుండకపోదు అనుకోండి. ఏ కళకైనా ప్రధాన ప్రయోజనం ఆనందాన్ని కలిగించడమే కదా? అందుకే మన పూర్వులు "ఆనందో బ్రహ్మ" అని ఆనంద సంధాయకమైన విధానాలలో "కళ"ను కూడా ఒక సాధనంగా అంగీకరించారు. అదిన్నీగాక, యే జాతికి

సంబంధించిన చరిత్రను గాని సంస్కృతినిగాని సుఖ దుఃఖానుభూతులను గాని—చరిత్రకారులు సువ్యక్తం చేయడానికి అనువైన ఏకైక సాధనం జానపద వాఙ్మయం, తెనుగు భాషాతత్త్వాన్నీ, దాని మూల స్వరూపాన్నీ తెలుసుకోవాలి అనుకునే భాషాప్రియులకు కూడ జానపద వాఙ్మయం చేదోడు వాదోడుగా ఉపయోగపడుతుంది. "కృత యజ్ఞాయ మేధావీ బుధో జానపదశ్శుచిః" అని వాచస్పత్యకారుడన్నట్లు యజ్ఞయాగాదులు చేసి శుచిర్భూతుడైన సోమయాజితోనూ, మహామేధావియైన పండితునితోనూ యీ జానపదకళాస్రష్ట సమానుడు' అని, రసగ్రహణ పారీణులైన పెద్దలు భావించారు.

ప్రశ్న : బాగున్నదండీ! అయితే మీరు ప్రథమంగా యీజానపద కళా-వాఙ్మయాలకు యే విధంగా ప్రభావితులైనారో, యెలా పరిశ్రమించి ప్రయోజనాన్ని సాధించారో, మచ్చుకు ఆ కళారూపాలు ఎలావుంటాయో సంక్షిప్తంగా వివరిస్తారా?

సమా : నా చిన్నతనంలో మా వూళ్లో చాలామంది పాటలు పాడే వారుండేవారు. ఆధ్యాత్మ రామాయణ కీర్తనలు వగైరా వింటూ వుండేవాణ్ని-హరిదాసుల గానం నన్ను ఆకర్షించేది-ఇంకా కోలాటాలు, భజనలు వగైరాలుకూడా.... అడపాదడపా వీధి భాగవతుల బృందాలు ఊరికి వస్తూవుండేవి. వారిని ఊరి వారు వారం, పదిరోజులు ఊరిలో ఉంచి ఆదరించి వారి చేత ప్రదర్శనలు ఇప్పించి "అరక కింత" అని అన్ని కుటుంబాల నుంచి వసూలు చేసి సాదరంగా ఇచ్చి పంపుతూ ఉండేవారు. వారి ప్రదర్శనలు, గానం నన్ను చాలా చిన్నతనం నుంచే ఆకట్టుకున్నాయి. అలా చిన్నతనంలోనే నాకు జానపద కళలపట్ల మక్కువ ఏర్పడింది.

ఇక....గొడ్లకాపరులు పాడే పాటలు మొదలుకొని శ్రమజీవులు-రాళ్ళుకొట్టేవారు మొదలుకొని, వర్షంపడుతూ ఉంటే తాటాకు గొడుగుల కింద కూర్చుని "శరణు శరణు" అని పాడేపాటలు మొదలుకొని

సంబంధించిన చరిత్రను గాని సంస్కృతినిగాని సుఖ దుఃఖానుభూతులను గాని—చరిత్రకారులు సువ్యక్తం చేయడానికి అనువైన ఏకైక సాధనం జానపద వాఙ్మయం, తెనుగు భాషాతత్వాన్నీ, దాని మూల స్వరూపాన్నీ తెలుసుకోవాలి అనుకునే భాషాప్రియులకు కూడ జానపద వాఙ్మయం చేదోడు వాదోడుగా ఉపయోగపడుతుంది. "కృత యజ్ఞాయ మేధావీ బుధో జానపదశ్శుచిః" అని వాచస్పత్యకారుడన్నట్లు యజ్ఞయాగాదులు చేసి శుచిర్భూతుడైన సోమయాజితోనూ, మహామేధావియైన పండితునితోనూ యీ జానపదకళాస్రష్ట సమానుడు' అని, రసగ్రహణ పారీణులైన పెద్దలు భావించారు.

ప్రశ్న : బాగున్నదండీ! అయితే మీరు ప్రథమంగా యీ జానపద కళా-వాఙ్మయాలకు యే విధంగా ప్రభావితులైనారో, యెలా పరిశ్రమించి ప్రయోజనాన్ని సాధించారో, మచ్చుకు ఆ కళారూపాలు ఎలావుంటాయో సంక్షిప్తంగా వివరిస్తారా?

సమా : నా చిన్నతనంలో మా వూళ్లో చాలామంది పాటలు పాడే వారుండేవారు. ఆధ్యాత్మ రామాయణ కీర్తనలు వగైరా వింటూ వుండేవాణ్ని-హరిదాసుల గానం నన్ను ఆకర్షించేది-ఇంకా కోలాటాలు, భజనలు వగైరాలుకూడా.... అడపాదడపా వీధి భాగవతుల బృందాలు ఊరికి వస్తూవుండేవి. వారిని ఊరి వారు వారం, పదిరోజులు ఊరిలో ఉంచి ఆదరించి వారి చేత ప్రదర్శనలు ఇప్పించి "అరక కింత" అని అన్ని కుటుంబాల నుంచి వసూలు చేసి సాదరంగా ఇచ్చి పంపుతూ ఉండేవారు. వారి ప్రదర్శనలు, గానం నన్ను చాలా చిన్నతనం నుంచే ఆకట్టుకున్నాయి. అలా చిన్నతనంలోనే నాకు జానపద కళలపట్ల మక్కువ ఏర్పడింది.

ఇక....గొడ్లకాపరులు పాడే పాటలు మొదలుకొని శ్రమజీవులు-రాళ్ళుకొట్టేవారు మొదలుకొని, వర్షంపడుతూ ఉంటే తాటాకు గొడుగుల కింద కూర్చుని "శరణు శరణు" అని పాడేపాటలు మొదలుకొని



ఆచార్య యన్. జి రంగాతో కర్నాటి

# భారతీయ కళలు - లలితకళా ప్రాశస్త్యం

భారతీయ సంస్కృతీ సంప్రదాయంలో పేర్కొనబడిన చతుష్షష్టి అనగా 64 కళలలో సంగీత- సాహిత్య- అభినయ- చిత్రలేఖనాదులను 'లలిత కళలు' అని చెప్పుకుంటూ వుంటాం. తక్కిన వాటిలో వివిధ వృత్తులకు చెందిన హస్తకౌశలానికి జనుల దైనందిన వ్యాసంగానికీ, సంప్రదాయ పరమైన వేడుకలకు సంబంధించి ఉన్నవి. పాక నిపుణత, పర్యంకరచన, మాలికా రచన వివిధ క్రీడా వినోదాలు తుదకు చౌర్యము అనగా దొంగతనం వంటివి కూడా ఈ 64 కళలలోనూ చోటు చేసుకున్నవి. ఆయాకళలకు సంబంధించినవి శాస్త్ర నిర్దేశ విరచనా కావింపబడినవి. ఉదాహరణకు "పర్యంక రచన" అనే కళను గూర్చి చెప్పవలె నంటేనే ఎంతో వివరణ కావాలి. పర్యంకం అనగా- పాన్పు, శయ్య అని అర్ధంకదా? 'రచన' అనగా దానినిఅమర్చుట 'పర్యంకరచన'అన్నారు. ఇదీ ఒక కళగా చెప్పబడింది. అనగా ఒక గృహిణి ఆనాడు తాను ఏయే శాక-పాకాలను, వంటకములను సిద్ధపరచిందో, యేయే పదార్ధంలోని వస్తుగుణం ఆరోగ్యరీత్యా యెటువంటిదో గుర్తించి, ఆ పదార్థాలలో ఆనాడు తన భర్త ఆప్యాయంగా, ఉదాత్తంగా భుజించినవి యేవేవో గమనించి ఆయన భుక్తాయాస ఉపశమనానికీ, సుఖనిద్రకు ఆనాటి శయ్యారచన యే విధంగా వుండాలి. మొదలగు అంశాలను వివరించేది పర్యంకరచన లేక శయ్యారచన. ఒకసామాన్య గృహిణికే యిటువంటి శాస్త్రీయవిషయాలు ఆవశ్యకమని తెలిపే మన భారతీయ సంస్కృతిలోని వైశిష్ట్యం యెంత మహోన్నతమైనదో ఆలోచించండి! ఇంతటి విజ్ఞానంతో కూడిన ఆచరణమే 'కళారచన' అనిపించుకుంటున్నది. అనగా, కళాత్మకరచనకు విజ్ఞత అవసరం అని అర్ధం అవుతున్నది. అందుచేత విజ్ఞతగలవ్యక్తి స్త్రీ-పురుషులలో యెవరైనా-వారు 'సరసులు'అనిపించుకుంటారు సరసుడైన వ్యక్తి హృదయంలో 'మానవత' నెలవు చేసుకుని వుంటుంది. దీనినిబట్టి కళాభిజ్ఞతగాని, దానితో కనీస పరిచయంగాని, ఆ వాంఛావేశం గాని లేనట్టి మానవజీవితం 'రసహీన' మనీ, 'అసమగ్ర' మని అభిజ్ఞులు అభిప్రాయపడ్డారు. అది ముమ్మాటికీ యదార్ధమేమో కూడా.

ఆయా కళా విశేషాలను అవగతం చేసుకోవడానికే ఎంతో పాండిత్యం అగత్యం అయినప్పుడు ఇక 'లలితకళలు' అనబడు సంగీత-సాహిత్య-అభినయ చిత్రలేఖనాదులు మరెంతటి సునిశిత మేధా సంబంధమైనవో గమనించండి! సున్నితము-సుందరము-సుమనోహరములైనవి కనుకనే వాటిని 'లలితకళలు' అన్నారు. చాల అందమైన పేరు కదూ! అవును. పూర్వం-రాజులు, రాణులు, రాజోద్యోగులు, పురప్రముఖులు యీ కళలను అభ్యసించి, ఆదరించి, ప్రోత్సహించారు. యీనాడు మనలో సంపన్నులు, సామాన్యులు కూడ సంగీత-నాట్యాది లలితకళలను అభిమానించి, అభ్యసించి, ఆదరిస్తున్నారు. ఇది ఆనందించదగిన విషయం.

'చౌర్యం' అనగా 'దొంగతనం' కూడా యీ అరువది నాలుగు కళలలో ఒకటిగా పేర్కొనబడినదని చెప్పుకున్నాం కదా? మన వెనుకటి కాలపు వారు 'చౌర్యం' అనేది 'కన్నపు దొంగతనం' అనే భావించేరు. ఆ కళలో యెటువంటి గోడకు యే విధమైన కన్నం యే సాధనంతో వేయాలి. వ్యక్తి లోనికి ప్రవేశించడానికి అనువైన కన్నపుకైవారం కొలతలు యే విధంగా తీసుకోవాలి. దొంగ ఆత్మరక్షణకు యేయే జాగ్రత్తలు తీసుకోవాలి, ఏ సమయంలో, యెటువంటి వాతావరణంలో చౌర్యానికి ఉద్యమించాలి, ఛద్మవేషం. యెలా ధరించాలి. (అనగా మారువేషం) అన్న విషయ వివరణ ఆ శాస్త్రంలో సమగ్రంగా చెప్పబడి వున్నదట. ఆ శాస్త్రకారుణ్ణే ఆనాటి చోరులు తమ గురువుగా, దైవ సమానునిగా స్మరించుకునేవారట. చౌర్యంకూడా ఒక శాస్త్రమని, ఒక కళ అని ధ్రువపరచే ప్రబలమైన చారిత్రకాధారాలు కూడా వున్నవి. మహారాజు 'శూద్రక' మహాకవి విరచితమైన 'మృచ్ఛకటికమ్' అను సంస్కృత నాటకంలోని ఒక దృశ్యంలో యీ అంశం విపులంగా వర్ణింపబడి ఉన్నది. ఆ నాటకంలో 'శర్విలకుడు' అను సర్వశాస్త్ర పారంగతుడైన ఒక నిరుపేద బ్రాహ్మణ యువకుడు వసంతసేన అను వేశ్యవద్ద (అనగా రాజనర్తకి, దేవదాసి) దాసిగా నున్న తన ప్రేయసియైన మదనికను సేవకావృత్తి నుండి విడిపించి తాను వివాహమాడడానికై, అందుకు మూల్యంగానిర్దేశింపబడిన ధనాన్ని సేకరించడానికి యాచనామార్గాన్ని యిష్టపడక సద్యః ఫలితాన్ని యిచ్చేది, తాను చదువుకొన్న కళల్లో ఒకటియైన 'చౌర్యా'నికి పాల్పడి, ఆ నగరంలో "చారుదత్తుడు" అనే

పూర్వ సంపన్నుని గృహకుడ్యానికి కన్నం వేస్తాడు. 'పూర్వసంపన్నుడు' అనగా- మొదట సంపన్నుడై ప్రస్తుతం సామాన్యుడుగా వున్నవాడని భావం. శాస్త్రం చదివాడేగాని అలవాటులేని కారణంగా అనగా- అది అతని వృత్తికాని హేతువుచేత- కన్నపుకై వారం, తన భుజస్కంధ వైశాల్యం కొలిచి చూచుకోవడానికి అనువైన కొలత్రాడు మరచిపోయి వచ్చినందున తన యజ్ఞోప వీతాన్నే అప్పటికి కొలత్రాడుగా, ఉపయోగించి, కన్నంవేసి ఆ యింటిలో వెలుగుతూవున్న ఆముదపు దీపాన్ని ఆర్పడానికి ఒక్కరెక్కల పురుగును ప్రయోగించి చివరకు ఫలితాన్ని సాధిస్తాడు. సహజంగా దీపాన్ని ఆర్పినపురుగు దీపపుమంటకు రెక్కలుమాడి ఆపురుగు అక్కడే ఆదీపపు ప్రమ్మలోనేచచ్చిపడి వుంటుంది. అదే వృత్తిగాగల వారికైతే ఒక్కొక్క దొంగతనానికి ఒక్కొక్క పురుగును ప్రయోగిస్తారని ఊహించుకోవాలి. రెక్కలపురుగు దీపాన్నిఆర్పడం అందులోనే పడి చావడం సహజసిద్ధం. ఆ మరునాటి ఉదయాన ఆ యింటి యజమాని- ఆయనకూడా సకలకళా పారంగతుడే అవడం వలన తన యింట వున్న యితరుల సొత్తయిన 'సువర్ణభాండం' అనే అతి విలువైన ఆభరణాన్ని కోల్పోయినట్లు తెలుసుకుని కూడా, ఆ కన్నము వేసినవాని రచనా నైపుణ్యాన్నీ దీపాన్ని ఆర్పడానికి ఉపయోగించిన అతని కళా వైదుష్యాన్ని అదే పనిగా మెచ్చుకుంటూ ఆ విచారాన్నే విస్మరిస్తాడు. ఇంతగా ఎందుకు చెప్పవలసి వచ్చింది? అంటే- మన కళల ప్రాశస్త్యం- అంత విశిష్టమైనది' అని తెల్పడానికే.



'మాలికా రచన' కూడా యీ అరువది నాలుగు కళలలో ఒకటిగా పేర్కొన్నారు కదా? ఏయే జాతి పూవులు యేయేకాలంలో అనగా ఋతువులో పుష్పిస్తాయి. ఏ పుష్పాల సువాసన వాని గుణము (అనగా వస్తుగుణము) ఎటువంటిది నాలుగు జాతులుగా చెప్పబడిన యేయే స్త్రీలకు, యే శరీరవర్ణం గల వారికి యే పూవులు ఋతు, తిథి, వార, నక్షత్ర రీత్యా యిష్టమౌతవి? ఎట్టి కేశసంపదను, యే విధమైన కేశ సంస్కారానికి, యే స్త్రీకి యే పూవులు, యే

రచన అందాన్నిస్తుంది మొదలగు శాస్త్ర పరిచయం ఆనాటి పుష్పలావికలకు అభ్యసింపబడేది. మన ప్రబంధ కవులు యీ పుష్పలావికా వర్ణనమును యెన్ని గ్రంథాలలోనో చేసి వున్నారు కూడా. కళాత్మకంకాని విషయాన్ని కవులు అంతగా యెందుకు వర్ణిస్తారు?

ఇక 'లలితకళా ప్రాశస్త్యాన్ని' గూర్చి వివరించాలి. అంటే-ఇవి మానవ మనోరంజనకేగాక సాంఘిక ప్రయోజనాలను గూడ సిద్ధింపజేస్తవి అనడంలో అతిశయోక్తి లేదు. అందులోనూ సంగీత నాట్య-అభినయాలు బహుళార్ధసాధకాలు అనికూడా చెప్పవచ్చును. ఇవి అభ్యాసకులకు ఆత్మతృప్తి, అవయవ పుష్టి, ఆరోగ్యతుష్టి సమకూర్చడంతోపాటు సాంఘిక- ప్రయోజనకారులు' అని చెప్పడానికి చారిత్రకాధారాలు చాలా వున్నవి. [ఇందుకు ఒక ఉదంతాన్ని మనవి చేస్తాను] ఒకానొకప్పుడు కొందరు కూచిపూడి నాట్యకళాకారులు రాయలసీమ ప్రాంతానికివెళ్ళి ప్రదర్శనలిస్తూ ఒక ప్రాంతీయపాలకుని ఆదరణకు పాత్రులౌతారు. అక్కడ అనగా సిద్దవటం ప్రాంతానికి చెందిన 'బేతకొండ' అధికారి-నంబెట గురవరాజు అనునతడు దుర్మార్గుడై ప్రజాకంటకుడుగా పరిణమించి, యీ కూచిపూడి కళాకారులకు ఆశ్రయం యిచ్చిన ప్రాంతీయ పాలకుని-అన్యాయంగా, అక్రమంగా బందీగా పట్టుకుపోతాడు. అంతట యీ కళాకారులు ఆ అధికారి దురాగతాలను, తమ పాలకునిపట్ల ప్రవర్తించిన దారుణాలనూ ఒక 'యదార్థ రూపకంగా' తయారుచేసి ఆదేశపురాజు సమక్షంలో ఆ నాటకాన్ని ప్రదర్శించి, యదార్ధ నిరూపణతోబాటు ఆ రాజుచేత బహూకృతులై తమ పాలకుణ్ని, ఆయన పరగణాను తిరిగి సంపాదించుకున్నారట. 'కళ' విరోధిని సహితం విహితుని చేయగల శక్తివంతము. సాంఘిక ప్రయోజనకరము అని చెప్పడానికి యీ చారిత్రకాధారం చాలును.

ఒకనాడు 'కూచిపూడి నాట్యకళ' శాస్త్ర సమ్మతంకాదు అని-అలా అన్నవారేగాక నేడు యితర దేశవాసులు సైతం కూచిపూడి నాట్యాన్ని సమ్మతించి, సమాదరించి, అభ్యసించి తమ తమ ప్రాంతాలలో, దేశాలలో, విదేశాలలో ప్రచారంచేసి, ప్రదర్శించి, ప్రసిద్ధులౌతున్నారు, ప్రధానంగా నృత్య సంగీతాలు మానవుల దైహిక మనో రుగ్మతలకు దివ్యౌషధ ప్రక్రియలుగా యీనాడు ఉపయోగింపబడుచున్నవనే విషయం పత్రికాముఖంగానూ, కొంత మందికి అనుభవ పూర్వంకంగాను తెలిసినదే. ఇంత ఎందుకు? ఒక్క మాటలో

'యోగాసన' ప్రక్రియలలో యెంత బలమూ, ప్రభావమూ వున్నదో- నాట్య. అభినయ క్రమంలో కూడ అంతటి శక్తి, ప్రయోజనం వున్నది' అని మనం గ్రహించాలి. అలాగే సంగీతం కొన్నిరకముల మనో వ్యాధులకు, మరికొన్ని దైహిక వ్యాధులకు దివ్యౌషధంగానూ, పశువులలో కూడ అధిక క్షీరోత్పాదన కారిగానూ సహాయపడుతున్నది అనే సత్యం- మనకు యీనాడు శాస్త్రీయ ప్రయోగాల ద్వారా అవగతం అవుతున్నది.

తొలినాళ్ళలో మన తెలుగుదేశపు తీరప్రాంతంలో సంగీత- సాహిత్య- నాట్య- అభినయ కళలు ప్రముఖంగా వెల్లివిరిసినట్లు చరిత్ర చెప్తున్నది. నిజమే మరి- సుభిక్షంగావున్నగడ్డపై విద్యలు వికసించాయనడంలో విపరీతంయేమున్నది? త్రిలింగదేశానికి తూర్పు భాగాన వేద-వేదాంగ- వ్యాకరణాది శాస్త్రాలూ, మధ్య ప్రాంతంలో సంగీత-సాహిత్య-అభినయ కళలు, దక్షిణప్రాంతాన కవితా-సాహితీ కళా ప్రక్రియలు అభివృద్ధి చెందినట్లు చారిత్రకాంశం. కృష్ణా మండలంలోని దివ్యసీమయైన దివిసీమలో నృత్య-సంగీత శాస్త్రీయ కళాధ్యయనం పుష్కలంగా జరిగింది. వాగ్గేయకారుడు క్షేత్రయ్య, నాట్యశాస్త్రవేది సిద్ధేంద్రయోగి మొ॥వారు యీ సీమను వెలిగించిన మణిదీపాలే.

అందుచేత నృత్య-సాహిత్య-సంగీత-అభినయాలు అనబడే యీ లలిత కళలు స్వప్రయోజనంతోబాటు సాంఘిక ప్రయోజనకారులు అనేమాట వాస్తవం. కనుక మన బాల బాలికలూ, యువతీయువకులూ 'యోగవిద్య'తో సమానమైన యీ లలితకళాధ్యయనం చేసి, మానవతా విలువలుగల ఉత్తమపౌరులుగా రూపొంది సంఘానికీదేశానికీ ప్రయోజనకారులుగా భాసిస్తారనీ, ప్రతిగృహమూ జంత్ర-గాత్ర నినాద భరితంగానూ ప్రతిగడపా చిరుమువ్వల ఘలఘలల పదనర్తనంతోనూ కళకళ్ళాడుతూ కళా నిలయాలుగా విలసిల్లాలని ఆశిస్తూ, మరొక అభ్యర్థన, ఆకాంక్ష, అదేమంటే ప్రతి సంగీతాధ్యాపకుడూ, ప్రతి నాట్యాచార్యుడూ యీ భారాన్ని మూడువంతులు తమ బాధ్యతగా వహించి- తగిన శిష్యుడు లభించలేదు అనో, ఇంకా తగిన సమయంరాలేదు' అనే ప్రాలుమాలిక వల్లనో, మరి యే ఇతర కారణాన్ని ఆపాదించుకొనియో 'కళా బోధన' పట్ల మాత్రం అలసత్వం చూపి తమ శాస్త్రవిజ్ఞానాన్ని కాలగర్భంలోనూ కళాప్రజ్ఞనుభూగర్భంలోనూ కలిసిపోనీయకజాగరూకులై ముందుగానేమేల్కొని తాము ఆర్జించిన కళాసంపదను అధ్యయన, ఆచరణ, ప్రబోధ ప్రచారముల ద్వారా శిష్య ప్రశిష్యులకు బోధించి ఆ సంపదను అందరకు పంచి, దేశం నలుగడల విస్తరింపజేసి ప్రజాహృదయాలలో, భావి చరిత్రలో చిరంజీవులుగా, సఫలీకృత జన్ములు, సార్థకజీవులుగా వర్ధిల్లగలరని ఆశిస్తున్నాను.

# కళాకారుడు - కళాపోషకుడు

నాట్యం, సంగీతం, కవిత్వం వినోదానికై పుట్టినవి కావు. వినోదం కూడా వాటివల్ల కలుగవచ్చును. లలిత కళల లోతుపాతులు తెలియని కళా సాధకులు, నటకులో, గాయకులో, కవులో అయినప్పుడుగాని-వాటిని దర్శించువారో, వినువారో, చదివేవారో అయినప్పుడుగాని, ఆ కళలు కేవలం వినోదపు పొలిమేరలలోనే తిరుగుతూవుంటాయి.

అలాగాక, సాక్షాత్తు కళలు చైతన్యవంతం అనే పరిజ్ఞానం కలిగి, అవి ఆనందరసానుభూతిని యివ్వకలిగేవి అన్న విశ్వాసంవున్నప్పుడు, ఆ కళలను ఉపాసించేవారు సత్యసాధకులైనప్పుడు అవి వినోదాన్ని మాత్రమే కలిగించి వూరుకోవు.

మహా కవి కాళిదాసుచెప్పినట్లు నిప్పు, నీరు, నేలగాని ఆకాశం, సూర్యుడు, చంద్రుడు, అగ్ని హోత్రి—ఈ ఎనిమిదిన్ని ఈ అఖండమైన ప్రకృతిలో ప్రత్యక్షమైన సాక్షీభూతములే.

ఈ ప్రకృతిలోని పదార్థాలన్నీ, ఈ ఎనిమిది పదార్థాలతో నిర్మితమైనవే. అంటే, ఈ విశ్వమంతా సత్యసాక్షీభూతమైన స్వరూపమే!

అభినయం నాలుగు విధాలుగా ఉన్నదని అందరికీ తెలిసినదే.

సర్వ మానవుల కంఠస్వరాలు, పక్షులకోలాహలాం, జంతువుల నాదాలు, పిడుగులు పడే మహాప్రభంజన ధ్వని మొదలుకొని, పూవుచుట్టూ ప్రదక్షిణం చేసే తుమ్మెదల రొద వరకు ఈ ప్రకృతిలోని మహాస్పందనమే!

ఈ అనంతాకాశంలోని సూర్య, చంద్ర, నక్షత్రాదులు: భూమి పై తరులు, గిరులు సర్వమూ ఈ సుందరప్రకృతి కాంతకు ఆభరణాలే!

ఈ ప్రకృతిలో సమస్త ప్రాణికోటి వ్యక్తపరచే సమస్త భావాలు ఉద్దీప్తం చేసే ప్రకృతి ఫలితమే.

ఈ విధంగా ప్రకృతి రమ్యమైన. భావయుక్తమైన నాట్యం చేస్తూనేవుంది. కాని, ఆనాట్యం మనకు కనపడదేం? అనే ప్రశ్నమీకుకలుగవచ్చు. ఆనాట్యాన్ని చూసే కళ్లుమనకులేవేమి? అనే ప్రశ్న అందరికీ కల్గదు. ఇదే మానవుడిలోవున్న అజ్ఞానం.

కాని, కళోపాసకునకు ఈ రహస్యమంతా తెలుసును.

మహాతత్త్వ వేత్త ఐన కళోపాసకునకు సంగీత, సాహిత్య సంభరితమైన ఈ ప్రకృతి ఒక మహా నాట్యం అని తెలుసును.

ఈ నాట్యాన్నిచూసేకళ్ళుతనకుగాని, తనసాటి వారైనసామాజికులకుగాని, లేదని గూడా తెలుసును.

అందువల్లనే మనసా. వాచా, కర్మణా విశ్వసించి, ఈ మహా నాట్యాన్ని తాను అనుసరించి, ఈ విశ్వనాట్యాన్ని దర్శించే కళ్లను, తాను సంపాదించుకుంటూ, సామాజిలకు గూడా అట్టి దివ్య నేత్రాల్ని సంపాదించి పెట్టాడు.

తన నాభిస్థానాన్నుండి నాదాన్ని ఉద్భవింపచేసి, మహాగాయకుడై, వాచికాభినయములతో ఒక దివ్యమైన శ్రవణాన్ని సంపాదించుకుంటూ, సామాజికులకు పైతమూ సంపాదించి పెట్టాడు.

ఈ ప్రకృతి ఒక మహా కళాఖండం. అందులోవి కదలికలన్నీ నాట్యభంగిమలు. ధ్వనించే ప్రతీస్వరం, నాదం, సంగీత విన్యాసాలు కనపడే ప్రతీరంగూ కళాసంభరితమే.

ఈ విశాల విశ్వంలోని ప్రతీభావాన్ని తాను తెలుసుకొని, తోటి మానవులకు తెలియచేయువాడు ఒక్క కళోపాసకుడే! గనుకనే అతనిని "కళాస్రష్ట" అన్నారు.

ఆ "కళాస్రష్ట" నటుడో, గాయకుడో, చిత్రకారుడో, శిల్పియో ఎవరైనా మన హృదయాల్లో నిలిచి, ధామకొని, గౌరవింపదగినవాడు,

తెలిసిగాని, తెలియకగాని, నట, కవి. గాయకాదులను మనం సహజంగా గౌరవిస్తూనే వున్నాం. సన్మానిస్తూ వున్నాంగూడా. అతనియందు మహత్తరమైన అంశం వ్యక్తమగుచున్నది. సామాజికుని యందుగూడా మహత్తరమైన అంశం వుంది. గనుక కళోపాసకుని మహత్తరాంశంలో మహత్తరంగా లీనమగుచున్నాడు.

నటకాదులు, సామాజికులు మహత్తరాంశంగలవారే. కాని, ఒకరి యందు మహత్తరాంశం వ్యక్తమగుచున్నది-ఒకరియందు అది వ్యక్తం కానప్పటికి, అనుభవించి, ఆనందించి, అభినందిస్తూ వున్నాడు.

మహత్తరాంశాన్ని వ్యక్తీకరించినవాడు పూజ్యుడగుచున్నాడు.

ఉన్నతాంశములను వ్యక్తీకరణంచేయు నటుడో, గాయకుడో, చిత్రలేఖకుడో, శిల్పియో అయి, పూజింపబడుచున్నాడు. అట్టి వాని ఉన్నతాంశములను సందర్శించి. సామాజికుడు ఆనందాన్ని అనుభవిస్తూ వున్నాడు.

మహత్తరానంద రసైక్యాన్ని అనుభవింప చేస్తూవున్న "కళాస్రష్ట" ఆనందాన్ని అనుభవిస్తూవున్న సామాజికునకు పూజ్యుడగుచున్నాడు.

"కళాస్రష్ట"ను, అతని కళాసృష్టికి దోహదంచేసే సామాజికుడుగూడా పూజ్యుడే అగుచున్నాడు. కావుననే "కళాస్రష్టల"ను పోషించు సహృదయులైన సమాజికులుగూడా సన్మానార్హులే!

కవుల కావ్యములకు శ్రోతలుగా వుండి, ఆ కావ్యాల్ని తమకు అంకితంగా స్వీకరించి ధన్యులమయ్యాము అనుకున్న శ్రీకృష్ణదేవరాయాదులు, నేటికిని చిరస్మరణీయులే.

"కళాస్రష్ట"లకు మనసా, వాచా, కర్మణా తోడ్పడి, వారి జీవిత విధానములకు సహాయ, సంపత్తులను అందిస్తూవున్న సామాజికులు ఎంతో సన్మానార్హులు,

ఈ విశాల విశ్వం సుమధుర, సుందర చైతన్య స్వరూపమైనప్పుడు పూజార్హం కానిదేముంది?

(విజయవాడ మర్చంట్ అసోసియేషన్ వార్షికోత్సవ సభలోని సంగ్రహపాఠం)



కన్నడ సేవా సంఘంవారు నిర్వహించిన సభలో జానపద గేయాలు గానం చేస్తున్న శ్రీ కర్నాటి

# తెలుగునాట జానపదకళారూపాలు

—శ్రీ కర్ణాటి

రమారమి 2,500 సంవత్సరాల సుదీర్ఘ చరిత్రవున్న మన జానపద కళావాఙ్మయ చరిత్రను సమగ్ర పరిచయ ప్రయత్నం చేయడం ఒక విధంగా సముద్రానికి ఏతాం యెత్తడం వంటిదే. ఇంకా అజ్ఞాతంలో మిగిలిపోయిన జానపద వాఙ్మయం ఎంతో వున్నది. ఆ పెన్నిధిని వెలికి తోడే భగీరథ ప్రయత్నం యీ తరంలోనే జరగాలి.

లేకపోతే ఆ సంపదకొంత కాలగర్భంలో వుండిపోయే ప్రమాదం వుంది ఆ సంపదను భావి తరాలవారికి అందజేయవలసిన బాధ్యత మనమీద వున్నది. అయితే, యీ ప్రయత్నం నాటినుండి నేటి వరకు ఎంతో కొంత జరుగుతూనే వున్నది.

దీనికై తన జీవితాన్నే నైవేద్యంగా సమర్పించినవారు. నిరాడంబర మూర్తి నేదునూరి గంగాధరంగారు చిరస్మరణీయులు. ఈ మహనీయుని సాహితీ ఋణం, తెలుగుదేశం యెన్ని తరాలకైనా తీర్చుకోలేదేమో? ఈ మహత్తర కృషిలో ఇంకా శ్రమిస్తున్నవారు శ్రీయుతులు(ఎల్లోరా, బి.రామరాజు) మున్నగువారు ఎందరో వున్నారు.

మానవ మనో వికాసానికి, సాంస్కృతిక ప్రగతికి ప్రథమ సోపానం ఈ జానపద సాహిత్యం, గ్రామికుడైన జనపదుని మనుగడలోని శ్రమను విస్మరింపజేసేది. మనసులు నవనవోన్మేషం కావించేది కళ, ఇది సర్వజనామోదకరమైనది గనుక 'జానపదకళ' అని పిలువబడుతున్నది. ఈ సృష్టిలోగల అందచందాలు, మానవతాదిగుణములు, అతని స్వభావ సంప్రదాయాలు యీ జానపద గేయ సాహిత్య నృత్య నాటకాలలో వర్ణింపబడి వున్నాయి.

సిసలైన జాతి జీవన విశేషాన్ని తెలుసుకోవాలి అంటే పల్లెపట్టులనే దర్శించాలి. అక్కడ మాత్రమే కల్తీలేని ఆచారాలు, కాపట్యం యెరుగని వ్యవహారాలూ దర్శనమిస్తాయి.

జాతి నాగరికత సంస్కృతి అర్థం అయ్యేది అక్కడే. నాగరికత పైకి కనిపించేదికాగా సంస్కృతి అంతర్గతం అయినది.

జానపద వాఙ్మయం యావత్తూ గేయాలు, చెక్క భజనలు, కోలాటాలు, విసురు రాతిపాటలు జాజర పాటలు, పల్లెపదాలు మొదలగు అనేక పాటలలో సాక్షాత్కరిస్తుంది. ఈ నిసర్గసంపదను అంతటినీ దోసిళ్ళకొద్దీ మనకు అందించేది జానపద వాఙ్మయ భండారమే. అనాదిగా ఆనోటా ఆనోటి పఠన పాఠన మననాదుల వలన వేద వాఙ్మయం అనూచానంగా యెలా సంరక్షింపబడుతూ వస్తున్నదో అలాగే ముఖ్యంగా తెలుగు గ్రామీణ స్త్రీల నోటా పాటలలో కాపాడబడి జానపద గేయ కళా సంపద యీనాటి వరకు చెక్కు చెదరకుండా నిలిచివున్నది. ఈ జానపద కళా సృష్టికర్తకూడా శ్రమజీవేనన్న మాట గుర్తుంచుకోవాలి.

ఇక జానపద కళారూపాల దృశ్య విభాగంలో తోలుబొమ్మలాటలు, బుఱ్ఱకథలు, పగటివేషాలు, వీధి భాగవతాలు మొదలైనవి మనకు అనాదిగా వస్తున్న కళారూపాలు.

తోలుబొమ్మలాటలు : ఆనాటి తోలుబొమ్మలాటలే యీనాటి చలన చిత్రాలకు స్ఫూర్తిని కలిగించాయని చెప్పుకున్నా తప్పులేదేమో.

పగటివేషాలు : ఈ కళలో సుప్రసిద్ధులు సున్నపు వీరయ్యగారు. కూచిపూడి భాగవతులు. వీరు తమ పగటి వేషాలతో, ఊరూరా పర్యటించి ప్రచారంచేసి ప్రజలకు విభ్రమ ఆనందాలను అందించి ఈ కళావిశేషానికి వన్నె తెచ్చారు. ఇప్పటికీ సున్నపు వీరయ్యగారి కాళికావేషం, కూచిపూడివారి అర్ధనారీశ్వరంవంటి వాటిని, తెలుగునాట పెద్దలుయిప్పటికీ సంస్మరించుకుంటూనే వుంటారు. ఈ పగటి వేషాలలో "పిట్టలదొర" అన్నది విలక్షణమైనది.

వీధి భాగవతాలు : ఇందు ప్రఖ్యాతి నందిన జానపద కళాకారులలో వెంకటస్వామి, అందే కోటాదాసు మొదలగువారు.

బుర్రకథలు : ఈ కళారూపం వీరగాథా కథనానికీ, దేశభక్తి ఉత్తేజనకు, ప్రజాచైతన్య ప్రచారాలకు సహజసుందరంగా వినియోగింపబడుతుంది. ఇందు సుప్రసిద్ధులు గుంటూరుజిల్లా రెంటపాళ్ళ వాస్తవ్యులు మోర్జంపాటి పోతువీరయ్య దేవర (గడ్డి జంగం) దావులూరి వాస్తవ్యులు దొడ్డవరపు వెంకటస్వామి, ఆధునికులలో పద్మశ్రీ నాజర్ మున్నగువారు ఈ కళారూప ప్రదర్శనలో లబ్ధప్రతిష్ఠులైనారు.

నాటక కళ : ఈనాటి నాటక కళారూపానికి మూలం ఆనాటి తోలుబొమ్మలాటలు. వీధి భాగవతాల పరిణామ వికాసమే అని తెలుస్తున్నది. బొమ్మలాటల లోని తోలుబొమ్మల స్థానంలో మనుష్యులే సజీవ పాత్రధారణచేసి తొలుతగా మూకాభినయం, తర్వాత ఆ అభినయానికి వాచకం. సంగీతం జోడింపబడి ఆ విధానం నియమ బద్ధమై, శాస్త్రగతమై భాగవత-నాటక రూపాలుగా పరిణతి చెందింది. తెలుగుదేశానికి మహారాష్ట్రనుండి 'ధార్వాడ కంపెనీ' వారి రాకతో ఆధునిక తెలుగు నాటక వికాసం ఆరంభం అయిందని చెప్పుకోవచ్చును.

రాజమండ్రిలో కందుకూరి వీరేశలింగం, కృత్తివెంటి నాగేశ్వరరావులు నాటకసమాజం స్థాపించి ప్రదర్శనలు ఇచ్చారు. అలాగే ఏలూరులో శ్రీ మోతే నారాయణరావు జమీందారు, కందుకూరి అంబికానాథవరప్రసాదరావులు శ్రీ సీతారామాంజనేయ నాటక సమాజాన్ని, కృష్ణవేణీ తీరమైన విజయవాడలో మైలవరం రాజా సూరానేని పాపయ్యారావు బహద్దూరువారు బాలభారతీ నాటక సమాజాన్ని స్థాపించి నాటకాలు ఆడించి, ఎందరెందరో మహానటుల ప్రాదుర్భావానికీ, నాటక ఆవిర్భావానికి ఆస్కారం కలిగించారు. ఆ విధంగా తెలుగుదేశంలోని నగరాల్లో, పట్టణాల్లో నాటకసంఘాలు యేర్పడి నాటక కళకు దోహదం చేశాయి. ఆనాటి మహానటుల కోవలోనివారే కీ॥ శే॥ బళ్లారి టి.రాఘవ, హరిప్రసాదరావు, ముంజులూరి కృష్ణారావు మొదలైన నిస్వార్థ నటతపస్వులు సంస్మరణీయులు.

మన ఆధునిక తెలుగు సాంఘిక నాటకరంగం ప్రవర్ధమానం అవుతున్నది. ఈ ప్రక్రియలో కీ॥ శే॥ డా.గరికపాటి రాజారావు మొదలగు ప్రముఖులు విశేష ప్రయోగాలు చేసి కృతకృత్యులైనారు. ఇంతకూ సాంఘికమైనా, పౌరాణికమైనా మరొకటియైనా ఒకదానికి మరొకటి పోటీకాదు అనే సత్యాన్ని మనం గుర్తించాలి. వెనుకటి ఆముదం దీపాలపై కాగడాలు, వాటిమీద గ్యాస్‌లైట్లు, వాటిమీద కరెంటు దీపాలు ఆధిపత్యం వహిస్తున్నవనే భావన యెంత అసంగతమో, పగటి వేషాలపై భాగవతాలు, వాటిమీద నాటకాలు, నాటకాలపై సినిమాలు, వాటిపైన నేడు టి.వి.లు దెబ్బతీస్తున్నాయని అనుకోవడం అంత అసంగతం. ఎందుకంటే సంప్రదాయానుసారం సామాజిక స్ఫూర్తితో నియమబద్ధంగా చిత్తశుద్ధితో, ఉచిత గురు ప్రబోధంతో రచింపబడిన ఏ కళారూపమైనా నేటికీ - ఏనాటికీ తన ప్రత్యేకతను నిల్పుకుంటుంది. సందేహంలేదు కళాప్రయోజనం అన్నింటికీ ఒక్కటే, అదే వినోదం విజ్ఞానం. వికాసం. రస హృదయం. కళా చైతన్యంగల ప్రజానీకం వున్నంత వరకు కళ సజీవమై వుంటుంది.

[విశాలాంధ్ర సౌజన్యంతో]

(మధిర జూనియర్ కళాశాలలో కర్నాటి ప్రసంగ పాఠం)



రవీంద్రభారతిలో శ్రీ కర్నాటిని సత్కరిస్తున్న శ్రీ నందమూరి తారక రామారావుగారు

# హాస్యరసం

హాస్యరసానికి స్థాయీభావం హాసము; హాసము అంటే నవ్వు వికృతమైన ఆకారం, వికృతమైన చేష్టలు, చూసినప్పుడు కలిగే ముఖవికాసం హాసమని శాస్త్రం చెబుతున్నది. హాసము అనేక విధాలుగా వుంటుంది, కొందరు నేలబడి నవ్వుతారు. కొందరికి నవ్వేప్పుడు కంటినీరు చారికలుగా కనిపిస్తాయి. మరి కొందరు చిరుమందహాసంచేసి వూరుకుంటారు. ఇది సుకుమారంగా వుంటుంది. సాధారణంగా ఏ కొందరో తప్ప స్త్రీలందరూ సుకుమారంగానే నవ్వుతారు.

వికృతమైన చేష్టలవల్ల కలుగు హాసమునకు ఆధారభూతమైన వాడు విదూషకుడు. సంస్కృత నాటకాలలో తరచుగా ఇట్టి విదూషకులు సాక్షాత్కరిస్తూ వుంటారు. సంస్కృత నాటకాధారంగానే నేటి సినిమాలలోసైతం విదూషకునికి స్థానం కల్పించారు. అంటే అది అతిశయోక్తి మాత్రం కాదు. సంస్కృత నాటకాలలో విదూషకుడు నాయకునికి మిత్రుడుగా వుంటూవుండటం సాంప్రదాయం. విదూషకుడు సాధారణంగా తెలివితక్కువ వాడుగానూ, భోజనప్రియుడుగానూ కనిపిస్తాడు. కావ్యరచయితలు మాత్రం విదూషకుని పాత్రను ప్రవేశపెట్టలేదు.

కాళిదాసుని 'అభిజ్ఞాన శాకుంతలం' నాటకంలోని విదూషకుడు తెలివి తక్కువ వాడుగా, తిండిపోతుగా, పిరికివాడుగా వర్ణించబడ్డాడు. కాని కాళిదాస కృతమైన 'మాళవికాగ్నిమిత్రం'లో విదూషకుడు మిక్కిలి నేర్పరిగా వర్ణించబడ్డాడు. బుద్ధిమంతుడుగా కూడా ఆ పాత్ర కానవచ్చింది. శాస్త్రగ్రంధాలలో ఇంతకు మించిన వివరం లేదు.

కాని లోకాన్ని పరిశీలించిచూస్తే హాస్యరసం యొక్క స్వరూపం ఇంతకు మించి బహు విధాలుగా కానవస్తుంది నాలుగు, లేదా అయిదేండ్ల బాలికను

పరిశీలిస్తే యుక్తవయస్సు వచ్చిన కన్యలాగా పయిట సవరించుకోటం అభినయించినా, తల్లిలాగా అభినయించినా ఆ చిన్నారి బాలిక హావభావాలు చూచి మనం నవ్వుకుంటాం. దైనందిన జీవితంలో ఇదేవిధంగా ఎన్నో సంఘటనలు మనకు నవ్వు పుట్టిస్తూ వుంటాయి. జీవితాన్ని నిశితంగా పరిశీలించి చూస్తే వందలాది విషయాలు మనకు నవ్వు పుట్టిస్తాయి. ఒక్కొక్క నవ్వు వెనుక ఒక్కొక్క భావం దాగి వుంటుంది. ఆ భావం ప్రేమమయం కావచ్చు, ధూర్తగర్భితం కావచ్చు.

వెనుకటికి 'తిక్కనగారి నవ్వుల'ని, విశ్వనాథవారు ఒక వ్యాసం రచించారు. అందులో శ్రీకృష్ణుని నవ్వుల తీరును సోదాహరణంగా వివరించారు. అనుభవాన్నిబట్టి కావ్యములలో ఉదాహరణలను బట్టి చూస్తే శాస్త్రాల్లో చెప్పిన వికృత చేష్టల వలన కాక ఇతర హేతువులనుబట్టి హాసము కలుగుతుందని తెలుస్తుంది.

శాస్త్రకారులు హాసము, పరిహాసము, అపహాసము, అట్టహాసము అని నాలుగు విధములుగా హాసమును వర్ణించారు. ఒక్క హాసము తప్ప మిగిలినవన్నీ తమోగుణప్రేరణవల్ల కలుగుతాయని తెలుస్తుంది. హాసము మాత్రం సుకుమార సుందర భావముల వెనుకదాగియుండుటచేత కలుగుతుందని అనిపిస్తుంది. ఇంచుమించుగా ఏదో ఒక విధమయిన నవ్వులేని భావమున్నట్లు కనపడదు,

## హాసములో గల గొప్పతనం

ఒక్క హాసము వెంట వున్న నవ్వుకు తప్ప మిగిలిన నవ్వులన్నింటి వెనుక ఏదేని ఒక కాలుష్యమో, క్రోధమో, ఏవగింపో, ధూర్తమో, ఏదో ఒక తమోగుణం ప్రధానమయిన భావం వున్నట్లు కనబడుతుంది. ఇలాంటి కలుషితమయిన భావాలను కొంత వడపోత కలిగి శుద్ధిపొందిన విషయము వాస్తవమే మోగాని, శుద్ధ స్ఫటికం లాంటి నవ్వుమాత్రం కాదు.

పసి పిల్లలు నవ్వుతారు. దాని వెనుక ఏమున్నది? పరిశుద్ధమయిన స్ఫటికము వంటి జీవలక్షణం తప్ప మరేమీలేదు.

పూమొగ్గలు రేకులువిప్పి వాటి పరిమళం వెదజల్లుతాయి. ఆ దశతో వాటికి పూలని పేరు. పువ్వులు విచ్చుకుని పరిమళించటం వెనక ఏముంది? ఏమీలేదు! అది అట్లా విచ్చుకోనటం దాని సహజ స్వభావం! పిల్లల నవ్వు కూడా అంతే! సహజమయిన జీవలక్షణం!!

ఆత్మానందస్వరూపం, ఆనంద స్వరూపం అని చెప్పటం లోక వ్యవహారం. వాస్తవానికి రెండూ ఆత్మానందమే. ఆనందంయొక్క స్పందనే నవ్వు. ఆ స్పందన లోలోపల కలిగి కనులయందు విరిసి ముఖంనిండా పులుముకొని పెదవుల మీద విచ్చుకుంటుంది. దానిని మనం నవ్వు అంటున్నాం. అయితే ఇలాంటి నవ్వును, ఆనంద స్పందనతో కూడిన నవ్వుకు క్రోధాది కలుషిత భావాల స్పర్శ ఏ విధంగా కలిగింది అనే ప్రశ్న ఉదయిస్తుంది. చిరునవ్వుకు కలుషిత భావాల స్పర్శ ఎలా కలిగింది? ఎలా అంటే పలు రంగుల అద్దపు ముక్కల్ని మనం వరుసగా అమర్చి చూద్దాం. చూస్తే, ఆ ముక్కలకు వెనక ఒక స్వచ్ఛమైన దీపము వెలిగిస్తే, వెనుకవైపు నుంచి దీపం వెలుగు స్వచ్ఛమయిన రంగుల అద్దం ముక్కలద్వారా రంగురంగులుగా కనపడుతుంది. అదే విధంగా నవ్వు స్వచ్ఛమైందే! రంగే చిరునవ్వుకు పట్టిందని చెప్పే కాలుష్యం. వాస్తవం అని దేనిని అనుకుంటామో అది స్వచ్ఛమయింది.

పసిపాపల నవ్వు కేవలం స్వచ్ఛమైంది. పసితనంలో క్రోధం, ఈర్ష్య వంటి కలుషిత భావాలు ఉండవు. కనుకనే 'బాలవాక్యం-బ్రహ్మవాక్యం' అనే నానుడి పుట్టింది. అందువల్లనే పసిపిల్లల నవ్వు ఆనందదాయకమయిన, శుద్ధమైన ఆనంద స్పందనం.

హాస్యరసంకాక మిగిలిన రసాలలో ఇలాంటి స్థితిలేదు హాసం మొదటి నుండి పరిశుద్ధమైన ఆనందమయం!!

('రోటరీ క్లబ్ ఆఫ్ విజయవాడ ఈస్ట్'లో శ్రీ కర్నాటి ప్రసంగ పాఠం)




"మాభూమి" నాటకంలో రాముడు పాత్రధారిగా కర్నాటి.



"ఎవరు ద్రోహి" నాటికలో ఎం.ఎల్.ఏ. పాత్రధారిగా కర్నాటి



ఆంధ్రప్రదేశ్ నాటక అకాడమివారు విజయవాడలో కర్నాటిని సత్కరించిన సందర్భంగా ఆనాటి మేయర్ శ్రీ టి. వెంకటేశ్వరరావు, శ్రీ కృష్ణంరాజు, శ్రీ సుంకర కనకారావు.